శ్రీరస్తు.

# పద్యకాదంబరి

(మహాకవి బాణుని కాదంబరికాంధ్రానువాదము.)

అనువాదకుఁడు:

వెలిది శేషయ్యశాస్త్రి.

శ్రీరస్తు.

# పద్యకాదంబరి

(మహాకవి బాణుని కాదంబరికాంధ్రానువాదము.)



అనువాదకుడు:

వెలిది శేషయ్యశాస్త్రి.

# మనవి.

బాణుని కాదంబరిలోఁగనుపట్టని కల్పనలున్ను, అలంకారము న్ను, భావములున్ను, వర్ణనలున్ను, మఱియెచ్చటను గనుపట్టవని ప్పెదరు. అట్టియుత్తమగ్రంథమునకు నింతవఱకును యథామూలాను దము లేదు కావున, నాకొఱతను దీర్పవలెనను కుతూహలంబున ం కిందటిసంవత్సరము విజయదశమీశుభదివసంబున నీగ్రంథమును ంధ్రపద్య రూపంబుగ ననువదించుటకుఁ బూనుకొని సుమారు [illegible] గ్రంథమును బూర్తిచేసితిని. అనువాదవిషయమునఁ [illegible] ని చండికాభవన వర్ణనా సందర్భమునమాత్రము ల గ్రంథములోని విషయంబును సంగ్రహంబుగఁ దెనిఁగించియుంటి మనవి చేయుచున్నాను. ఇంత యుత్కృష్టగ్రంథమ్ము ననువదించు ఁ జేయఁబడిన యీమార్పొక పెద్దతప్పిదముఁ గాదని నావలెనే పాఠ ంగూడ తలంతురని భావించుచున్నాను.

నే నీగ్రంథరచనమును ముగించి యటనటఁ బండితులకు వినిపించు చినసమయమున వారిలోఁగొందఱు కాదంబరి నిదివఱలో నెవరె యాంధ్రీకరించియుండిరనియుఁ గాని యిట్టి యథామూలానువాదం ఱలో లే ము నీగ్రంథమ్ము నిట్లాంధ్రీకరించుట యుక్తంబనియుఁ రి.

ఈగ్రంథంబును ముద్రింపవలసినదని నన్ను బ్రోత్సహించి వ్రాసితు ను, నిది యముద్రితముగనున్నయపుడే దీనిని గని తమయభిప్రాయం నొసంగిన పండితవరులకును, నాకు సంస్కృతసాహిత్యవ్యాకరణము జ్ఞానమును గలిగించి యీగ్రంథానువాదంబునకుఁ దగినశక్తి ంచిన నాగురువులగు బ్ర॥ శ్రీ॥ కొంపెల్ల సత్యనారాయణశాస్త్రులు కిని, యీగ్రంథమునకు దయతోఁ బీఠిక వ్రాసి యిచ్చినందుకు

మ॥ రా॥ శ్రీ చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారికిన్ని, యీ గ్రంథముద్రణ వ్యయమునెల్లను భరించి నాకుమాత్రమేకాక లోకంబునకును మహోపకారమొనర్చిన మాబావమఱఁదియగు బ్ర॥ శ్రీ॥ గోరుగంతు జానకిరామయ్యగారికిని, దీనిని స్వల్పకాలములోనే ముద్రించి యిచ్చిన కాకినాడ ముద్రాక్షరశాల వారికిని వినయపూర్వకముగా ననేకప్రణామంబు లర్పించుచున్నాను.

ఎవరైనను నీగ్రంథములోనుండులోపములను నాకుఁ దెలి[illegible] జేసినచో నాలోపమ్ములను సవరించుకొని కృ
గలవాఁడ.

పాశర్లపూడి,
29-9-37.

ఇట్లు,
వెలిది శేషయ్యశాస్త్రి.

# తొలి పలుకు.



ఈ పద్యకాదంబరీకావ్యము "బాణోచ్ఛిష్టంజగత్సర్వం" అను ప్రఖ్యాతిఁగాంచిన మహాకవి భట్టబాణవిరచితంబైన సంస్కృత కాదంబరీగద్యకావ్యమునకు భాషాంతరీకరణము. ఇయ్యది బ్రహ్మశ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారనునొకయువకునిచే గద్యపద్యాత్మకముగా రచియింపఁబడినది. ఒకనాఁటియుదయమున వీరిగురువులును, నాకు మిత్రులు నగు బ్రహ్మశ్రీ కొంపెల్ల సత్యనారాయణశాస్త్రిగారు నాకడకు వచ్చి కొంచెము వెలితిగా నచ్చుపడ్డ నైదాశ్వాసములుగల గ్రంథము నాచేతఁబెట్టి యీగ్రంథమునకు నొకపీఠిక వ్రాయవలసినదని నన్నుఁ గోరినందున వారిమాటలను దీసివేయఁజాలక గ్రంథమును గైకొని యచ్చటచ్చటఁ గొన్నిపద్యములనుఁ బఠించితిని. గ్రంథము రసవత్తరముగా రచియింపఁబడినదనుభావ ముదయించుటయె గాక గ్రంథమునంతయు నామూలాగ్రముగాఁ బఠించవలెననునాసక్తి మొలకెత్తి నాహృదయము నాకర్షించి నన్నుఁ బురికొల్పుటచేత నల్పజ్ఞుఁడనైనను నట్లె వ్రాయుదునని యంగీకరింప సాహసించితిని. గ్రంథకర్తగారు రెండుమూఁడు దినములకుఁ దరువాత నాకడకు వచ్చులోపలనే యీభాగమునంతయు రెండుమూఁడు తడవలు పఠించి మిక్కిలియానందించితిని. అంతకుఁబూర్వము గ్రంథకర్తను నేను వినియుండకపోవుటయే గాక చూచికూడ నుండలేను. తరువాత వారు కాన్పించినవెనుక వారు నాకుమిత్రులగు బ్రహ్మశ్రీ వెలిది రామమూర్తిసిద్ధాంతిగారి కుమారులేయని తెలిసికొన్నప్పుడు నాయానందము మఱింత యెక్కువయినది. ఇరువదియాఱుసంవత్సరములకంటె మించినవయస్సులేని యీయువకుఁడిట్టి సుప్రసిద్ధమహాకావ్యభాషాంతరీకరణమునకు సాహసించి యింతనిర్దుష్టముగను, రసవం

తేముగను, మూలానుగుణముగను విద్వజ్జనప్రశంసనీయముగ నుండు నట్లు రచియించి నిర్విఘ్నముగ విజయముఁగాంచుట నామనంబున కెంతో యాశ్చర్యమును గొల్పినది. ఎచ్చటెచ్చట నేభాగమును బఠించినను నిర్దుష్టమగుభాష, మృదుమధురమగుశైలి, సరళమైన పద్యగమనికయుఁ గలిగి సలక్షణముగాఁ జక్కనై యుండెననుట కెంతమాత్రమును సంశ యింపఁబనిలేదనినొక్కిచెప్పఁగలను. అర్థశ్లేషలతో, శబ్దశ్లేషలతో బహుదీర్ఘసమాసములతో, గంభీరభావములతో, నానావిధాలంకార ములతో నిండిన మూలగ్రంథమగు సంస్కృతగద్యకాదంబరిని నాంధ్రీక రించుట బహుకష్టసాధ్యము. ఇంకఁ బద్యకావ్యముగ రచియించుట యెం తకష్టసాధ్యమగువిషయముగ నుండునో వేఱుగఁ బాఠకులకు విశదప ఱుపఁ బనిలేదు. ఈరీతిగా నిట్టిమహాకావ్యమును బదిమాసములలోఁ బ్రప్రథమముననే రచియించి కృతకృత్యులగుట వీరిపూర్వపుణ్యవిశేష ముగాని మఱియొండు కాదని భావింపవలసియుండును. ఇంతకుఁబూర్వ మునం దీమహాకావ్య మాంధ్రీకరింపఁబడియుండలేదా యని కొందఱను గవచ్చును. అవును; నిజమే. ఇయ్యది పెక్కండ్రచే గద్యకావ్యముగను, పద్యకావ్యముగనుగూడ నాంధ్రీకరింపఁబడి యుండుటయేగాక సత్య వోలు కామేశ్వరకవి "కాదంబరీనాటక" మను నాటకమును గూడ రచియించియుండుట వాస్తవము. అయినను నీగ్రంథకర్త యాగ్రంథ ముల నెన్నఁడును దాను జూచియుండలేదని, వినియుండలేదని చెప్పుచు న్నాఁడు. వారు చెప్పనక్కరలేదు, వీరిభాషాంతరీకరణగ్రంథమే వేనోళ్లఁ జాటిచెప్పఁగలదు. వీరు నిజముగా నాభాషాంతరీకరణగ్రంథములను బఠిం చినవారే యైనయెడల నింతధారాళమైనశైలిలో నింతనిర్దుష్టమగు భాష లో నీరీతిగా నీపద్యకాదంబరీకావ్యము నింతమనోరంజకముగా విద్వ త్కవి ప్రశంసనీయమగునట్లు రచించియుండఁ జాలరని నానిశ్చితాభిప్రా యము. వీ రీగ్రంథమును రచియించి యభిప్రాయమును గైకొనుటకై

వేలూరువాస్తవ్యులగు బ్రహ్మశ్రీ కలువలపల్లి రంగనాథశాస్త్రిగారి కడకుఁ బోయినప్పుడుమాత్రము బ్ర॥ శ్రీ॥ పూర్ణ ప్రజ్ఞాచార్యులవారి గ్రంథము కలదని, యాగ్రంథము నచటఁ జూచినారమనియు, అప్పటికే తమగ్రంథముపూర్తియైచాలభాగముముద్రితమయిపోయియుండెననియుఁ దెలిపిరి. మొట్టమొదట బాణభట్ట విరచితమైన కాదంబరిని తెనిఁగించిన వాఁడు దశకుమారచరిత్రమును రచియించి తిక్కన సోమయాజికంకితము గావించిన కేతనకవియని కొందఱును, రంగరాట్ఛందమున నుదాహరింపఁబడిన పద్యములలో భాస్కరుని కేతనయని చెప్పఁబడియుండుటచే నా కేతన తిక్కనసోమయాజిపెదతండ్రియగు కేతనయని మఱికొందఱును జెప్పుచున్నారు. ఏకేతనయైననేమి ? ఇపు డాగ్రంథ మెచ్చోటను గానరాదు. ఆధునికులలోనివారగు (౧) చింతలపాటి నరసింహశాస్త్రిగారు, (౨) కురుగంటి సూర్యనారాయణశాస్త్రిగారును పద్యకావ్యములుగను, (౧) ముదిగొండ నాగలింగశాస్త్రిగారు, (౨) సత్యవోలు సోమసుందర కవిగారు, (3) చేవలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, (౪) ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారును గద్యకావ్యములుగను రచియించిరి. పైవారిలోఁ గడపటఁ బేర్కొనఁబడిన యిరువురును కథాసారమును మాత్రము గద్యలో వ్రాసిరి. ఇయ్యవి యచ్చుపడినట్లు గాన్పించుచున్నది. ఇంకెందఱు భాషాంతరీకరించియుండిరో తెలియదు. కాని యీ యువకవి శేషయ్యశాస్త్రిగారుమాత్రము వానినేవియు నెఱిఁగియుండినవారుమాత్రముకాదు. అట్లెఱింగియుండునేని యింతయుత్సాహముతో నీమహాకార్యమునకుఁ బూనుకొన సాహసింపరని నాయభిప్రాయము.

వీ రీకావ్యమును దెనిగింపఁ బూనినపుడు పూర్వకవుల మార్గముల ననుసరించియె ప్రవర్తించిరి. తమగ్రంథము నిష్టదేవుఁడగు శ్రీరామచంద్రున కంకితము గావించిరి. ఇష్టదేవతాప్రార్థనమును మూఁడుపద్యములలో ముగించి తరువాత భారతకవులలో నన్నయ, తిక్కనలను

మాత్రము నుతించి పిమ్మట నొక్కగీతములో శ్రీనాథుని, సూరనార్యుని, రామభద్రుని, రామకృష్ణుని, ధూర్జటిని, పోతరాజును, మూర్తికవిని పేర్కొని పిమ్మట ప్రత్యేకముగా నీక్రింది కందములో-

"క. భువి నుత్తరహరివంశం
బవలీలన్ వ్రాసి యశముసందిన సర్వ
జ్ఞవరుం గొల్చెద సతతము
నవీనకవితాభిరాము నాచన సోమున్."

అని నాచనసోముని నవీనకవితాభిరామునిగా వర్ణించియుండుట చేత మన యువకవికి నాతని కవితారచనయం దగ్గలమగు ప్రీతిఁగలదని బోధపడుచున్నది. కాని వీరు పేర్కొనిన తదితరకవులు చూపిన కవితాభిరుమలకంటె భిన్నమైన నవీనకవితాభిరుమ లాతనియం దేమిగలదో బోధపడలేదు. ఈప్రకారముగా నిష్టదేవతాప్రార్థనమును, పూర్వకవిస్తుతియు జరిపియుండియుఁ బూర్వకవిసంప్రదాయముగా నవలంబించెడి కుకవినిందను విడిచి షష్ఠ్యంతములకుఁ బూర్వము-

"క. ఇతఁడెక్కడ ? కాదంబరి
కృతియెక్కడ ? తత్కవిత్వ మితఁడు దెరుఁగుసన్
జతఁగూర్చుట యెక్కడయని
మతిఁ దలఁపక నన్ను బుధులు మన్నింపఁదగున్."

అను కందపద్యములో తమ వినయసౌశీల్యములను జక్కఁగా నెఱుకపఱచియున్నారు. షష్ఠ్యంతపద్యములుగూడ పోతరాజుగారి కవనమంసువలెనె శబ్దాలంకారప్రాసములతో నొప్పుచుఁ జక్కగా నున్నవని చెప్పవలెను. మొట్టమొదట బాణకవికృత కాదంబరీకావ్య మాంధ్రీకరించుటకు నొకింత గొంకుగదిరి సంశయించుచుండ రాఘవశతకమును, యామినీబిల్హణీయంబును రచియించిన వీరి మిత్రుఁడు, ఆకుల పిద్దయ్యయనువారు ప్రీతితో-

"ఉ. పండితమండనుండనుచుఁ బ్రస్తుతిఁగ్రై కొని హర్ష రాట్సభా
మండపమధ్యవర్తియగు మాన్యుఁడు బాణుఁడు గద్యకావ్యము
ద్దండతవ్రాసె నీవుఁగొని దాని లలిందెనిఁగించితేని నిన్
రెండవభట్టబాణుఁ డనరే జగతీజనులెల్ల మిత్రమా ?"

అని ప్రోత్సహింపఁగా నిట్టి సాహసకృత్యమునకుఁ బూనితిఁగాని మహాకవి ననుగర్వముతోఁగాదని వీరెంత విస్పష్టముగాఁ దమభావమును వెల్వరించుకొన్నను "రెండవ భట్టబాణుఁడనరే" అని యొకమిత్రునిచేఁ బ్రబోధింపఁబడినట్లు వ్రాసికొనుటనుబట్టి రెండవభట్టబాణుఁడని యనిపించుకోవలె ననునాశయము గవికిఁగలదని పాఠకుల కెట్లును హృద్గతము గాకమానదు. అట్టియాశయముండుట గవికి నాక్షేపణీయాంశముగాదనియె నాయభిప్రాయము. కాని యట్టియాశయము సిద్ధించుట యెప్పుడు సంభవించును? భట్టబాణుని కాదంబరిని తెనిఁగించుట మాత్రముననే సిద్ధించునదికాదు. ఎప్పుడు భట్టబాణునివలె 'కాదంబరీమహాకావ్యము' వంటి మహాకావ్యమును స్వతంత్రముగా గద్యమునఁగాని, పద్యమునఁగాని సృష్టింపఁగలుగుచున్నాఁడో యప్పుడే కవికి సిద్ధింపఁగలదు. కావున మిత్రులప్రబోధములో సార మంతముగాఁ గానుపించుటలేదు. అది లోకానుభవమును దెలియఁజేయునట్టిదికాదు. ఒకకవి, యొకపూర్వ కవి సంస్కృతభాషలో వ్రాసిన మహాకావ్యమును మరియొకభాషలోని కనువదించిన మాత్రముననే యామహాకావ్యమును మొట్టమొదట వ్రాసినకవివంటివాఁ డెన్నఁడును గాఁజాలఁడు. అట్లుగావించినవారు పెక్కండ్రు చూపట్టుదురేని వారందఱును బాణభట్టులేయగుట సంభవించి కవిప్రపంచమునకు భార మెక్కువచేసినవారే యగుదురు. కావున నట్టి భావమును సూచించు పై పద్యము నిట్టి యుత్తమగ్రంథమునందుఁ జొప్పించుట యంత సమంజసముగాఁ గనుపట్టదు. "నే నొక మహాకవి ననుగర్వంబునఁగాదు సుఁడీ" యను నెంతవినయముతోఁ జెప్పుకొన్న

ను, అయ్యది గర్వమునే సూచించునుగాని మఱి యన్యము గాఁజాలదు. యువకులకు నీవిషయమునఁగల భ్రమను నివారించుటకై యింతగా నొక్కి వక్కాణింపవలసి వచ్చినదిగాని యువకవుల నిరుత్సాహపఱుప వలె ననుతలంపుతోఁ జెప్పినది గాదని మాత్రము గ్రహింపఁదగును.

ఉభయభాషలయం దీకవికి నసాధారణపాండిత్యము గలదని యీ పద్యకాదంబరీ కావ్యమును సాంతముగాఁ బఠించినవారికి విదితము గాకమానదు. ఈకావ్యమును విని దీనిపై నిచ్చిన పండితాభిప్రాయముల వలననె విస్పష్టము కాఁగలదు. ఇతఁడు సామాన్యకవి కాఁడనియు, మంచి సాహిత్యమెగాక పాణినీయప్రవేశము కలవాఁడని శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు చక్కని యభిప్రాయము నొసంగియున్నప్పుడును, ఇంక నిర్దుష్టమగుభాష, మధురమగు శైలి, గంభీరభావములుగలిగి విద్వజ్జనప్రశంసనీయముగ నున్నదని విజయనగరము శ్రీమహారాజా సంస్కృతకలాశాలలో న్యాయశాస్త్రాధ్యాపకులుగనున్న వేదాంతం శేషయ్యశాస్త్రిగారు ప్రశంసించి యున్నప్పుడును, సరసకవితాధురంధరులగు వడ్డాది సుబ్బారాయుడుగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహము గారును మూలమునందలి యర్థముగాని భావముగాని రసముగాని చెడకుండ నిర్దుష్టముగాఁ గవిత్వ ముండెనని తేటతెల్లముగాఁ దమయభిప్రాయములు దెలుపుచుఁ గవికి నత్యధికప్రోత్సాహ మొసంగియున్నప్పుడును, సంస్కృతకాదంబరిని పద్యకాదంబరికి దగ్గఱనుంచుకొని యనువాదం బెట్లున్నదో పరిశీలించి వీరిగురువుగారగు కొంపెల్ల సత్యనారాయణ శాస్త్రిగారు లోపంబులు గానరావనియు, లలితంబులగు పదములతో సొగసైన శైలిగలిగి లక్షణయుక్తముగాఁ దనగారుచున్నదని దెలుపుచున్నప్పుడును, ఇంకనుగూర్చి నేను విశేషముగాఁ బెంచి వ్రాయవలసినపని గన్పట్టదు. కవి తనయాంధ్రీకరణము మూలానుగుణముగా నుండవలె ననుతలంపుతోఁ గడుశ్రద్ధను వహించి సాధ్యమగునంతవఱకు

నెట్టికొంతయు లేకయుండ జూచెననుట కెంతమాత్రమును సందియము లేదు. చదువరులు కవిగారి భాషాంతరీకరణపద్ధతిని గ్రహించుటకై యొకటి రెండు విషయములనుమాత్రము మూలమునుండియు, పద్య కాదంబరినుండియు నీదిగువ నుదాహరించుచున్నాను.

వింధ్యాటవీవర్ణన సందర్భము:—

"ప్రేతేశపురి యన మృత్యుభీషణమును
మహనీయ మహిష సమంచితయును
గాత్యాయని యనంగ ఖడ్గభీషణమును
లలిర క్తచందనాలంకృతయును
ప్రళయ సంధ్యయనంగఁ బల్లవారుణయు, నృ
త్యన్నీలకంఠయునై వెలింగి,
శైలాత్మజ యనంగ స్థాణుసంగతయును
మృగరాజసేవిత యగుచు నెగడి,

తే. జానకీదేవి యన నిశాచరగృహీత
యును సముద్భూతకుశలవయు నయి రాజ్య
లక్ష్మియనఁ జమరమృగవాలవ్యజనవి
భాసురంబును గజఘటాపాలితయును.

---

* ప్రేతాధిపనగరీవ సదాసన్నిహితమృత్యుభీషణా, మహిషాధిష్ఠితాచ, సమరోద్యత పతాకినీవ, బాణాసనారోపితశిలీముఖా, విముక్తసింహనాదాచ, కాత్యాయనీవ ప్రచలితఖడ్గభీషణా, రక్తచందనాలంకృతాచ, కర్ణసుతకథేవ, సన్నిహితవిపులాచలా శశోపగతాచ, కల్పాంతప్రదోషసంధ్యేవ, ప్రనృత్తనీలకంఠా పల్లవారుణాచ, అమృతమథనవేళేవ, శ్రీద్రుమోపశోభితా, వారుణీపరిగతాచ, ప్రావృడివ, ఘనశ్యామలా అనేకశతహ్రదాలంకృతాచ, చంద్రమూర్తిరివ, సతతమృక్షసార్థానుగతా, హరిణాధ్యాసితాచ, రాజ్యస్థితిరివ, చమరమృగవాలవ్యజనోపశోభితా, సమదగజఘటా పరిపాలితాచ, గిరితనయేవ, స్థాణుసంగతా మృగపతిసేవితాచ, జానకీవ, ప్రసూతకుశలవా, నిశాచరపరిగృహీతాచ, కామినీవ, చందనమృగమదపరిమళవాహినీ, రుచిరాగురుతిలకభూషితాచ, సోత్కంఠేవ వివిధపల్లవానిలవీజితా, సమదనాచ, బాలగ్రీవేవ, వ్యాఘ్రనఖపంక్తిమండితా, గండకాభరణాచ, పానభూమిరివ, ప్రకటితమధుకోశకశతా, ప్రకీర్ణవివిధకుసుమాచ, కంచిత్‌...

సీ. పందికోఱలఁద్రవ్వఁ బడినపుడమిఁగల్గి
యొకచోఁ బ్రళయవేళ కుపమయగుచు,
జెట్టుమొకంబులచేఁగూలు తుంగశా
లలనొప్పి యొకచోట లంకఁబోలి,
కుసుమ సమిత్కుశాంకురశమీపల్లవ
ముల నొక్కచోఁ బెండ్లిపుడమిఁబోలి
కమలాక్షుదేహంబుకైవడి నొకచోట
లలిత తమాల నీలంబునగుచుఁ,

తే. పార్థరథకేతనంబన వానరేంద్ర
శోభితంబయి మఱియొక్కచో విరాట
నగరియనఁ గీచకావృత యగుచుఁ జాల
నొప్పుమీఱు వింధ్యాటవి యుర్వియందు.

తే. బహుళపత్రాఢ్యమయ్యు నవ్వనముసప్త
పర్ణభూషితమై చాలఁబరఁగుఁ గ్రూర
సత్వయుతమయ్యు మునిజనసన్నుతమ్ము
పుష్పవతియయ్యుఁ బూతమై పొల్పుమీఱు.

(పద్యకాదంబ. ఆ. 2 పద్యసంఖ్య 6. 7. 8.)

---

యవేళేవ, మహావరాహదంష్ట్రాసముత్ఖాతధరణిమండలా, క్వచిద్దశముఖనగరీవ, చటుల వానరబృందభజ్యమానతుంగశాలాకులా, క్వచిదచిరనిర్వృత్తవివాహభూమిరివ, హరితకుశ సమిత్కుసుమశమీపలాశశోభితా, క్వచిదున్మత్తేవ, వాయువేగకృతతాళశబ్దా, క్వచిద్విధవేవ యున్ముక్తతాళపత్రా, క్వచిత్సమరభూమిరివ, శరశతనిచితా, క్వచిదమరపతి తనురివ, నేత్రసహస్రసంకులా, క్వచిన్నారాయణమూర్తిరివ, తమాలనీలా, క్వచిత్పార్థరథపతాకేవ, కపాక్రాంతా, క్వచిదవనిపతిద్వారభూమిరివ, వేత్రలతాశతదుష్ప్రవేశా, క్వచిద్విరాటనగరీవ, కీచకశతాకులా, క్వచిదంబరశ్రీరివ, వ్యాధానుగమ్యమానతరళతారకమృగా, క్వచిద్గృహీతవ్రతేవ, దర్భచీరజటావల్కలధారిణీ అపరిమిత బహుళపత్రసంచయాపి సప్తపర్ణోపశోభితా, క్రూరసత్వాపిమునిజనసేవితా, పుష్పవత్యపిపవిత్రా, వింధ్యాటవీనామ." (గద్యకాదంబరి.)

రాజకుమారుండగు చంద్రాపీడుండు యౌవరాజ్యోన్ముఖుండై యొక దినంబున మంత్రియగు శుకనాసుని దర్శింపఁగోరి యతివినయముతో నాతనిభవనంబునకుఁ బోయి యతనిఁజూచిన సందర్భమున నతని సుహృద్భావమును గనుంగొని ప్రశంసించినవిధము:—

తే. నిఖిల విద్యలయందుఁ బండితుఁడవైన
నీకుఁ జెప్పటకేమున్న దో కుమార!
యైన నీయందు నాకున్నయట్టిప్రేమ
కతనఁ దెలిపెదఁ గొన్ని సంగతులవినుము.

క. చెలువగు రత్నప్రభలకు
మలగవు రాజీవమిత్రు మహితరుచులకున్
దొలఁగవు విద్యుద్ఘృణులకుఁ
గలగవు యౌవనభవోగ్ర గాఢతమంబుల్.

సీ. ఉపచారముల శాంతినొందక దారుణ
స్థితిమీఱుచుండు లక్ష్మీమదంబు
ఐశ్వర్య మను తిమిరాంధత్వరోగంబు
లంజనంబులకు సాధ్యములుగావు
నతితీవ్రదర్ప దాహజ్వరోత్కర్షంబు
శిశిరకృత్యంబులఁ గృశింపకుండు
విషయవిషాస్వాద విశ్రుతమోహంబు
మంత్రతంత్రంబుల మాన్పగాదు

తే. బహుళరాగమలావలేపప్రసిద్ధి
స్నానశౌచప్రవృత్తిచే సడలకుండు
రాజ్యసుఖసన్నిపాతనిద్రయును నశు
పావసానప్రబోధ మోహాయధిపతనయ !

---

తాత! చంద్రాపీడ! విదితవేదితవ్యస్య అధీతసర్వశాస్త్రస్య తే నాల్పమప్యుపదేష్టవ్యమస్తి, కేవలంచ నిసర్గత ఏవ అభానుభేద్యమరత్నాలోకోచ్ఛేద్యమప్రదీపప్రభాపనేయ మతిగహనం తమో యౌవనప్రభవం। అపరిణామోపశమో దారుణో లక్ష్మీమదః।

తే. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు
మానితసురూపవిభవంబు మానుషప్ర
భావసంపదయనేఁడు నన్వర్థసుగుణ

* * *

క. పూరుషులకు నీగుణముల
నారయ నొకఁడేని గలుగ నవగుణములకున్
దారిమ్మగునదరికిన్నిఁటి
చేరికగలదేని వేఱచెప్పఁగనేలా ?

తే. రాజరాజకిరీటాగ్రరత్నకాంతి
రంజితపదాబ్జ ! యౌవనారంభమందు
శాస్త్రజలపూరధౌత ప్రసన్నమైన
మహితబుద్ధియు వెసనొందు మలినగుణము.

క. గురువచనం బమలంబై
బొరలియు ఖలమతికిఁ గర్ణపుటజలశ్రీ
కరమున నితాంతదుస్సహ
పరితాపము గూర్చుచుండుఁ బాయకయెపుడున్.

---

కష్టమనంజనవర్తిసాధ్యమపరమైశ్వర్యతిమిరాంధత్వం । అశిశిరోపచారహార్యోఽతితీవ్రోదర్పదాహజ్వరోష్మా । సతతమమూలమంత్రగమ్యో విషమో విషయవిషాస్వాదమోహః । నిత్యమస్నానశౌచబాధ్యో బలవాన్ రాగమలావలేపః । అజస్రమక్షపావసానప్రబోధా, ఘోరాచ రాజ్యసుఖసన్నిపాతనిద్రాభవతీతి విస్తరేణాభిధీయతే। గర్భేశ్వరత్వమభినవయౌవనత్వ మప్రతిమరూపత్వ మమానుషశక్తిత్వంచేతి మహతీయం ఖల్వనర్థపరంపరా సర్వావినయానామేకైకమప్యేషామాయతనం, కిముత సమవాయః । యౌవనారంభే చప్రాయః శాస్త్రజలప్రక్షాళననిర్మలాపి కాలుష్యముపయాతిబుద్ధిః । అనుజ్ఝితధవళతాపి సరాగైవభవతి యూనాం దృష్టిః । అపహరతిచ వాత్యేవ శుష్కపత్రం సముద్భూతరజోభ్రాంతి రతిదూర మాత్మేచ్ఛయా యౌవనసమయే పురుషం ప్రకృతిః।ఇంద్రియహరిణహారిణీచ సతతమతిదురంతేయముపభోగమృగతృష్ణికా । నవయౌవన కషాయితాత్మనశ్చసలిలానీవ తాన్యేవ విషయస్వరూపాణ్యాస్వాద్యమానాని మధురతరాణ్యాపతంతి

తే. నిలువుటద్దంబునందున నీడబోలెఁ
జంద్రకిరణవితానముల్ స్ఫటికమణుల
యందునుం బోలె విమలహృదబ్జసీమ
సుకరముగఁజొచ్చు నుపదేశసుగుణసమితి.

(పద్యకాదంబరి. తృ. ఆ. ౧౧౦ మొదలు ౧౧౨ పద్యములను.)

ఈకావ్యమునంతయు శ్రద్ధతోఁ బరిశీలింతుమేని వీ రవలంబించిన భాషాంతరీకరణమార్గము గొంచెమించుమించుగాఁ బైనఁజూపిన రెండు సందర్భములను గన్పట్టువిధాన మెట్లుండెనో తక్కినభాగములను నట్లే గన్పట్టుచుండుననుటకు లేశమాత్రము సందేహము లేదు. ఈకవిగారు మూలగ్రంథమునం దర్థశ్లేషలు శబ్దశ్లేషలువిరివిగాఁగలయపూర్వవర్ణనాంశములుగలతావులను తెనిఁగించునపుడు విశేషముగాఁ దమ కవనమున సీసములలోను, గీతములలోను, వర్ణించుటయును, సాధ్యమగునంతవఱకు వృత్తములను విడనాడుచు వచ్చిరి. అందువలన వీరు మూలగ్రంథము లోని పదములనే యెక్కువగా వాడుటకును, మృదువులును, మధుర ములు నగు తేటతెలుంగునుడులను సరసముగా జతకూర్చుటకును, సాధ్యమగునంతవఱకు మూలానుగుణముగా భాషాంతరీకరణ ముండుట కును చక్కని యవకాశము గల్పించినది. వీరి కవనమునందు ముఖ్యము గా వాడినవి సీసములకు గీతములకుఁ దరువాత కందములే తఱచుగాఁ గాన్పించుచున్నవి. వృత్తములలోసహిత మెక్కడనో మూఁడు నాలుగు లందు వృత్తములకుఁబోక సామాన్యముగా చంపకోత్పలములతోనే గ్రంథమును సాగించిరి. అందువలన వీరికొక విలక్షణమైన శైలి పట్టువడి నది. వీరు తిక్కన సోమయాజిభారతమును, బమ్మెర పోతనగారి భాగవ

---

మనసః, నాశయితిచ దిఙ్మోహ ఇవోన్మార్గప్రవర్తకః పురుషమత్యాసంగో విషయేషు। భవాదృశా ఏవ భవంతి భాజనాన్యుపదేశానాం। అపగతమలేహి మనసి స్ఫటికమణా వివ రజనికరగభస్తయో విశంతిసుఖేనోపదేశగుణాః॥"

(గద్యకాదంబరి ప్ర. భా. ౨౦౬, ౨౦౭, పుటలు)

తంబును బాగుగాఁ బఠించి యుండవలెను. వారి కవనములోని పోలికలు వీరి కవనములోను నెక్కుడుగాఁ గన్పట్టుచున్నవి. ప్రప్రథమమునందే యింతటి ధారాళమైన సులభశైలి పట్టువడుట వీరి పూర్వపుణ్యవిశేషం బని తలంపనగు. ఈకవి ద్వితీయాశ్వాసములోఁ దపోవనమును వర్ణించినవర్ణనము చదువరులహృదయముల నెట్లాకర్షించి వారిమనస్సుల రంజిల్లజేయుచుండెనో చూపుటకై యాభాగము నొకింత నిట నుదాహరించుచున్నాఁడను.

తే. తాలహింతాల తిలకతమాలసరళ
కేతకీపూగపున్నాగ చూతలోధ్ర
వకుళ సహకార లకలీలవంగముఖధ
రాజములనొప్పు వనములంగ్రాలు దాని.

తే. మాయపుస్ లేడి కొఱుకంగ మఱల మొలచు
లతలతోఁడరు దశరథసుతుని చాప
కోటివిన్యాస విషమిత క్షోణితలము
లైన దండకవనుల నింపాఱుదాని.

చ. విమవక వ్రేలుచుంట మదిఁ బ్రీతివహించి మునీంద్రకోటి నె
వ్వడి సశరీరకంబుగ దివంబునకుం గొనిపోవనగ్నుల
క్కడ కరుగంగలీలమెఱుఁగట్టిన మెట్టులనంగ నింగి కే
ర్పడఁ జనుధూమసంతతుల రంజిలి యొప్పెడిదాని భూవరా!

చ. తరగలసూర్యుఁదాకుమను దాపససంగతిఁబోలె నిర్మల
స్ఫురణములై మునీంద్రపదముల్ కొలువం జనుదెంచు ఖేచరో
త్కరమన, రాత్రులన్ వెలుఁగుకైరవసంతతి నింపుమీఱి బం
ధురగతిఁ దోఁచు దీర్ఘికలతో విలసిల్లెడు దాని రాణ్మణీ!

వ. మ్రొక్కుచున్నవో యనం గాలికి నొఱఁగు శిఖావళుల నలరు నన లతలతోడను, బూజింపుచున్నవో యన నెడతెగక జలజలరాల్చు

కుసుమవిసరంబుల నెసంగు పాదపంబులతోడను, నిటునటు జల్లిన భస్మరేఖల నలంకృతంబులగు మునిజనభోజనభూభాగంబులతోడను, నుపచరింపఁబడు నతిథివర్గంబులతోడను, బూజింపఁబడు పితృదైవతములతోడను, నర్చింపఁబడు హరిహరహిరణ్యగర్భులతోడను, బూరింపఁబడు కమండలువులతోడను, విలసిల్లుచు, మఱియునుం బరమేష్ఠిఁబోలెఁ ద్రిభువన వందితంబై, సాంఖ్యంబు కైవడిం గపిలాధిష్ఠితంబై, యుదయము పోలిక, నానందితవత్సకులంబై, జలధరసమయంబురీతి వనమధ్యముఖప్రసుప్తహరియై, ఖాండవవినాశోద్యతార్జునచందంబునం బ్రారబ్ధాగ్నికార్యంబై, యదియునుంగాక, సురభి విలేపనస్ఫురితంబయ్యును నావిర్భూతహవ్యధూమగంధంబై మాతంగకులసంయుతంబయ్యును, బరమపవిత్రంబై, ధూమకేతుశతోల్లసితంబయ్యును బ్రశాంతోపద్రవంబై యతిమనోహరంబగుచు రెండవలోకేశలోకంబనఁ గనుపట్టు నాశ్రమంబుఁ గనుగొంటి.

సీ. మఖధూమముల యందమాలిన్యముది యుంట
తలఁపఁగ నిజచరిత్రములఁగాదు
నయనరాగంబు వనప్రియంబులయంద
రహిఁజూడఁ బరకళత్రములఁగాదు
తమిమీఱఁ గరగ్రహము కమండలులంద
యరయంగ సురతకార్యములఁ గాదు,
ఒగిఁగుచస్పర్శంబు హోమధేనువులంద
తిలకింప నెలఁతలదెసనుగాదు,

తే. శకునివధ భారతమునంద సంక్రమించు
భూతమలినత్వ మగ్నికె పొలచియుండెఁ,
బొలుపుగ నధోగతియును మూలములకు నమరెఁ
గాని తత్తపోవని వేఱె కానరాదు.

సీ. ఆకీతి వని కలంకారంబుఁ గూర్చుచుఁ
జిగురుటాకుల నుల్లసిలుచు, మౌని
వరుల కృష్ణాజినవ్రజమున, జలకమం
డలువుల, నొప్పుశాఖలఁ జెలఁగుచు
నెలమిమై జింకకూనలు గ్రోలు జలముల
నమరిన యాలవాలమున వెలసి
మునికుమారకులు పొల్పువ వ్రేలఁ దీసిన
వల్కలంబులఁ జాలవలను మీఱి

తే. లీలమై వివిధపుష్పమాలికలతోఁడ
స్కంధము నలంకరించిన కతన మిపులఁ
బొలుపు మీఱు రక్తాశోకభూరుహంబు
తెన్నె మీఁదను గూర్చుండి యున్నవాని.

ఈయన కవనంబున యతిప్రాస లతిప్రయత్నము లేకయె వాని యంతట యవి తత్తదనుకూలముగ వచ్చిపడుచుఁ జక్కగా నతుకుకొని పోవుచుంటుట యొకగొప్పవిశేషముగాఁ గన్పట్టును.

సర్వవిధములచేతను వీరిభాషాంతరీకరణము శ్లాఘాపాత్రమై యోగ్యమై విద్వజ్జనసమ్మాన్యమునకై యెదురుచూచుచున్నది. ఈ యాంధ్రపద్యకాదంబరీమహాకావ్యము భవిష్యత్కాలమున సర్వాంధ్ర జన మనోరంజకంబై మిక్కిలి వన్నెకువచ్చి నిరుపమానయశంబు నీ యువకవికి సమకూర్పఁగలదని నాదృఢమైన విశ్వాసము. కావున, ఆంధ్రకవులును, విద్వాంసులును, సమస్తవిద్యాపీఠములవారును, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారును, మద్రాసు విశ్వవిద్యాలయమువారును మాత్రమెగాక నిఖిలాంధ్రప్రపంచమును నాదరింతురుగాక యని మనః పూర్వక విజ్ఞాపనమును జేయుచున్నాను.

కొవ్వూరు,
6—10—1937.

చిలుకూరి వీరభద్రరావు.

శ్రీ మత్సరదేవతాయైనమః.

# పండితాభిప్రాయములు.

పద్యకాదంబరి అనుపేరితో శ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారు బాణకృతకాదంబరీకావ్యమును తెలిఁగించుచున్నారు. కించిన్న్యూనముగా గ్రంథమంతయు సంపూర్తియైనది. అక్కడక్కడ నాకు వినిపించినారు. ధారలోనేమి లక్షణములోనేమి మిక్కిలి చక్కఁగానున్నది.

... ... ... ... ... ...

... ... ... ... ... ...

ఈయన సామాన్యకవి కాఁడు. సంస్కృతములో మంచిసాహిత్యమే కాక పాణినీయప్రవేశముకూడ కలవాఁడు. సర్వవిధములు భగవంతుఁడీయనయుద్యమమునకు తోడ్పడుగాక.

కడియం.
తూ. గో. జి.
24-3-37

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.
శతావధాని.

---

బాణకవికృతకాదంబరి నాంధ్రపద్యరూపమున రచించిన బ్రహ్మశ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారు తమగ్రంథములోని కొన్నిఘట్టములను నాకుఁ జదివి వినిపింపగా విని యానందించితిని. భాష నిర్దుష్టముగను, శైలి మధురముగను, పద్యగమనిక సరళముగను నున్నవి. ఈగ్రంథము ముద్రింపఁబడినపిమ్మట నాంధ్రలోకము దీనినిదప్పక యాదరించునని నమ్ముచున్నాను. ఉభయభాషలలోను నసాధారణపాండిత్యముగల యీయువకవి యిట్టికృతుల నింకను రచించి యాంధ్రభాషామతల్లిని సేవించునుగాక!

కొవ్వూరు.
గోదావరీతీరము,
25-3-36.

జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ.
ప్రిన్సిపల్,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము.

బ్రహ్మశ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారు తాము తెనిఁగించినకాదంబరీపద్యకావ్యమునుండి కొన్నిభాగములను నాకును మ. రా. రా. శ్రీ. కవిశేఖర వడ్డాది సుబ్బరాయ మహాకవిగారికిని, వసురాయలగృహమందు చదివి వినిపించినారు. అర్థశ్లేషలతోను, శబ్దశ్లేషలతోను గంభీరభావములతోను, బహుదీర్ఘసమాసములతోను, నానావిధాలంకారములతోను నిండిన కాదంబరి నాంధ్రీకరించుట కష్టసాధ్యము. పద్యకావ్యముగ రచించుట కడుంగడు కష్టము. అయినను శేషయ్యశాస్త్రిగారు మూలమునందలి యర్థముగాని, భావముగాని, రసముగాని చెడకుండ తెలుఁగుఁజేసిరి. కవిత్వము నిర్దుష్టమై రసవంతమై, భావస్ఫూర్తిగల్గి పండితప్రశంసకు పాత్రమైయున్నది. కావున, నాంధ్రకవులు విద్వాంసులు విశ్వవిద్యాపీఠములవారు నీమహాకావ్యమును, తగురీతిని నాదరించి గ్రంథకర్తకు ప్రోత్సాహము కలిగింతురుగాక.

రాజమహేంద్రవరం }
28-3-37 }

చిలకమర్తి లక్ష్మీనరసింహం.

---

బ్రహ్మశ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారు రచియించిన పద్యకాదంబరిలోని కొన్నిపద్యములను వారిముఖమునుండియే వినగల్గితిని. పద్యములన్నియు రసవంతములై, పాఠకుల నాకర్షింపఁజాలియున్నవి. ఇది వీరికి ప్రథమరచితమయ్యును, కడుంగడు ప్రశంసాపాత్రమైయున్నది.

విద్యార్థికు లిందలి గుణములనరసి, కళాశాలా విద్యార్థులకు పఠనీయగ్రంథముగ నియమింతురనియు, భగవంతుఁడితోధికముగ గ్రంథరచనమున వీరికిఁదోడ్పడుగాక యనియు కోరుచున్నదాన.

ఉభయభాషాప్రవీణ,

బత్తుల కామాక్షమ్మ.

ప్రిన్సిపల్: ఆంధ్రయువతీసంస్కృతకళాశాల.

మెంబరు: సెనేటు అండ్ ఎకడమిక్ కౌన్సిల్: ఆంధ్రయూనివర్సిటీ.

సూపరింటెండెంటు: వైశ్య సేవాదసదనము అండ్ హానరరీ మేజస్ట్రేటు.

ఓం.

ఈ వెలిది శేషయ్యశాస్త్రి బాణభట్టవిరచిత కాదంబరిని పద్య రూపంబుగ నాంధ్రీకరించి నే నితనికి గురుఁడనగుటచే దనగ్రంథమునఁ గల లోపాలోపంబుల నవరించుకొననెంచి నావద్దకువచ్చి యక్కడక్కడఁ గొన్ని పద్యములఁ జదివి వినిపించెను. పిమ్మట నేను సంస్కృతకాదంబరి నిన్ని, పద్యకాదంబరినిఁ బురస్కరించికొని యచ్చువాదం బెట్లున్నదోయని నాకుఁ దోచినతావులం బఁ బరిశీలించితిని. లోపంబులు గానరావు. సొగ సగు శైలితో లలితంబులగు పదములతో నీతనియాంధ్రీకరణము విరాజిల్లుచు లక్షణయుక్తముగ నున్నదనుటకు సందియము లేదు. భాషా భిలాషులగు సుజనులు నీకబ్బముఁ బ్రీతితో నాదరింతురుగాక. భాషా స్వరూపిణియుఁ గవితాలోలయునగు వాగ్దేవత యీతనికిఁ దోడ్పడుచు, నాయురారోగ్యాదికంబుల నొసఁగి యెల్లవేళల రక్షించుఁగాత.

కొవ్వూరు. }
26-3-37 }

కొంపెల్ల సత్యనారాయణశాస్త్రి,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము.

---

"బాణోచ్ఛిష్ట మిదంజగత్త"ను ప్రఖ్యాతిగాంచిన మహాకవిచే విరచితమైన కాదంబరి యనుగద్యకావ్యమును, గద్యపద్యాత్మకముగఁ దెనింగించుచు బ్ర. శ్రీ. వెలిది శేషయ్యశాస్త్రిగా రందలి భాగము కొంత నాకును, బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికిని చదివి వినిపించినారు. నేను విన్నంతవఱకు వారికవనము నిర్దుష్టముగను, మూ లానుగుణముగను, రసవంతముగను, గానవచ్చినందున, నేను మిక్కిలి యానందించితిని. శాస్త్రిగారు శీఘ్రముగ నీకావ్యమును ముగించి ముద్రిం పింతురుగాక యనియుఁ దద్గ్రంథము విద్యాధికారుల యాదరమునకు పాత్రమగుగాకయనియు, మనఃపూర్వకముగాఁ గోరుచున్నాను.

రాజమహేంద్రవరము, }
28-3-37. }

వడ్డాది సుబ్బారాయఁడు.

గీ. మును మహాకవి బాణుండు బుధులు పొగడ
బన్ని నట్టి కాదంబరిన్ భళిర! నేఁడు
సహృదయస్తోమహృదయ రంజకముగాగ
వెలిది శేషయ్య, తెనిఁగించె. వేయునేల.

గీ. మేలు మేలని సరసులు మెచ్చికొనఁగ
శ్లేషభంగులు, వర్ణనల్, చెడగనీక
మృదులపదగుంభనమునఁ, దత్కృతిని బన్నెఁ
దెలుఁగుబాసను, శేషయ్య దిట్టయగును.

గీ. వింటి, రచయిత వినిపింపఁ, బెక్కుచోట్ల
నెచట వినినను వీనులకింపుగొలుపు
బుద్ధిమత్కృతకావ్యముల్, బుధచయంబు
స్వాంత మలరించి తనుపుట, వింతయగునె.

కలువలపల్లి రంగనాథశాస్త్రి,
ఏలూరు 22-6-37

---

బాణకృతమగు కాదంబరీకావ్యమును పద్యకాదంబరి యనుపేరుతో శ్రీ వెలిది శేషయ్యశాస్త్రిగారు దెనిఁగించి నాకు వినిపించిరి. స్థాలీపులాకన్యాయమున వినియుంటిని. నిరుష్టమగు భాష, మధురమగు శైలి, గంభీరమగు భావములు నిందుఁగలవని నేను గ్రహించి యిట్టిగ్రంథము శీఘ్రముగా వెలువడిన నాంధ్రలోకమునకు మిక్కిలియుపకరించునని నేను తలంచుచుంటిని. విద్వజ్జనప్రశంసనీయమగు జ్ఞానమును సంపాదించిన యీ కవి యింక ననేకగ్రంథముల రచించి పండితలోకమునఁగలుగు ప్రశంసకుఁ బాత్రమగునటుల నీశ్వరుని గోరుచుంటిని.

విజయనగరం.
ది 10-7-1937
సం॥రం.

న్యాయశాస్త్రాధ్యాపక, వేదాంతం శేషయ్యశాస్త్రి,
మహారాజా సంస్కృతకలాశాలా,
ఆంధ్రయూనివర్సిటీ ఛీఫ్ ఎగ్జామినరు.

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# పద్యకాదంబరి.

## పూర్వభాగము.



### ప్రథమాశ్వాసము.





రామాహృదయేశ్వరుండు సితరాజీవాక్షుఁ డుద్యద్గుణో
దారుం డద్రిధరుండు భక్తజనమందారుండు ధీరుండు గో
త్రారిబ్రహ్మముఖాఖిలామరకిరీటాంచన్మణిశ్రేణిసు
శ్రీరాజచ్చరణాబ్జుఁ డచ్యుతుఁడు గూర్మిం బ్రోచు మత్కావ్యమున్

చ. నలినభవుండు నాల్గువదనంబులు గల్గినమేటి తమ్మిపూఁ
బలితపుగద్దెపైనమరి వాలిజగంబుల నేలు ప్రోడ వ
ల్కలచెలికిం మగండు ననఘుండగు వేల్పులపెద్ద మత్కృతిన్
నలువుగఁ బ్రోచుఁగాత గరుణారసపూరిత దృష్టిఁ జూచుచున్. 2

కం. రాణ దలిర్పం గొలిచెద
వాణిన్ జలజభవురాణి వరశుకవీణా
పాణిన్ గవినుతవర్ణ
శ్రేణిన్ మత్తాలివేణి జితశుకవాణిన్. 3

కం. ఎన్నికఁ దెనుంగుభారత
మున్నలువున మూఁడు పర్వములు వ్రాసి నుతిం
గన్న కవిలోకమాన్యుని
నన్నయభట్టారకుని మనంబునఁ దలఁతున్. 4

తే. భారతంబు విరాటపర్వంబు మొదలు
పంచదశపర్వములఁ దెనిఁగించినట్టి
కొట్టరువుకొమ్మనామాత్య కూర్మిపుత్త్రు
నుభయకవిమిత్త్రుఁ దిక్కనార్యుని భజింతు. 5

తే. సారెకు నుతింతుఁ బింగళిసూరనార్యు
రామభద్రుని శ్రీనాథు రామకృష్ణు
మూర్తికవిచంద్రు ధూర్జటిఁ బోతరాజుఁ
బ్రీతిఁ గొనియాడి వినుతింతుఁ గృతినొసర్ప. 6

కం. భువి నుత్తరహరివంశం
బవలీలఁ వ్రాసి యశమునందిన సర్వ
జ్ఞవరుంగొలిచెద సతతము
నవీనకపితాభిరాము నాచనసోముఁ. 7

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, నాదికవిస్తుతియు, నొనరించి నాచే
వ్రాయఁబూను పద్యకాదంబరీకృతికి శ్రీరామచంద్రుని నాయకు
నిఁగా జేయనిశ్చయించి శ్రీబాణకవికృత కాదంబరీకావ్య మాంధ్రీక
రించుటకుఁ గొంకుగదిరి సందియంబందుచుండు నంత. 8

తే. సరసులు నుతింప రాఘవ శతకమొకటి
యామినీబిల్హణీయంబు నమరవ్రాసి
నట్టి యోకులవంశవఃగాబ్ధివిధుఁడు
పెద్దయాఖ్యుండు చెలి నన్నుఁ బ్రీతిఁబలికె. 9

ఉ. పండితమండనుం డనుచుఁ బ్రస్తుతిఁగైకొని హర్షరాట్సభా
మండపమధ్యవర్తి యగు మాన్యుఁడు బాణుఁడు గద్యకావ్య ము
ద్దండత వ్రాసె నీవుఁగొని దాని లలిం దెనిఁగించితేని నిఁ
రెండవ భట్టబాణుఁ డనరే జగతీజనులెల్ల మిత్త్రమా. 10

వ. అని చెప్పిన విని యాంధ్రీకరణంబునకుం దెగువఁబూనితి సంతెగాని
యేనొక మహాకవి ననుగర్వంబునఁ గాదసుఁడీ. 11

కం. ఇతఁడెక్కడ? కాదంబరి
కృతి యెక్కడఁ? తత్కవిత్వ మితఁడు దెనుఁగునన్
జతఁగూర్చుట యెక్కడ యని
మతిఁ దలఁపక నన్ను బుధులు మన్నింపఁదగున్. 12

షష్ఠ్యంతములు.

కం. తరణికులభూషణునకున్
వరదనుజవిభీషణునకుఁ బ్రాంచద్గర్వో
ద్ధురశరధిశోషణునకున్
స్థిరమంజులభాషునకు రుచిరవేషునకున్. 13

కం. రామునకున్ ముఖనిర్జిత
సోమునకున్ విబుధవినుతసురుచిరకీర్తి
స్తోమునకున్ సుగుణగణో
ద్దామునకున్ భక్తవరహృదయధామునకున్. 14

కం. శూరునకున్ ధీరునకున్
వీరునకున్ జనకనందినీముఖజలరుట్
సూరునకున్ బలవిజిత కు
మారునకున్ భక్తలోక మందారునకున్. 15

కం. తరుణీజనకామునకున్
సురనుతనామునకు భోగసుత్రామునకున్
వరగుణధామునకున్ దు
ర్భరదానవభీమునకును రఘురామునకున్. 16

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన పద్యకాదంబరికిం గథాక్రమం
బెట్టిదనిన. 17

సీ. నలుమొగంబుల వేల్పుఁబలె విమానీకృతో
జ్జ్వలరాజహంసమండలవృతుండు
నిర్జరవరవాహినీనేతఁబోలె న
ప్రతిహతశక్తిశోభితకరుండు
వసుమతీధరసార్వభౌమకుమారికా
పతిఁబోలె నిర్జితప్రసవశరుఁడు
కంజాతమిత్రుని కైవడిఁ బ్రతిదిన
జాయమానోదయ శ్రీయుతుండు
తే. నగుమ విభులెల్లఁ దలఁదాల్పు నాజ్ఞగలిగి
చతురుదధివేష్టితాఖిలక్షితితలంబు
నేలుచునునుండి రెండవ యింద్రుఁ డనఁగ
నెగడె శూద్రకుఁడను ధారుణీవరుండు. 18

తే. భుజబలంబున ననురాగమునను సకల
మనుజనాథులఁ దనకు సామంతనృపుల
చందముగఁ గూర్చుకొనుచుఁ దాఁ జక్రవర్తి
చిహ్నముల నొప్పు నారాజశేఖరుండు. 19

కం. ఘన రసికుల కాశ్రయుఁడై
ధనుర్ధరులలోన మిపుల ధౌరేయుండై
జనవిభుఁడు వైనతేయుం
డనఁ వినతానందజనకుఁడై యతఁడలరున్ 20

చ. సరవిగ నామమాత్రమున శత్రుల బొమ్మలఁ దుమ్ముచేసిఁ య
న్నరవిభుఁ డేకవిక్రమమునన్ సతలోకములాక్రమించి చె
చ్చెరనొక శత్రుఁజీల్ప నరసింహతయున్ భువనత్రయంబు న
త్యురుతఁగొనం ద్రివిక్రమతయుం గనిచట్టి హరిన్ హసించెనన్. 21

సీ. నిర్మలమనమున ధర్మదేవతఁబోలి
యతికోపమున జము ననుకరించి
తగఁ బ్రసాదంబునఁ ధనపతి కెనవచ్చి
సత్ప్రతాపంబున జ్వలనుఁబోలి
వీక్షణోన్నతి లక్ష్మి వియ్యంబుఁ జేపట్టి
పలుకులయెడ సరస్వతి జతయయి
నెమ్మోముపస నిందునెలచుట్టఱికమొంది
బలమున గాలితోఁ జెలిమిఁ జేసి
తే. ప్రజ్ఞ గురుఁబోలి మదను రూపమున మెచ్చి
తేజమున సూర్యునింబోలి తేజరిల్లి
విశ్వరూపాకృతిం జూపు విష్ణువనఁగ
నిఖిలదేవస్వరూపుఁడై నృపతియొప్పు. 22

తే. మహితుఁ డెవఁడు తమఃపుంజ మలిన కలియు
గమునఁ దూలఁగింపఁబడిన ధర్మమును రావ
ణాసురోత్పాటితంబుఁ గైలాసగిరిఁ
ద్రిపురహరుఁడోయనఁ బునఃప్రతిష్ఠఁ జేసె. 23

తే. చాపకోటిప్రసారితసకలరిపుకు
లాచలుండయి వైన్యుఁడో యనఁగనొప్పు
శూద్రకుఁడు నిత్యకరుణాసముద్రుఁ డగుచు
ధాత్రిఁ బాలింపుచుండుఁ దా ధర్మబుద్ధి. 24

తే. అరయ నతనిప్రతాపాగ్ని విరహిణులగు
వైరికాంతల మనములలో వరలుచున్న
జీవితేశుల నుఱుమసిఁ జేయఁజూచు
పగిది నంతర్జ్వలితదాహమగుచు నొప్పు. 25

తే. తడవునుండియు దుష్టభూధవులచెలిమి
సడరినట్టి కళంకంబుఁ గడిగికొనుచు
నున్నదన రాజ్యరమ తేని యుజ్జ్వలంపు
ఖడ్గధారాప్రవాహ సంగతి వసించు. 26

వ. అవ్వసుంధరావల్లభునకు. 27

సీ. లలిఁ గ్రుంకులాడు మాళవసతీకుచతటం
బులహతిఁ జెదరిన యలలుగలిగి
జలకంబులాడెడు జయకుంభికుంభసిం
దూరసిందూరితతోయ యగుచు
సలలిత కలహంస కులరవముఖరిత
తీరయౌ వేత్రవతీస్రవంతి
విలసితంబగుచును గలికాలభీతి నొ
క్కెడ గుమిగూడిన కృతయుగంబు

తే. ననుకరింపుచుఁ దగఁ ద్రిభువనములకును
జన్మభూమి యనంగ విశాలమైన
విదిశయను పట్టనంబు భూభృద్వరునకు
రాజధాని యటంచు వర్ణనకు నెక్కు. 28

సీ. మదగజ కుంభముల్ చిదుముచోనంటిన
తెలిముత్తెములనుల్లసిలెడు కత్తి
చేలాగఁ బడుచున్న చెలువున రాలచ్చి
రహిమీఱు సద్భటోరః కవాట
ముల మేలి మైమఱువుల గుంపుడాలని
యెడుకాఱుచీఁకటి నడుమనుండి
కరటిఘటాకోటికటనిర్గళన్మద
సలిలధారావృష్టివలను మీఱు

తే. దుర్దమములైన సమరరాత్రుల యథేచ్ఛ
నరుగు నభిసారికావృత్తి నఖిలమేది
నీవర కిరీట ఘటిత మాణిక్యకాంతి
రంజితపదాబ్జుఁడైన శూద్రకుని కడకు. 29

సీ. చిత్రకర్మలయందుఁ జెలువొందునే కాని
వర్ణసంకర మొందుటవలన లేదు
కావ్యంబులందున ఘనత కెక్కెనె కాని
దృఢబంధములు మఱొక్కెడను లేవు
సచ్ఛాస్త్రములయందు సమకూరెనే కాని
చింత వేఱొకచోటఁ జిక్కలేదు
వారణంబులయందు వర్తిల్లెనే కాని
మదవికారము వేఱ పొదలలేదు

తే. మఱియు భంగంబు లతివల కురులయంద
యరయఁగఁ గరగ్రహణ వివాహములయంద
నమరు నశ్రుచ్యుతి మఖధూమములయంద
క్రాలు శూద్రకనృపతి సామ్రాజ్యమునను. 30

తే. ఆ నృపాలశిరోమణి తాను సకల
భువనమండలముఁ గెల్చి ముదితుఁడగుచు
నెలమి ద్వీపాంతరాగతానేకభూమి
పాలలాలితుఁడై నేల నేలుచుండె. 31

సీ. లలి నలుబ్ధులుఁ బ్రబుద్ధులు నీతియుతులునై
మసలుచున్న యమాత్యమణులతోడ
సకల శాస్త్రాలోచన కఠోరమతులతో
విబుధులతోఁ గాలవిదులతోడఁ

గవులతో నింగితాకారవేదులతోడఁ
బురుపీవరాంసోరు భుజులతోడ
సముదారిగజఘటా సంహరణక్రియా
హరిపోతనిభరాజవరులతోడ
తే. విక్రమైకరసాన్వితోద్వృత్తులయ్యు
వినయయుతులు నిజప్రతిబింబనిభులు
నగు నృపకుమారులంగూడి యాడుకొనుచు
బాల్యముం ద్రోచె నా రాజవరసుతుండు. 32

చ. ఒగి నృపసూతి బాల్యమును నొప్పగురూపము గల్గియున్నఁ దా
జగములఁ గెల్చియుంటఁ గడు సత్వముగల్గుట శ్రీకదంబ మె
న్నఁగ లఘువృత్తిఁ జూచుచు మనన్ నృపసంతతి నాత్మఁగోరు నా
ప్రెగడలు తెల్పినన్ వినక ద్వేషముఁబూనె రతిప్రసంగతిన్. 33

తే. ఎలమి నీరీతి బుధులతోఁ జెలులతోడఁ
గవులతో నాత్మమంత్రిపుంగవులతోడ
గాయకులతోడ నొకరాత్రిఁ గడపి ప్రొద్దు
పొడువఁగొలువుండె నా రాజపుంగవుండు. 34

వ. ఆసమయంబున. 35

సీ. వామపార్శ్వావలంబకృపాణయై సన్ని
హితఫణియగు కల్పలత యనంగఁ
గలహంసధవళకోమలతరాంబర యగుచు
రహిఁ దభుకొత్తు శరత్తు వనఁగ
నిజవశీకృతసర్వనృపతిప్రతతియగుచుఁ
బరశురాముని చేతి పరశు వనఁగ
రమణీయ చిత్రవేత్రలతాభియుక్తయై
వింధ్యాటవీప్రాంత విపుల యనఁగ

తే. పడిగఁ బ్రతిహారి యొక్కఁతె వచ్చి ధరణి
తల నిహిత జాను మృదుకర జలజయగుచు
ధరణినాయకునకు ను వందన మొనర్చి
వినయవతియౌచు నిట్లని విన్నవించె. 36

తే. ధరణినాయక ! సర్వరత్నంబులకును
సాగరముఁబోలె నీవ భాజనమటంచు
మాలెతయొకర్తు త్రిభువనమణి యటంచుఁ
గీరముందెచ్చి మిముఁజూడఁ గోరుచుండె. 37

తే. అనెడు ప్రతిహారి వచనంబు లాలకించి
యచ్చెరువునంది నృపమాళి యచటనున్న
ధరణినాథుల నెమ్మోము లరసిఁ దోష
మేమి? లోనికి రప్పింపు మిప్పుడనియె. 38

క. నరపతివచనము విని స
త్వరముగఁ బ్రతిహారి చని సభాస్థలికంపెఁ
సురుచిరఘనమణిమయపం
జరశోభితకీరకలితఁ జండాలసుతఁ. 39

ఆ. అచటి కరిగిచూచె నయ్యింతి వసుమతీ
పతిసహస్రమధ్యగతుని వజ్ర
మునకు వెలచి గుంపుగొనిన కొండలమధ్య
మేరునగముఁబోలె మెఱయువాని. 40

క. దెసలెనిమిది యింద్రాయుధ
విసరద్యుతి నమరు జలదవేళ యనన్ సొం
పెసఁగంగ రత్నభూషణ
విసరద్యుతి నొడలు మివుల వెలిగెడువానిన్. 41

తే. పసిఁడిగోలుసులు, మణులకంబములు, వ్రేలు
ముత్తెములుగల్గి తెల్లనై మీరుపుసూపు
నల వితానంబుక్రింద మృగాంకమణి స
ముజ్జ్వలంబగు తల్పమందున్న వాని. 42

తే. ఊర్ధ్వగములైన కాంతులనొప్పు పతిము
ఖమ్మునకునోడి ప్రణతుఁడో కమలవైరి
పగిదిఁ బొలుపారు స్ఫటికంపుఁ బాదపీఠి
నడుమఁ దనవామపాదంబు నిడినవాని. 43

తే. ప్రణతులగు తేండ్ల నిశ్వాస పవనములకు
నంటియొంతయు మలినంబులయ్యె ననఁగ
నింద్రమణివేదికలకాంతి నెనసి నల్ల
వడిన పదనఖకాంతుల నడరువాని. 44

తే. వేలుపులపాలిమిత్తియై వెలయు కైట
భాసురుని రక్తముననొప్పు హరియనంగ
గద్దెయందలి పద్మరాగములకాంతి
నెఱుపులగు నూరువులు గల్గి మెఱయువాని. 45

ఆ. పాలకడలి నురువుబోలియుఁ జామర
పవనములకుఁ దాండవంబొనర్చు
దశలుగల్గి పొలుపు దనరెడు వెలిపట్టు
వలువనడుమ నుల్లసిలెడు వాని. 46

ఆ. ముఖము చంద్రుఁడనుచు మురియుచు వచ్చిన
చుక్కచాలనంగ సొబగుమీఱు
హారవల్లిచేఁ దదాస్యేందునకుఁ బరి
వేషమిడినయట్లు వెలుగువాని. 47

తే. గందపున్వాసనకు నాసఁజెందు భుజగ
యుగళమున నొప్పు నీలకేయూరయుగము
నిలనిరాలచ్చి బంధించు గొలుసులనఁగ
వెలయు నవి గల్గుమూఁపుల నలరువాని. 48

క. తొడిగిన రతనఁపుఁదొడవుల
నడరిన కాంతులఁబిశంగితావయవుండై
మృదునేత్రవహ్ని సోఁకిన
వెడవిలుతుఁడనఁగ మిగులవెలిగెడు వానిన్. 49

క. ఇలజనులకు భోగ్యత్వము
సలలితగతిఁ గూర్చియును నసాధారణమై
యలరెడు రాజ్యశ్రీచే
వలనొప్పఁగఁ గౌఁగిలింపఁ బడి మనువానిన్. 50

ఆ. నరవరేణ్యు నమిత పరివారయుతుఁడయ్యు
నద్వితీయుఁడగుచు నమరువాని
నమితసుబలదంతి హయసాధనుండయ్యు
ఖడ్గమొకఁడె తోడు గలుగువాని. 51

తే. పగతురను కట్టెయుల బూడిదగ సలిపియు
వెలిగెడుఁ బ్రతాపవహ్నిచేఁ బొలుచువాని
భూవరేంద్రుని శుద్ధస్వభావుఁడయ్యుఁ
గృష్ణచరితుండునగుచు వర్తించువాని. 52

తే. అరసి మొడనిల్చి యల్లలనాడు రత్న
వలయమున నొప్పు కెంగేల నలరు వెదురు
కోలచే నల్లనంగొట్టెఁ గొలువుటరుగు
పై నరేంద్రుల సందడి మానుకొలును. 53

వ. అంత. 54

తే. తాళశబ్దంబువిను వనదంతియూథ
మనఁగ నా రవమాలించి యధిపులెల్ల
విభుని నెమ్మోమునుండి తప్పించి వారి
కన్నులం ద్రిప్పిరా యింతి యున్న యెడకు. 55

తే. జరకతంబునఁ దెలుపైన శిరసుతోడ
నరుణ జలజాత వీక్షణాపాంగమునను
నతిపరిశ్రమచేసిన దవుటఁ బ్రాయ
మెడలినట్టి మేని జిగితోడ నడరు దాని. 56

తే. హేయమైన మాతంగత్వ మెనసియున్న
విబుధవరు లాత్మ మెచ్చెడు వేషమునను
లలితముగ నొప్పు మృదు దుకూలంబొకండు
దొడిగిననరుండు దనమ్రోలఁ దోచుదాని. 57

తే. బంగరు సలాకలంగూర్పఁ బడియు లోని
చిలుకకాంతుల నొకవింత చెలువుగలిగి
మరకతాకృతిఁదోచు పంజరముఁ బట్టి
కొనిన చండాల శిశువు తోఁజనెడుదాని. 58

తే. మునుపు తొలివేల్పు లమృతంబు మ్రుచ్చిలించు
సమయమున మోహినీరూప మమరఁదాల్చి
నట్టి కమలామనోహరు హరినిఁబోలి
మిగుల శ్యామత వహియించి మెఱయుదాని. 59

తే. మడమలకుఁ దాఁకఁ దొడుగంగఁబడిన నీల
కంచుకముచేత వలనొప్పఁ గప్పఁబడిన
మేని కాంతుల నెంతయు మెఱయుచుండి
నీలముల బొమ్మకైవడిఁ గ్రాలుదాని. 60

క. లీలఁగ నెఱ్ఱనిచీరఁ
దాలిచి నెమ్మేన సలలితస్థితి సాయం
కాలాతపంబు సోకిన
నీలోత్పలయని యనంగ నెగడినదానిఁ. 61

సీ. విమలక శ్రీకృష్ణునొడలిపై నుంటఁ ద
త్కాంతిచే నలుపైన కమల యనఁగ
మృదు కంటిమంటలఁబడిన మన్మథు ధూమ
గతిఁ బొగచూఱిన రతి యనంగ
బలరాముచే నున్న హలముఁగన్గొని భీతి
నడరిపాఱెడునట్టి యమున యనఁగ
గ్రాలెడుదాని, లాక్షారసంబున నెఱ్ఱ
నైన పాదంబుల నమరి, మహిష
తే. దానవునిరక్తమున నెఱ్ఱనైన యట్టి
చరణములుగల్గి యొప్పారు గిరిజ యనఁగ
సొగియుదాని, సురాపగఁ జుట్టు యమున
విధమునఁ జెలంగు ముత్యాలపేరుదాని. 62

సీ. లలితశరద్వేళ వలె వికసితపుండ
రీకలోచనయై చరించుదాని
సలలితమలయమేఖలఁబోలెఁ జాదన
పల్లవోత్తంసయై వఱలుదాని
నక్షత్రమాలయనంగఁ జిత్రశ్రవ
ణాభరణోపేత యైనదాని
మూర్ఛయో యన మనంబును హరించెడుదాని
నిద్ర వా దృగ్గ్రాహిణియగుదానిఁ

తే. చిత్రగతయన దర్శనమాత్రఫలద
ధనదుసిరియనఁగ నలకోద్భాసినియగు
దానిఁజండాలకన్యక ధరణివిభుఁడు
చూచి కనురెప్పవెట్టక చోద్యముగను. 63

ఆ. ఈ లతాంగి తనదు లాలిత సౌందర్య
మునను, సకలరూపములను నవ్వు
చుండు దీని నేలొకో వేలుపులపెద్ద
ముట్టరానిజాతిఁ బుట్టఁజేసె. 64

క. మాతంగజాతినంటినఁ
బాతకము ఘటిల్లునను భయమున వాణీ
నేత, తనచేతనంటక
యీతరుణిని సృష్టి, సేసెనేమొ యనఁదగున్. 65

తే. ఇంతలావణ్యమున్నదే యెవరికైనఁ
గరతలస్పర్శనోర్వంగఁ గడఁగునట్టి
యవయవములకు నీవిధమైనయట్టి
సోయగంబింతదాఁక నేఁ జూడలేదు. 66

తే. ఇట్లు లెంచుచున్న నృపచంద్రుఁ బొడఁగని
ప్రౌఢవనితవోలెఁ బంకజాక్షి
శిర సొకింతవంచి చెవినున్న మృదుపల్ల
వం బొకింతకదలఁ బ్రణతిఁజేసె. 67

తే. ప్రణతిఁజేసియచట మణికుట్టిమమున నా
వెలఁదికూరుచుండ వెంటనున్న
యతఁడు పంజరమున నలరు చిల్కనుబట్టి
ప్రభుని దండకరిగి పలికె నిట్లు! 68

సీ. రాజేంద్ర ! యీకీర రత్నంబు వృత్తాంత
మే నెఱింగించెద నెలమి వినుము
సకలశాస్త్రార్థ మత్యకలంకమతి నేర్చె
గ్రహియించె నేర్పున రాజనీతి
లలిఁ గావ్యనాటకాలంకారములు నేర్చె
స్వయముగఁ గొన్ని శాస్త్రములు గూర్చె
వేణువీణాదిక వివిధ వాద్యంబులు
వినుచక తడవుండి వినుచునుండుఁ

తే. ప్రణయకలహంబునం గోపపడిన సతులఁ
దేర్చు తెఱఁగుల నెన్నేని నేర్చె మఱియుఁ
జిత్రపటముల లిఖియించుఁ జెలువుమీఱ
నధిప! యిద్ది వైశంపాయనాఖ్యఁ బరఁగు. 69

తే. సకలభూతలరత్న మీ శుకము దీనిఁ
బ్రీతిమై బుచ్చుకొనఁగ నుర్వీవరుండె
పోలునని యెంచిమాతేని ముద్దుపట్టి
యధిప! మీపాదములపొంత కరుగుదెంచె. 70

తే క్షోణినాయక! దీని మీసొమ్ముగాఁగఁ
దలఁచుకొనుమంచుఁ బలికి యక్కొలువులోన
ధరణివల్లభుమ్రోలఁ బంజరముఁదెఱచి
పోయి కూర్చుండెఁ జెంత నప్పురుషుఁడంత. 71

తే. ఆ ద్విజకులాధిపుండు నయ్యధిపువంక
తిరిగి దక్షిణచరణ ముద్ధరత నెత్తి
స్పష్టమగు నుక్తిచే జయ జయ యటంచుఁ
బ్రభుని దీవించి చదివె నిప్పద్యమిట్లు. 72

తే. దేవ! భవదీయవైరిసతీకుచద్వ
యము విముక్తాహారమై, యశ్రువారి
స్నానమొనరించి, హృద్వ్యధానలసమీప
వర్తియై వ్రతముదాల్చిన పగిదిఁబొలిచె. 73

తే. క్షితిపుఁ డదివిని హర్షించి చెంతనొక మ
హాసనంబునఁ గూర్చున్నయట్టి మంత్రి
ముఖ్యునిఁ గుమారపాలితాభిఖ్యు నఖిల
నీతిశాస్త్రవిశారదున్ బ్రీతిఁబలికె. 74

తే. మహితసద్గుణ గణసాంద్ర! మంత్రిచంద్ర!
వింటివేకద ! నీవు నీ విహగవరుని
పలుకుబడిలోనఁగలిగిన స్పష్టతయును
మాటపొందునఁగలయట్టి మధురతయును. 75

తే. స్వరములును, మాత్రలును, ననుస్వారములునుఁ
బొల్లులుఁ బల్కునంతనే పుట్టెవింత
యదియునుంగాక యిదిపక్షియయ్యు జ్ఞాన
మున్న నరుఁబోలియుం టంతకన్నవింత. 7

తే. కుడిపదంబెత్తియున్న యీగ్రుడ్డుకాన్పు
ననుఁగనుంగొని జయ జయ యనుచుఁబలికి
ప్రస్ఫుటాక్షరములుగల్గు పద్యమొకఁడు
పాడెఁబసుపక్షి విపరీత పద్ధతిగను. 77

తే అనెడు పతిఁజూచి మంత్రియిట్లనుచు బలుకు
నద్భుతంబేల? శుకశారికాదులైన
పక్షు లవియెల్ల మునువిన్నపగిది మరలఁ
బలుకునని గ్రంథములలోనఁ దెలియఁబడదె. 78

తే. అవ్విధంబునఁ బలుకుటయందు నితర
జన్మములఁ గూర్చుకొనిన సంస్కారముననో!
కాక, పురుషప్రయత్న సంగతినో! యధిక
మయ్యె సంస్కార మది విస్మయం బిదేల ? 79

తే. పూర్వమునఁ జిల్కజాతియుఁ బురుషులట్లు
స్పష్టముగఁ బల్కెడిది యగ్నిశాపమునను
గలిగె నేనుంగులకును రాచిలుకలకును
స్పష్టముగఁ బల్కకుండ జిహ్వాలకుమార్పు. 80

తే. సచివుఁడిట్లని వచియించుసమయమునను
గమలమిత్రుండు గగనమధ్యమున కరిగె
ననుచు భేరీమృదంగనిస్వనము తెలుపఁ
గొలువుసాలించె నాఁ డేఁడు జలక మాడ. 81

గీ. నిండుకొలువులోన నుండి యా శూద్రక
క్ష్మాధిపుండు లేచి నంత నచటఁ
దనరుచున్న యట్టి ధరణీంద్రకోటికి
సంభ్రమంబు చాల సంభవించె. 82

తే. తమ్మితేనెలఁ గ్రోలి మదముస నొప్పు
నంచబోదల చప్పుడు లనఁగఁ జాలి
చామరంబులు విసరెడు చంద్రముఖుల
పదములం బుట్టు నందెల రొదల తోడ. 83

తే. లలితగతి నిట్టునట్టు మెలంగు వార
కమలవదనల జఘన భాగముల మిగులఁ
గ్రాలు రతనంపుమొలనూలిగముల నమరు
విమల మణిదామముల విరావముల తోడ. 84

తే. లలిత మంజీర రవముల కెలమిఁజేరి
కొలువుకూటంపు సోపానములకుఁ దెలుపు
గూర్చి గృహదీర్ఘికల నంపుగులుకు నంచ
గములు నొనరించు కోలాహలముల తోడ. 85

తే. మలసి యిటునటుఁ దిరుగుసామంతనృపుల
పదతలంబుల హాతిఁ గడునదర: విభుని
కొలువుఁగోపలఁ బిడుగులు గూలినట్లు
పుడమి గదలించునట్టి చప్పుడుల తోడ. 86

తే. భూవిభు పదంబులంబడి మ్రొక్కనెడలఁ
గలుకు రతనంపుటరుగుల ఘట్టనముల
రణరణల నీను నృపతుల మణిమయంపు
శ్రవణభూషణములఁబుట్టు రవళితోడ. 86

తే. వందిజనులును, సూతులు, ముందునడచు
జనులు నొనరించు జయజయ యనెడుపలుకు
రొదలతోడను, మ్రోయుతుమ్మెదల తోడ,
మివుల సంకులమయ్యె భూధవుని కొలువు. 88

తే. పుడమిఱేండ్లనెల్ల విడిదలకంపి మా
తంగతనయఁ జూచి ధరణివిభుఁడు
కూర్మిగడలు కొనఁగఁగూర్చుండుమని తాన
పలికి యంత నొక్క కలికిఁబిలిచి. 89

తే. చంచలేక్షణ! యీచిల్కఁ గొంచుఁబోయి
జలక మాడించి పలయు మేఁతల నొసంగు
మనుచు పచియించి పతి లోని కరిగె మిత్రు
లైన నరనాథసుతులు తో నరుగుదేర. 90

తే. అంశువులఁ జార్చుకొనిన పద్మాప్తుఁ డనఁగఁ
జంద్రుఁడుఁ జుక్కలుఁ లేని చదలనంగ
వస్త్రుల సడల్చి, వలసిన పరికరముల
నమరు వ్యాయామభూమికి నరిగి నృపతి. 91

సీ. తనకు వయస్యులౌ జననాథసుతులతో
వ్యాయామ మొనరించె నధిపసుతుఁడు
చెక్కిలికవఁ జాలు సింధువారఁపుఁ బూల
గుత్తుల విధమునఁ గొమరు మిగిలి
రతివేళఁ దెగిన హారమునుండి యురమునఁ
జాఱెడి ముత్యాల సరణి నొప్పి
యష్టమీ శశిఖండమందొప్పు నమృత బిం
దువులన నుదుటిపై మివులఁ బొడమి

తే. చాల నొప్పారు నా ఘర్మజలకణముల
నందమగు మేనితో నృపునందనుండు
గంధజలపూరితము లగు కనకకలశ
ముల విరాజిల్లు నభిషేకభూమి కరిగి. 92

చ. లలితఁపుఁ జీరలం గుచములం బిగియించుచు బాహువల్లు లిం
వలరఁగసాపుచుఁ నుదుటనంటిన ముంగురులన్ విదుర్చుచున్
జలఘటముల్ కరాబ్జముల సంతస మొప్పఁగఁ బట్టి యల్లనన్
జలకము లాడుచున్న నృపుసన్నిధిఁజేరిరి వారకామినుల్. 93

చ. పొలిచె ముదం బెలర్ప జనపుంగవతల్లజుఁ డుల్లసద్విని
ర్మలకుచకుంభమండల సమంచిత ఫుల్ల సరోజలోచనా
వళిపరివేష్టితుం డయి యవారితలీల సరోవరంబునన్
విలసితకుంభ యు క్తకరిణీయుతుఁడౌ గజరాజు చాడ్పునన్. 49

తే. జలకమాడి యతండు భుజంగ కంచు
కాతి లఘు శుభ్రవస్త్రంబు నమరఁదాల్చి
హిమగిరి సుపర్వసింధుపూరమును బోలెఁ
జుట్టి యూఁదల వెలిపట్టు పుట్టమొకటి. 95

తే. భూవిభుం డంతఁ బితరుల పూజచేసి
మంత్రితజలాంజలులతోడ మహితభక్తి
భాస్కరున కర్ఘ్యమిచ్చి, నమస్కరించి,
యరిగి పూజాగృహంబున కభవుఁ గొలిచి. 96

చ. నరవిభుఁ డగ్నికార్యము నొనర్చి ముదంబున లేఁడిబొడ్డు, క
ప్పురమును, బోలు వాసనగుబులొక్కనుగందము మేన నెల్లెడన్
బొరలిచి మాలతీకుసుమముల్ దలఁ దాలిచి వల్వమార్చి, బం
ధురగతి ధారుణీవరులతో భుజియించె నభీష్టభోజ్యముల్. 97

తే భోజన మొనర్చి యతఁడు తాంబూల చర్వ
ణంబు నొనరించి తత్ప్రదేశంబునుండి
కదలఁ గాంచి సమీపభాగమున నున్న
యొకప్రతీహారి వచ్చి కేలూఁతనొసఁగ. 98

సీ. తెల్లని వలువల తెఱగల్గి మాణిక్య
భిత్తిమయం బన వెలుగుదానిఁ
గస్తూరికలిపిన గంధోదకంబునఁ
దడిసిన మణిభూమి నడరు దాని
గంధోదకంబునఁ గడుగంగఁబడినట్టి
వెండికంబంబుల వెలయు దాని
జలముజార్చిన శుభ్రజలదఖండముఁబోలు
ప్రచ్ఛదపటమున బాగుమీఱి

తే. మంచుఁగొండకు నెనయగు మంచకమున
నొప్పు రతనంపుటరుగున నుల్లసిల్లు
నట్టి యాస్థానమంటపాభ్యంతరమున
కల్లనల్లన వచ్చె భూవల్లభుండు. 99

చ. మనుజవిభుండు గొల్వునకుమన్గల పాన్పుననుండ ఖడ్గవా
హిని యొడిఁగత్తి బెట్టుకొని యిమ్ముగ నేల వసించి పాదముల్
గొనకొని యొత్తుచుండ హితులున్ నృపులున్ దగువారుఁగూడి యిం
పునఁ దగఁగొంత సేపిటుల ముచ్చటలాడఁగ వించుఁ బిమ్మటన్. 100

తే. కెలననున్న ప్రతీహారిఁ బిలచి, చిలుక
నంతిపురినుండి తెమ్మని యాజ్ఞనిడఁగ
సాగిబడి మ్రొక్కి, లేచి తత్క్షణము యరిగి
చిత్త మధిపా! యనుచుఁ జేసెఁ జెప్పినట్లు. 101

సీ. ఎస నూతఁగాఁగొన్న పసిఁడిబెత్తము తోడ
నలి దప్పి వంగిన నడుము తోడఁ
గడుఁదెల్లనగు కంచుకము కల్గు మేనితో
జరచేతఁదెలుపైన శిరసుతోడఁ
జాల మందములైన సంచారములతోడ
వరలెడు గద్గదస్వరముతోడఁ
దా నండజం బాటఁ దనరిన ప్రీతిఁ వ
చ్చిన వృద్ధహంసరీతినిఁ జెలంగు

తే. నట్టి కంచుకి తనవెంట నరుగుదేర
నరిగెఁ బ్రతిహారిచేతి పంజరము నందు
నున్న వైశంపాయనుం డుత్సుకమున
నృపతికులరత్న మున్న యా నిండుసభకు. 102

తే. అరిగి కంచుకి భూవరు నరసి యిట్లు
విన్నప మొనర్చె రాణుల విన్నపముగఁ
గ్రుంకులాడించి కుడుపులఁ గుడువఁబెట్టి
చిలుకఁ బంపింపఁబడెఁ బతిచెంతకిపుడు. 103

తే. ఇట్లు వచియించి ప్రతిహారి యేగినంతఁ
బతియు వైశంపాయును వంక తిరిగి
పలుకుపలుకునఁ దేనె చిప్పిలెడునట్లు
లడిగె లోఁగిటఁ గుడిచితే? కడుపునిండ. 104

సీ. వసుధేశ! నే రేటి పండ్లరసంబును
గ్రోలినాఁడను నేను కుక్షినిండ
హరివిదారితమత్తకరికుంభరక్తార్ద్ర
ముక్తాఫలంబులఁబోలు దాడి
మీబీజములఁ జిదిమితిని, ద్రాక్షాఫలం
బుల కెనవచ్చు నామలకములను
భక్షించినాఁడను బలుకులు వేయేల?
యంతఃపురాంగన లలరి నాకుఁ

తే. బెట్టినదియెల్ల నమృతమై పెంపుమీఱె
ననుచు వచియించు నా చిల్కఁగని విభుండు
బలికె నీకథ నింతటనిలిపి మాకు
నీదు వృత్తాంత మెఱిఁగింపు నెఱిదలిర్ప. 105

సీ. ఏదేశమునజన్మ? మెట్లుపుట్టితివీవు?
జననియెవ్వతె? నీకు జనకుఁడెవఁడు?
నామధేయము నీకు నేమహాత్ముఁడుగూర్చె?
వేదంబులెటు చదివితివి? నీకు

శాస్త్రంబులం బరిచయమెట్లు ఘటియిల్లె ?
నెల్లవిద్యలనెటు లెఱిఁగితీవు ?
జన్మాంతరానుసంస్మరణంబొ, కాక, వే
ల్పొకనిదైన వరప్రదానమొక్కొ,

తే. కాక, ఖగరూపముంబూని యేకతంబ
తిరుగునెవఁడవొ, నీయున్కి తెలుఁగు, నీవ
యస్సు, పంజరబంధసంప్రాప్తి, యెట్టి
భంగులో, మాలవనితచేఁబడుటయెట్లొ? 106

క. ఓవైశంపాయన ! మా
కీవృత్తాంతంబు దెలుపవే యన నధికం
బై వెలయు మచ్చరిత్రము
దేవా! విన వలచితేని తెలిపెద వినుమీ. 107

ఆశ్వాసాంతము.

ఉ. శ్రీమదపాంగ! పత్త్రరథశేఖరదివ్యతురంగ! భక్తహృ
త్తామరసాబ్జమిత్ర ! విబుధస్తుతనిర్మలకీర్తిపాత్ర ! సం
గ్రామనిరస్తదైత్య! సురరాజవిరోధిపమోదవాత్య! వి
ద్యామదనాంతకా ! సకలదైవతసత్తమ ! శ్రీరఘూత్తమా ! 108

మాలిని. శతమఖనుతిపాత్రా, సజ్జనప్రాణమిత్రా !
సతతశుభచరిత్రా, చారునీలాబ్దగాత్రా !
వితతసుగుణధామా, విస్ఫురత్కీర్తిధామా !
దితితనయవిరామా, దేవతాసార్వభౌమా. 109

గద్య.

ఇది శ్రీమద్భారద్వాజసగోత్రపవిత్ర, కామేశ్వరీ శ్రీరామ
దంపతీసుపుత్ర, సుధీజనవినుతచరిత్ర, శ్రీపరమేశ్వర
కరుణాకటాక్ష సంప్రాప్తకవితా విశేష, వినయౌ
దార్యప్రముఖనిఖిలసుగుణవిభూష, శేష
కవిప్రణీతంబైన పద్యకాదంబరి
యను మహాకావ్యంబునఁ
బ్రథమాశ్వాసము.

శ్రీహయగ్రీవాయనమః

# పద్యకాదంబరి.



## ద్వితీయాశ్వాసము.



జనకపుత్రికాముఖ
రాజీవభ్రమర ! విబుధరాజార్చితపా
దా ! జగదాధారా ! యుడు
రాజలసత్కీర్తిసాంద్ర! రామనరేంద్రా! 1

వ. అవధరింపుము. వైశంపాయనుం డా శూద్రకమహీపాలున కాత్మవృత్తాంతం బిట్లు చెప్పం దొడంగె. 2

క. తెలిరిక్కలంటి యెంతయు
వెలిగెడు వృక్షములచేత విలసిల్లెడు పెన్
మలలట్లు. ధవళకుసుమం
బులఁ గడుఁబొలుపారువృక్షముల రుచిరంబై. 3

ఉ. వారుణిసేవచే నరుణవర్ణములై చను కేరళీసతీ
చారుకపోలకాంతుల నెసంగుచు నవ్వనదేవతాంఘ్రిలా
క్షారసరంజితంబులనఁగాఁ దగి యెంతయు వన్నెకెక్కి యిం
పారెడునట్టి లేఁజిగురుటాకులచేఁ గడుసంభృతంబునై. 4

తే. తమలపాకులలతలతోఁ దగులుకొనిన
పోఁకమ్రాఁకుల నెంతయుఁ బొలుపుమీఱు
వనరమావాస భవనంబు లనఁగనొప్పు
వరలతామంటపంబులఁ బరివృతమయి. 5

సీ. ప్రేతేశపురి యన మృత్యుభీషణమును
మహనీయమహిషసమంచితయును
గాత్యాయని యనంగ ఖడ్గభీషణయును
లలి రక్తచందనాలంకృతయును
ప్రళయసంధ్య యనంగఁ బల్లవారుణయు, నృ
త్యన్నీలకంఠయు నై వెలింగి
శైలాత్మజ యనంగ స్థాణుసంగతయును
మృగరాజసేవిత యగుచు నెగడి
తే. జానకీదేవి యన నిశాచరగృహీత
యును, సముద్భూతకుశలవయు నయి, రాజ్య
లక్ష్మియనఁ జమరమృగవాలవ్యజనవి
భాసురంబును గజఘటాపాలితయును. 6

సీ. పందికోటులఁ ద్రవ్వఁబడిన పుడమిగల్గి
యొకచోఁ బ్రళయవేళ కుపమయగుచుఁ
జెట్టుమెకంబులచేఁ గూలు తుంగశా
లలనొప్పి యొకచోట లంకఁబోలి
కుసుమసమిత్కుశాంకురశమీపల్లవ
ములనొక్కచోఁ బెండ్లి పుడమి బోలి
కమలాక్షుదేహంబు కైవడి నొకచోట
లలితతమాలనీలంబు నగుచుఁ

తే. పార్థు రథకేతనంబన వానరేంద్ర
శోభితంబయి, మఱియొక్కచో విరాట
నగరియనఁ గీచకావృత యగుచుఁ జాల
నొప్పుమీఱు వింధ్యాటవి యుర్వియందు. 7

తే. బహుళపత్రాఢ్యమయ్యున వ్వనము సప్త
పర్ణభూషితమై చాలఁబరఁగుఁ, గ్రూర
సత్వయుతమయ్యు మునిజనసన్నుతమ్మ
పుష్పవతియయ్యుఁ బూతమై పొల్పుమీఱు. 8

తే. నరవరోత్తమ! యక్కాననడుమ ధర్మ
దేవతాజన్మభూమినాఁ దేజరిలుచు
సకలభువనవిఖ్యాత మాశ్రమ మొకండు
బరఁగుఁ జూపఱకన్నుల పండు వగుచు. 9

సీ. లేఖర్షభులమాట లెక్కసేయని వింధ్య
శైల మెవ్వనియాజ్ఞ మౌళిఁదాల్చె?
నేతపోధననేత వాతాపిదానవు
జఠరానలమున భస్మంబొనర్చె?
నేమౌనిపాదంబు లెక్కె సురాసుర
మణికిరీటస్ఫుర న్మస్తకములఁ
దగ నేమునీంద్రుండు దక్షిణాశాంగనా
లలితాస్యమున నొప్పెఁ దిలక మనఁగ

తే. గఠినగంభీరహుంకారగర్జనమున
నహుషు నెవ్వాఁడు దివినుండి మహికిఁద్రోసె
నతఁ డగస్త్యుండు తద్ధర్మసతి కుమారు
లట్లు పెంచిన చెట్లచే నది వెలుంగు. 10

తే. అతనిపుత్రుండు దృఢదస్యుఁ డనెడు వాఁడు
కలఁ డతం డెప్పుడును నిధ్మములను దెచ్చు
చుంటచేఁ దండ్రి యిధ్మవాహుండటంచు
నాతనిం బిల్చుచుండు నామాంతరమున. 11

తే. తండ్రియానతిఁ జెల్లింపఁ దలఁచి రాముఁ
డనుజుతో సీతతోడ నెయ్యమునఁ గుంభ
సంభవునిఁ గొల్చుచుం బర్ణశాల గట్టు
కొని సుఖంబుండె నేచోటఁ? గొన్నినాళ్లు. 12

తే. ముదముమీఱఁగఁ దేవతాపూజకొఱకు
విరులు గోసెడు జానకీతరుణిహస్త
పల్లవమునుండి ప్రాఁకిన పగిది, నెచటఁ
బల్లవవితానమున రాగ మల్లసిల్లె? 13

తే. దశరథసుతుండు గూల్చిన దనుజవరుల
నల్లచే మూలములు చెమ్మగిల్లి తద్వ
శమున నెఱుపైన మ్రాఁకులచాయ నొప్పు
చిగురుటాకులు నేచోటఁ జెలువుమీఱు. 14

తే. లేడికదుపులు నేటికిఁ గూడ నెచట
జలదవేళల మేఘగర్జనల విని, స్మ
రింపుచును రాము చాపటంకృతు లటంచుఁ
గసవు మేయుట లుడిగి నల్గడలఁ జూచు? 15

తే. వేఁటఁ దెగకున్న మృగముల పిండు వంప
వచ్చినది యనఁ బొలుపాఱు పసిఁడిలేడి
పొంచి రామునిఁ గడుదవ్వుఁ గొంచుఁబోయి
జానకీవిప్రయోగ మెచ్చట ఘటించె? 16

తే. అధిప! యే యాశ్రమమున రామాస్త్రమునను
దెగిన యోజనబాహుని దీర్ఘభుజము
గూర్చె, మునులకుఁ గుంభజుఁ గొలువఁబోవు
నహుషు సర్పశరీరమునఁ దగు శంక. 17

తే. అధిప! యిట్టి తదాశ్రమోపాంతమందుఁ
గలశభవుఁ డబ్ధిఁ గ్రోలుటఁ దెలిసి కుపితుఁ
డైన వరుణుండు ప్రేరేప నజుఁడు సృష్టి
చేసిన మహాంబునిధియనఁ జెలఁగుదాని. 18

సీ. తొలిపంది గున్నకోఱలఁ బట్టియెత్తిన
నేలయనన్ నిండు నీటనొప్పి
మరుదుద్ధతములైన కెరటాలపయితుంపు
రులఁ బుట్టు వానలఁ జెలువుమీఱి.
వాఃకేళులొనరించు వనదేవతలకచం
బుల పూవుల సువాసనలను నలరి
మునులెల్ల ముంచుచోఁ బొడము కమండలు
ధ్వనులచేఁ జాలనందంబు గలిగి

తే. లీల నీరాడదిగిన పుళిందవిభుల
సతుల చన్నులపైనున్న చందనంపు
ధూళులం జాల తెల్లనైక్రాలి నింగి
కెగయుతరఁగల నెంతయు నింపుమీఱి. 19

తే. కెలనఁగలయట్టి మొగలిపొత్తుల పరాగ
పుంజమునఁ గూర్పబడినట్టి పులినవితతిఁ
జాల సొంపొందు తటములఁ గ్రాలి నేత్ర
పర్వ మొనరింపుచుండుఁ బంపాసరస్సు 20

ఆ. ధరణినాథ! పద్మసరసికిఁ బశ్చిమ
తీరమున నొకింత మేరలోనఁ
బెద్దతడవునుండి పెంపొందు బూరుగు
వృక్ష మొకఁడు గలదు పెద్దదిగను. 21

తే. కడలి యనునట్టి విచికిత్స పొడమి నీరు
నానవచ్చిన జలదంబు లనఁగ నొప్పి
మిగుల మలినంబులైన యేనుఁగులచేతఁ
ద్రావఁబడినజలంబులఁ దనరునద్ది. 22

సీ. తరుమూలమును జుట్టి కరికరాకృతి నొప్పు
ముదుసలి చిల్వయే బోదెగాఁగ
వెడఁదకొమ్మలనంటి వ్రేలాడుపాముకూ
సములు సితోత్తరీయములుగాఁగఁ
బ్రళయవేళలఁ దాండవం బాడు నెడ వేయి
చేతులు చాచిన శివుఁడనంగ
దిక్పరిమితిఁజూచు తెఱఁగునఁ గడుదవ్వు
సాగినకొమ్మల బాగుమీఱి

తే. గగనమంటియున్న కతన నేవేళనో
పడుదుననెడి భీతి పొడమి యూఁత
నిలుపుకొన్నపగిది నిడుపైన యూడలఁ
బోలు లతలతోడఁ బొలుపుమీఱి. 23

తే. జలధినీరాని రాకపోకల నొనర్చు
నపుడు జలభరమునఁ జాల నలసి పక్షు
లనఁగఁ గొమ్మలనాఁగిన యబ్దవితతి
చూడ్కి కందని శిఖర విస్ఫూర్తికలిగి. 24

తే. జలదపథమున మెలఁగుచు నలసి పొంత
నున్న రవిరథతురగంబు లుమిసినట్టి
ఫేనసముదాయమో! యన వెలయుతూల
సమితిఁ దెలుపైన శిఖర దేశంబుకలిగి. 25

తే. జగతిరుహ మద్ది దర్శితశకునిపక్ష
పాతగతిచే సుయోధనుపగిది నొప్పి
కొమరుగల వనమాలోప గూఢమగుచు
జలజనాభుఁడనంగ సంస్తవమునంది. 26

తే. దండకారణ్యమునకు నాథుఁడనంగ
హితుఁడనఁగ వింధ్యకును, వనస్పతులకెల్ల
నాథుఁడనఁ గొమ్మచేతులన్ గౌఁగిలించి
వింధ్యవని నొప్పు బూరుగువృక్ష మొకటి. 27

తే. ఆకుజము చాలపెద్దద యగుట దాని
తొఱ్ఱలందును గొమ్మల తుదలయందు
స్కంధసంధులనుంగూళ్లు కట్టుకొని శు
కంబు లెన్నేనియుండు భయంబులేక. 28

ఆ. కాలవశతఁ బండి కలయాకులెల్లను
రాలిపోయినను ధరాజ మద్ది
పచ్చనాకుగముల భాసిల్లునట్లొప్పు
మీఁదఁ జిలుకగములు మెఱయు చుంట. 29

సీ. సీరి నాగటికొనఁ జీరుచో నెగసిన
యమునానదీప్రవాహము లటంచు
వెలియేన్గు పెకలింప వేల్పులనది నుండి
దిగఁజాఱునట్టి పద్మినులటంచు

గగనమెల్లను దిగ్మకరరథాశ్వద్యుతుల్
కొమరారఁగాఁ దగుల్కొనెనటంచు
దిననాథఘృణుల గ్రుక్కిన దిక్తతికి సొంప
యినయరటాకు వీవనలటంచు
తే. విన్నునం బాఱు పచ్చికబీడులనుమఁ
జదలపై నింద్రచాపంబు పొదలెననుచుఁ
జూపఱకు శంకఁగూర్చుచు సురపథమునఁ
బోవు నిరతంబు మేఁత కప్పలుఁగుగములు. 30

చ. పొలుపుగ నా శుకాళి నలుమూలలకుం జని మేసి గూండ్లప
క్షులకయి లేడినెత్తురు దగుల్కొను వ్యాఘ్రనఖాళిఁ బోలు ము
క్కులగమి శాలిమంజరులు గొంచు వడిన్ జనుదెంచి గూండ్ల న
ర్మిలి నెనలేని ప్రేమ నట మేపుచుఁ బిల్లలఁ బుచ్చురాత్రులన్. 31

సీ. పృథ్వీశ ! యొకపెద్ద బిలములో మాతండ్రి
చెలువతోఁ గూడి వసింపుచుండె
నా దంపతుల కపత్యము లేక కుందుచో
నుదయించినాఁడ నే నొకసుతుండఁ
బ్రసవవేదనకు నోర్వఁగ లేక మాతల్లి
వగఁజెంది కాలునినగరి కరిగెఁ
బసితనంబునఁ దల్లిఁ బాసిన నాస్థితి
వీక్షించి నాతండ్రి వృద్ధుఁడయ్యు
తే. నెగురనేరని నాకునై యెలమి నితర
పక్షుల కులాయములక్రిందఁ బడిన శాలి
వల్లరుల నున్న గింజల నెల్లఁదెచ్చి
మొదల నిడి నాకు భుజియించుఁ బిదప నతఁడు. 32

సీ. ఒకనాడు మనుజనాయక! ప్రొద్దుపొడువంగ
వనజారి వెలవెలఁ బాఱుచుండ
నేనుంగురక్తంబుచే నెఱ్ఱబడినట్టి
సింహకేసరముల చెలువుగలిగి
కాచినలక్కతీఁగలబోలె నెఱ్ఱనై
మిగులంగబాడవులై నెగడు పద్మ
రాగమణిశలాకాగుచ్ఛములఁ గూర్పఁ
బడినమార్జనులట్ల వరలు తపన
తే. కిరణములచేతఁ జదలను నరుగుమీఁదఁ
గుసుమవిసరంబునుంబోలెఁ గొమరుమిగులు
నుడుగణంబెల్లఁ దుడువంగఁ బడినచంద
మమరి నింగివెలింగెడు నవసరమున. 33

సీ. రతులఁ జొక్కిన శబరసతీమణుల స్వేద
జలకణంబులనెల్ల సంతరించి
లలి నిటు నటుసూఁగు లతలకుఁ జిగురాకు
గములకుఁ నర్తన క్రమముగఱపి
వికచసరోజాత నికరమరంద శీ
కరముల పెనుసోనఁ గలయఁగూర్చి
నానావిధానూనసూనవాసనలచేఁ
దేటులగమికి సంతృప్తిఁగూర్చి
తే. మహిషరోమంథఫేనముల్ మస్తరించి
విడనిమందంపు దెఱఁగుల నడకనేర్చి
పొలుపుమీఱఁ బ్రభాతవేళలను సొంపు
గులుకు జిలిబిలివలిగాడ్పు లొలయు తఱిని. 34

వ. మఱియుం గమలకాననప్రబోధమంగళపాఠకంబులగు తేఁటికూటువలు ముకుళీకృతదళంబులగు కుముదప్రసవంబుల నడుమం జిక్కిన ఱెక్కల మొత్తంబులతో నహంకరించి హుంకారంబు లొనరింప, నొక్కచో నిద్రాభంగంబున,నరుణవర్ణములైన నేత్రంబులఁ దెఱచుచు వనమృగంబు లిటునటు లేగుచుండఁ బంపాసరోవరమ్మునం గల కలహంసలకోలాహలంబు చెవులపండువు లొనరింపఁ జిలువండితండంబులు తాండవం బాడుచుండ నల్లనల్లన లోకబాంధవుండగు సప్తసైంధవుం డుదయింపఁ బంపాసరఃపరిసరంబునం గల ధరణీరుహశిఖరంబులయందును నుత్తుంగశైలశృంగంబులందును బ్రస్ఫుటంబులై లేయెండలు మెండుకొనునంత మిత్రమండలంబు నిండురూపునం గన్నులపండువుగ గోచరింప నక్కీరవారంబులు స్వైరవిహారంబులం బాఱులుదీర్చి వలయు నెడలకుం బోవ నవ్వనమహీజం బనేకశుకశాబకంబులుగల కులాయసహస్రంబులనొప్పియుశబ్దశూన్యంబగుట రిత్తగన్పట్టుచుండ మజ్జనకుండును, నిజనివాసంబున నిలువం బసికూననగుట బలహీనంబులగు పక్షంబులుగల నేనునుం దండ్రి పొంతంగల కోటరంబు జేరంజనునంత నక్కాంతారంబున జంతుసంతతుల కెల్ల నెంతయు భయంబుగొలుపుచు తటాలున నెగురఁబోవుపక్షుల పక్షనిస్వనంబునం బెంపొందుచు గిరిగుహలం గునుకువోవుచున్న సింగంబుల సింహనాదంబుల నలముకొనుచు, వనదేవతలకు భీతిగొలుపుచు బృధ్వీరుహంబులఁగంపింపఁ జేయుచున్నదో యన వేఁటచప్పుడుప్పతిల్ల నాలించి యర్భకుండనగుటచే మేనుగంపింప శ్రవణరంధ్రంబులు జెవుడుపడఁగ భయవిహ్వలుండనై మత్ప్రాణసంరక్షణార్థంబు పొంతనున్న ముదుసలితండ్రి ఱెక్కలమఱువు సొచ్చితి నంత. 35

ఈవంకఁ గరటికులేశ్వర ప్రచలిత
పరిఫుల్లకమలినీపరిమళంబు

లీచక్కి వనకిరు లెలమి భుజించెను
భద్రముస్తల మేలి పరిమళంబు
లీచాయ రాలిన యెండుటాకుల రొద
లిచ్చోట మృగపంక్తు లిచట నడవి
యేన్గులతండంబు లిచ్చోఁ గిరివ్రజం
బీవంక వనమహిషావళియుచు

తే. నిచట నెమళుల విరుతంబు, లిచటఁ గురర
పంక్తిరొదలు, గపింజలపక్షిగణక
లారవము లిట, నిచ్చట నార్ద్రిపంక
మలినమగు పందికపుల మార్గమనుచు. 36

చ. పొదువుఁ డిదే మృగాధిపసముత్కర మేగినజాడఁ గంటిరే
మదగజమౌక్తికవ్రజ మమర్చినయట్లు వెలింగె నీపథం
బిదె చమరీమృగప్రతతి యేగును దీనిని వెంబడించి మీ
రిదె ధరణీరుహాగ్ర మెస నెక్కుఁడు పట్టుఁడు కార్ముకమ్ములన్. 37

తే. నిలువుఁడీ నిశ్చలముగఁ గుక్కలను విడువుఁ
డనుచు నొండొరువులు చెప్పుకొనుచుఁ జెట్ల
మాటునం డాగియున్నట్టి వేఁటకాండ్ర
గొడవల న్వింటి నంత నోపుడమిఱేఁడ ! 38

సీ. శబరులు పొడువ భీషణభంగి సింగంబు
లొనరించు చటులగర్జనలతోడ
వెఱచి యూథంబులఁ దొఱఁగిన గజయూథ
పతు లొనరించు ఘీంకృతులతోడ
శునకముల్ కండలూడ్చిన దీనదశనున్న
కొదమజింకలయేడ్పు రొదలతోడఁ
బరువెత్తు శబరుల పదఘట్టనములకు
వడకెడు పుడమి చప్పుడులతోడఁ

తే. విభులు మడియంగఁ గలభముల్ వెంటరాఁగ
విరహాభరమున నిటునటుఁ దిరుగుచున్న
హస్తినీతతి ప్రాణనాయకవినాశ
ఖేదమున నాచరించు చీత్కృతులతోడ. 39

తే. కడఁక నుసుగొల్పు శునకసంఘముల ఘుర్ఘు
రధ్వనులతోడ నమ్మహారణ్యమెల్లఁ
జెవులు చిల్లులువోవు పెన్రవళితోడఁ
జాల భీకరమయ్యె భూపాలమౌళి ! 40

చ. తివిరి మథించి పీచు నెడఁ దేఱిననీరముతోడనొప్పు న
ర్ణవమున వేఁటసందడు లణంగిన నవ్వనముల్లసిల్లు నం
త వెరపొకింతపోవిడచి తండ్రి నిజాంకమునుండి నేను కొం
త వెడలి కంఠమెత్తి నినదంబిది యేమని కంటి నద్దెసన్ ? 41

సీ. కృతవీర్యతనయదోర్వ్రతతిప్రకీర్ణమై
పొరలెడు నర్మదాపూరమనఁగఁ
బవమాననిరుపమబలకంపితంబౌచుఁ
దనరు తమాలకానన మనంగ
జగములయేఁపు మాపఁగమృత్యుదేవతల్
కొమరొప్పఁదీర్చిన కుప్పనంగఁ
దపనుని కిరణసంతతికిఁ బెగ్గిలి యొక్క
చోఁగూడు చీఁకటిప్రోగనంగఁ

తే. దిరుగువైవస్వతుని భటోత్కరమనంగఁ
గాననమునకుఁ గాఱుచీఁకటి ఘటించి
చాలభీకరమై వేన వేలకొలఁది
నున్న శబరసమూహంబు గన్నవాఁడ. 42

తే. అవనినాయక ! తత్సమూహమున మరల
నుదయమొందిన యేకలవ్యుండవంగఁ
గ్రాలు వానిని దృఢశరీరంబువాని
మిపుల బాల్యవయస్కుఁడై మెఱయువాని. 43

ఆ. కువలయంబుఁబోలి మిపులంగ నల్లనౌ
తనువిభాప్రవాహ మనఁగఁబరఁగు
వనరుహాప్తకూర్మితనయాజలంబున
నావసంబునించు నట్టివాని. 44

తే. మిగులఁగుటిలంబులై యంసయుగళమందు
పాళి వ్రేలాడు కుఱులచే నతిశయిల్లి
దంతిమదమంటి నలుపులై తనరు కేస
రములఁ గొమరొందు హరియన నమరువాని. 45

తే. పత్రములఁ బండుటం బల్లవములరాగ
మంటినో యననేక కర్ణావతంస
మైన భుజగఫణామణి యరుణకాంతి
వశత నెఱుపైన వామపార్శ్వంబువాని. 46

తే. మడిసిన గజాళికటముల నడరి సప్త
పర్ణపరిమళ మీనుచు వరలు మదముఁ
బూని కృష్ణాగురువుఁబోలెఁ బొలుపుమీఱఁ
గలయఁ బ్రామిన నెమ్మేన నలరువాని. 47

తే. చెలఁగినెమ్మేని తావి కాసించి బర్హి
బర్హచిత్రప్రభల నొప్పు బంభరముల
పంక్తినా బొల్చెడు తమాలపల్లవమ్ము
నాతపత్రంబుగా బట్టినట్టివాని. 48

తే. తనకునోడిన వింధ్యకాననము భీతిఁ
దవిలి విచలితకర్ణపల్లవమిషమున
నొప్పు పాణితలంబున నొనరఁ దుడువ
మలఁగుచెక్కిలి చెమట నలరువాని. 49

తే. పొసఁగ ముత్యాలు గురివెందపూసలునుఁ గ
లిపిఘటించినదండ దాల్చెనో యనంగ
నెండిన మృగాస్రబిందువు లింతనంత
నంటి చెమటలదోఁగు పే రక్కువాని. 50

తే. చలన మెనయని భక్తితోఁ గొలువఁబడిన
యగజ యీతండు దుర్మార్గుఁడగుట తెలిసి
యంక మిడ్డత్రిశూలమో యనఁగ వెడఁద
నొసట నూర్ధ్వ సిరాత్రయం బెసఁగువాని. 51

సీ. హితవృత్తి వెనువెంట నేతెంచునవియును
నతిదూర మరుగుట నలసినవియు
స్వయముగ నెఱుపులై వరలుట నొండియున్
మృగరక్తముంగార్చు రీతిఁదోచు
రసనలచే నిజశ్రమఁ దెల్పునవియును
బందికోఁ అలయేటు వడసినవియుఁ
దగ మృగీతతికి వైధవ్యంబుగూర్చుచుఁ
గడుఁజిన్నవయ్యు నెక్కుడు బలంబు

తే. కలుగుటం గేసరంబులు కానరాని
కొదమసింగంబులంబోలి కొనుచువిూఱు
పలుతెఱంగులవన్నెల నలరు కుక్క
తండములు వెంటఁ జనుదేరఁ దనరువాని. 52

సీ. కొందఱు సింగంపు కూనల వడువునఁ
గరికుంభమౌక్తికోత్కరముఁబట్టి
కొందఱు నల్లద్రాగుడు దొరలనఁగేల
నామిషాహారంబు లమరఁబట్టి
కొందఱు ప్రమథుల గోలె నేనుఁగుతిండి
మెకములతోళు లెన్నికఁ గ్రహించి
కొందఱు తొలుకరి చందంబునంద వా
ర్ధరవర్ణమలినాంబరముల దాల్చి
తే. మఱియు నివిగాక మిక్కిలి తెఱఁగులైన
నడవడులుకల్గి చాలఁజెన్నడరు శబర
సేనలొకకొన్ని తనపొంతఁ జేరికొలువఁ
గొంచ కక్కానలోఁ జరియించువాని. 53

సీ. కడఁకమై నేకచక్రము నాక్రమించుట
బకరాక్షసుండనఁ బరఁగువానిఁ
దమి మహానాగదంతముల నుత్పాటించి
ఖగవల్లభుండన నెగడువానిఁ
గణుతింప మఱియు శిఖండివిరోధియై
మిన్నేటికొడుకన మెఱయువాని
వెస ఘోణిదంష్ట్రావిభిన్నవక్షుండయి
నలి హిరణ్యాక్షదానవుఁడనంగఁ
తే. దనరువానిని, వింధ్యసంతతి యనంగఁ
జేరఁగూర్చిన కలికాల సారమనఁగ
నమరువాని, మాతంగకుఁడనెడు శబర
నాయకునిఁగంటి బేరనంతరము వింటి. 54

సీ. మనుజమాంసంబు లిమ్మున హారించుటయంద
తనరు గదా! వీరి ధర్మబుద్ధి
యెలమిమై సదసత్తు లెఱుఁగింప వీరికి
గుడ్లగూబలుగదా! గురుజనములు
బుధనిందితములైన మధుమాంసములుగదా!
కోర్కెమై వీరలు కుడుచుకూళ్లు
పులుఁగులజాడలు తెలిసికొంటయెకదా!
యూహింపవీరల కున్నప్రజ్ఞ
తే. భార్య లొగిఁ జెఱఁ జిక్కిన పరవనితలు
జీవనముచౌర్యవృత్తి యో క్షితిప! వీరు
కాపురంబున్న కానలఁ గాల్చువార
లనుచుఁ గనినంత నాతలంపునకుఁ దోఁచె. 55

తే. ఇట్టు లేనెంచుచుండ నచ్చెట్టుక్రింద
నంతఁ దనసేవకుఁడు పల్లవాసనంబు
నిడఁగ వనసంచరణఖేద మడఁచుకొనఁగ
నెంచి విలుఁ గ్రిందనిడి విశ్రమించె నతఁడు. 56

చ. ఇఁక నొకసేవకుండు కొలనింపుగఁ జొచ్చి స్రవించు మౌక్తిక
ప్రకరముఁబోలి సారసపరాగకషాయమునైన వారిఁ దా
నొకనలినీపలాశమున నొప్పుగఁ బట్టి మఱిన్ లసన్మృణా
ళికలనుదెచ్చి యిచ్చిన లలిన్ మది మెచ్చుచు నాతఁడింపునన్. 57

ఆ. ఆజలంబుఁద్రాగి యటమీద నీహార
కరునికళల సింహికాసుతుండుఁ
బోలెనా మృణాళముల నెల్లమెసఁగి తా
నేగె సేనతోడ నెచటికేని. 58

తే. ఆసమూహంబునంగల యట్టివృద్ధ
శబరుఁ డొకరుండు తనకుమాంసము లభింప
కునికి రాక్షసుఁడో యన నుగ్రుఁడగుచుఁ
దడసె నొక్కింత తడవు తత్తరువుక్రింద. 59

తే. చెంచుతేఁ డెడ చనినంతఁ గాంచి పక్షి
పలలముంగోరు డేగకై వడినతండు
మిగులఁ గెంపారుకనుల సమ్మోదినీజ
మెక్కుటకుఁగాఁగ మొదలంటఁ జక్కఁజూచి. 60

సీ. ఆభ్రంకషంబులై యమరుకొమ్మల నొప్పు
నక్కుజం బవ లీల నెక్కియతఁడు
కడఁకమై విపులశాఖాసంధులనుండిఁ
గోటరంబులనుండిఁ గొంకు లేక
యొగసిపోయెడిశక్తి తగులకుండినవాని
బూరుగుపూవులం బోలువాని
జల్లేమకండ్లన నుల్లసిల్లెడువానిఁ
జేనంటఁగందెడువానిఁగొన్ని

తే. విఱియఁ బారెడుతొక్కల వెలయుచుంటఁ
గమలినీ చారుసంవర్తికలనుబోలు
చిలుకపిల్లలఁబట్టి పండులనుబోలెఁ
బుడమిఁ బడవైచెఁ గినుకమై మెడలవిఱచి. 61

సీ. అసహాయుఁడగుతండ్రి ప్రాణహారంబగు
నమ్మహోపద్రవ మరసి, మరణ
భయమున వడఁకుచు, బాష్పాంబుసిక్తంబుఁ
జలితంబునగుచూడ్కి లలి నిటునటుఁ

ద్రిప్పుచు, నక్కుఱుఁ దప్పింపనేరక
యప్పటి కద్దియే యనువటంచుఁ
దగిలిన పుత్రవాత్సల్యంబుకతనఁ దా
నన్నుఁ బక్షంబుల నడుమఁగప్పి

తే. కొనుచు, ననుఁబ్రోచుటయె తన పనియటంచుఁ
దలఁచుచు, నికేమితోఁచ కెంతయునువంత
గదురఁ దనజొమ్ములో నన్ను నదిమిపట్టి
నిలచెఁ దనగూటిలోన నచ్చిలుక యొదిగి. 62

క. అల్లనఁ గొమ్మలఁదడవుచు
భిల్లుఁడు గనికరముదొఱఁగి బిలమున నృపభృ
ద్వల్లభుఁ బోలిన భుజమును
మెల్లననిడి తండ్రిఁబట్టి మృతునింజేసెన్. 63

తే. మిగుల స్వల్పశరీరుండ నగుట, భయము
గదిరి కుంచించుకొనియుంట, నదియుఁగాక
బ్రదికెడుదినంబులుంటఁ, దత్పక్షగతుఁడ
నైన ననుఁజూడలేదొట్లొ కాని యతఁడు. 64

తే. తెగిన తండ్రినతఁడుఁ గ్రింది మొగముగాఁగ
విడచునెడఁ దండ్రిపదముల నడుమఁగంధ
రముఘటించి తదంకభాగమునడాఁగి
యతని వెనువెంటఁగూలితి నవనిమీఁద. 65

తే. పవనవశమున నొక్కచోఁ బడినపండు
టాకుగమిఁ గూలుకతన మృదువవయవముల
కొక్కయింతయు వేదన యొలయకున్న
యట్టి ననునేనుగనుఁగొంటి నంతమీఁద. 66

సీ. తనువుతోఁగూడఁ బుట్టినభయంబునఁజిక్కి
ప్రాణముల్ విడఁదగునప్పుడైన
నెలమి స్నేహరసంబు నెఱుఁగంగ నేరక
తత్పుత్రములచాయ దనరు నేను
నొక్కింతపొడమిన తెక్కలనిటునటుఁ
బొరలాడుచుఁ గృతాంతు ముఖమునుండి
తప్పినవానిఁగాఁ దలపోసికొనుచు, న
ల్లన సమీపంబునఁ దనరి, వింధ్య

తే. వనికి సొగసైన ధమ్మిల్ల మనఁగ మిగుల
నీలమై మట్టమధ్యాహ్న కాలమునను
గటికిచీఁకటిగూర్చు శాఖలఁజెలంగు
నట్టి చీఁకటిమ్రాన్ పొంత కరిగినాఁడ. 67

తే. పిదప నతఁ డమ్మహీరుహంబు దిగి, క్రిందఁ
బడిన శుకశాబకంబుల ముడిచికొని, య
నంతరము బోయతేఁడేగి నట్టిత్రోవఁ
బట్టి కడువేగమునఁబోవఁ బయనమయ్యె. 68

తే. జీవితమునం దొకింతాస చిక్కి చాల
దూరమునుండి పడుట శరీరపటిమ
సడలి, జనకునిమ్మృతికినై యడలునన్ను
డప్పితగిలి పీడింపదొడంగె నపుడు. 69

ఆ. అతఁడు చాలదూర మరుగునంచుఁ దలంచి
మెడ నొకింతయెత్తి కడలఁజూచి
తృణముగదల నతఁడు తిరిగెనం చరయుచు
నచటినుండి సరసి కరుగఁదలఁచి. 70

ఉ. ఱెక్కలు రామి నేఁగుచు, మఱిన్ మహిఁగూలుచు లేచుచున్, మఱిన్
గ్రక్కున నేలపైఁబడెదు నన్నొకపక్షము మీఁద నానుకొం
చొక్కుడుగైనబోనెఱుఁగకుండుట మోమెగ నెత్తియెంతయున్
స్రుక్కుచునున్న నామదికిఁ జొప్పడఁబుట్టెఁ దలంపొకండొగిన్. 71

సీ. అతికష్టదశలయం దైనను ధరణిపైఁ
బ్రాణికోటికి జీవితాశ సెడదు
క్షితిఁజంతువుల కెల్ల జీవితంబునకంటెఁ
బ్రియమైనవస్తువు వేఱె లేదు
సుగృహీతుఁడను పేర నెగడు నాజనకుండు
సురలోకముం జూడ నరుగుచుండఁ
గనులార నాతనిఁ గనియుఁ బ్రాణములతో
నున్నాఁడ నతిసిద్ధయుండ నగుట

తే. నతఁడు చేసినమేలు నావంతయైన
నరయనైతిని దుర్బుద్ధినగుట జనని
పోలియ నన్నంత సదయుఁడై ముదిమినున్న
యితఁడు పెంచుట మఱచితి నింతలోన. 72

మ. అకటా! తండ్రి గతింపఁ గాంచియు నిపీ! ప్రాణాలపై నాస పో
దకదా! జీవితతృష్ణ యెవ్వి దురాత్ముం సేయునో ప్రాణ మి
ట్టి కఠోరస్థితినున్న డప్పి విడకుండెన్ దండ్రి పోనున్నకూ
శకు నా కీసలిలాభిలాష యిపుడేలా సంఘటిల్లెన్ మదిన్. 73

తే. తండ్రిమరణంబుఁ బలుమాఱుఁ దలఁచి తలఁచి
చాలఁగుందెడునాకు నీ సలిలకాంక్ష
యడరెఁ గఠినుండనగుట, నీ యెడల సదయు
లైనతనయులు ప్రాణము లైనవిడరె. 74

సీ. కాసార మిచటికిఁ గడుదూర, మదిగాక
యక్కటా ! రవియు నభోంతరమున
నిలచి యంశువుల నగ్నిపరాగమున్ జల్లు
కైవడిఁ బిట్టెండ గాయుచుండి
దాహంబుఁ బెద్దఁగాఁ దగిలించుచుండెఁ, ద
త్కరతప్తపాంసుసర్గము భూమి
వెగ్గలంబైనదప్పికిఁ జిక్కి గా యువ
యువము లొక్కింతయు నరుగ లేవు

తే. నాశరీరంబు నాయధీనమున లేదు,
గ్రమ్ముచుండెను జీఁకటి కన్నుఁగవకుఁ
జావుఁ గోరకయున్న నీ సమయమునను
మృతిఘటించుత విధి నాకు మేలుదలఁచి. 75

తే. అరయ చిట్లుండునంతఁ దత్సరసిపొంతఁ
గ్రాలెడు తపోవనమున జాబాలి యనెడు
మునివరుం డొక్కఁడుండెఁ దత్తనయుఁడగు హా
రీతుఁడను వాఁడు మిత్రసమేతుఁ డగుచు. 76

కం. ఘనతేజోయుతుఁ డగుటన్
గనుఁగొన శక్యంబుగాని గాత్రముతోడన్
మునిసుతుఁ డాతఁడు రెండవ
వనరుహామిత్రుఁ డన నొప్పెఁ బార్థివతిలకా ! 77

తే. అరయ లేయెండ నమరు వాసర మనంగఁ
గారుచిచ్చున నొప్పు కాంతార మనఁగ
నాతఁ డింపొందు మేలిమిపూతఁగనిన
కైవడిం దోఁచు నెమ్మేని కాంతికలిమి. 78

చ. సదమలశోణవర్ణములు సన్నుతతీర్థజలావగాహనా
భ్యుదితపవిత్రతాకలితముల్ జటలూని యతండు వెల్గె, మున్
బొదివి శిఖావళిన్ మలఁచి పొల్పున ఖాండవకాననంబుఁ గా
ల్పఁదలఁచి మాయఁపున్ వటువు లాగున దోఁచినపావకుండనన్. 79

క. అమితతపోదాహమునన్
దమిఁగ్రోలినధూమతతియన, సితాసితవ
ర్ణమునన్ దనరెడుమృగచ
ర్మమున గప్పఁబడినమేన రంజిలె నధిపా. 80

తే. మిగులదేలికయై గాలి కెగురుచుంట
నవ్యబిససూత్రములచే నొనర్పఁబడిన
రీతి, శోభిల్లు యజ్ఞోపవీతమునను
డంబుమీఱెడి సవ్యభుజంబు వాఁడు. 81

క. గిరియన సమేఖలుండై,
కరికలభం బనఁగ వికచకైరవదళబా
ధురశకలదశనుఁడై, మఱి
వరుణుం డనఁగాఁ గృతోదవాసుం డగుచున్. 82

వ. హరియన నపహతనరకభయుండై, యమగణంబనఁ జిత్రమృగకృత్తికా
శ్లేషసంశోభితుండై, ప్రావృట్సమయంబుకైవడి దూరీకృతరజఃప్రస
రుండై, సామప్రయోగరతుఁడయ్యు నవలంబితదండుండై, సుప్తుండ
య్యు బుద్ధుండై, సన్నిహితనేత్రద్వయుండయ్యును సంత్యక్తవామ
లోచనుండై జలకంబులాడుతలంపునఁ-దత్సరోవరంబుపొంత కరుదెంచె.

క. అరుదెంచి, యట్టి నను గని
కరమునఁ గని, పలికె వెంటఁ గలనెచ్చెలితో
నరయ, నకారణమైత్రీ
కరణధురంధరములుగద ఘనులమనంబుల్. 84

ఆ. డేగనోటినుండి డిగఁజాఱెనో ! ధరి
త్రీరుహంబునుండి క్రిందఁబడెనొ
తెలియరాదు కంటె చెలికాడ ! పక్షము
లైనఁ బాడములేదె యక్కటకట! 85

ఉ. పాపము ! మోడ్చికన్గవఁ బిపాసకుఁ దూలుచుఁ బెట్టుగాఁ జం
చూపుట మల్లనం దెఱచుచున్, వడినూర్చుచుఁ, గంఠమెత్తఁగా
నోపక కుందెడిన్ సరసియొద్దనె యుండుటనుండె నాయు వే
దో పిసరంత దీనిఁగొని యొయ్యనరమ్మిఁక నీటిపొంతకున్. 86

తే. అనుచుఁ దనమిత్రుతోఁ బల్కి యంత నన్నుఁ
గొలను జేర్పించి యతనిచే నెలమిఁ దనదు
దండముఁ గమండలువు నాతి బండమీఁద
నిలిపి యిడె నాకు నీళ్లిన్ని నిజకరమున. 87

తే. జలకణంబులనుం గ్రోలి తెలివిఁ గనిన
నన్నుఁ దత్తీరమున నెల్చియున్న తావు
రాకుమఱుఁగున నిడి యెండ దాఁకకుండ
మునిఁగె నామీఁద సంకల్పపూర్వకముగ. 88

సీ. తోయంబులాడి ప్రాణాయామపూతుఁడై
యఘమర్షణంబులై యలరుమంత్ర
ముల నొగి నుచ్చరించుచు నర్ఘ్య విరిసిన
యరుణాబ్జములు దివాకరునిఁ గొలిచి
కమనీయధవళవల్కలమును ధరియించి
కమలకింజల్కసంకలిత మగుచుఁ
బావనంబగు తత్సరోవరజలమున
నిండింపఁబడిన కమండలువును

తే. బూని యొకకేల, నభిషేకపూతులైన
మునికుమారులతోఁ గూడి ముదముతోడ
నన్ను రెండవహస్తమునన్ ధరించి,
చనియె మెల్లనఁ దత్తపోవనమునకును. 89

వ. నేనునుం దత్కరసరసిరుహసంస్థితుండనై యొక్కింతదూర మరిగి
యెదుట నొకచోట, 90

తే. తాలహింతాలతిలకతమాలసరళ
కేతకీపూగపున్నాగచూతలోధ్ర
వకుళసహకారలవలీలవంగముఖ ధ
రాజముల నొప్పు వనములం గ్రాలుదాని. 91

తే. మాయపున్ లేడి కొఱుకంగ మఱలమొలచు
లతలతోడను దశరథసుతునిచాప
కోటివిన్యాసవిషమితక్షోణితలము
లైన దండకవనుల నింపారుదాని. 92

చ. విడువక వ్రేల్చుచుంట మదిఁ బ్రీతి వహించి మునీంద్రకోటి నె
వ్వడి సశరీరకంబుగ దివంబునకుం గొనిపోవ నగ్ని ల
క్కడ కరుగంగ లీలమెయిఁ గట్టినమెట్టులనంగ నింగి కే
ర్పడఁ జనుధూమసంతతుల రంజిలి యొప్పెడిదాని భూవరా ! 93

చ. తరఁగల సూర్యుఁ దాఁకుచును దాపససంగతిఁబోలె నిర్మల
స్ఫురణములై మునీంద్రపదముల్ గొలువం జనుదెంచుఖేచరో
త్కరమన, రాత్రులన్ వెలుగు కైరవసంతతి నింపుమీఱి బం
ధురగతిఁ దోఁచు దీర్ఘికలతో విలసిల్లెడుదాని రాణ్మణీ. 94

వ. మ్రొక్కుచున్నవో యనం గాలికి నొఱఁగు శిఖావళుల నలరు వనలత
లతోడను, బూజింపుచున్నవో యన నెడతెగక జలజలరాల్చు కుసు
మవిసరంబులనెసఁగు పాదపంబులతోడను, నిటునటుఁ జల్లిన భస్మ

రేఖల నలంకృతంబులగు మునిజనభోజనభూభాగంబులతోడను, నుప చరింపఁబడు నతిథివర్గంబులతోడను, బూజింపఁబడు పితృదైవతముల తోడను, నర్చింపఁబడు హరిహరహిరణ్యగర్భులతోడను, బూరింపం బడు కమండలువులతోడను, విలసిల్లుచు, మఱియునుం బరమేష్ఠిఁబో లెఁ ద్రిభువనవందితంబై, సాంఖ్యంబుకైవడిం గపిలాధిష్ఠితంబై, యుద యనుపోలిక నానందితవత్సకులంబై, జలధరసమయంబురీతి వన మధ్యసుఖప్రసుప్తహరియై, ఖాండవవినాశోద్యతార్జునుచందంబునం బ్రారబ్ధాగ్నికార్యంబై, యదియునుం గాక, సురభివిలేపనస్ఫురితఁబ య్యును నావిర్భూతహవ్యధూమగంధంబై, మాతంగకులసంయుతం బయ్యును బరమపవిత్రంబై, ధూమకేతుశతోల్లసితంబయ్యును బ్రశాం తోపద్రవంబై, యతిమనోహరంబగుచు రెండవలోకేశలోకం బనం గనుపట్టు నాశ్రమంబుఁ గనుఁగొంటి. 96

సీ. మఖధూమములయంద మాలిన్య మదియుంట
తలఁపఁగ నిజచరిత్రములఁ గాదు
నయనరాగంబు వనప్రియంబులయంద
రహిఁ జూడఁ బరకళత్రములఁ గాదు
తమిమీఱఁ గంఠగ్రహము కమండలులంద
యరయంగ సురతకార్యములఁ గాదు
ఒగిఁ గుచస్పర్శంబు హోమధేనువులంద
తిలకింప నెలఁతలదెసను గాదు

తే. శకునివధ భారతమునంద సంక్రమించె
భూతిమలినత్వ మగ్నికె పొలిచియుండెఁ
బొలుపుగ నధోగతియును మూలములకు నమరెఁ
గాని తత్తపోవని వేఱె కానరాదు. 97

సీ. ఆరీతి వని కలంకారంబుఁ గూర్చుచుఁ
జిగురుటాకుల నుల్లసిలుచు, మాని
వరుల కృష్ణాజినవ్రజమున, జలకముం
డలువుల, నొప్పు శాఖలఁ జెలఁగుచు
నెలమిమై జికకూనలు గ్రోలుజలముల
నమరిన యాలవాలమున వెలసి
మునికుమారకులు పొల్పున వ్రేలఁ దీసిన
వల్కలంబులఁ జాల వలనుమీఱి
తే. లీలమై వివిధపుష్పమాలికలతోడ
స్కంధము నలంకరించిన కతన మిపుల
బాలుపుమీఱు రక్తాశోకభూరుహంబు
తిన్నెమీఁదనుఁ గూర్చుండి యున్నవాని. 98

తే. అంబురాసులచే భువనంబువోలెఁ
గులగిరులచేత బంగరు కొండబోలె
నమితతప మాచరించు మహర్షివరుల
తోడఁ బరివేష్టితుండయి తోఁచువాని. 99

చ. ప్రణయునిబోలెఁ గేశములఁ బట్టుచు, శాపభయంబుచేఁబలెన్
వణఁకుచు, భ్రూయుగంబునకు భంగము గూర్చుచుఁ గ్రుద్ధవోలె, ను
ల్బణముగ మత్తవోలె విచలద్గతినొప్పు జరాసరోరుహే
క్షణ ఘటియించెనో కొ యనఁగన్ దెలుపౌ నొడలూను నాతనిన్.

చ. ఇల మునులం దపంబుల జయించి గణించిన ధర్మకేతనం
బు లనఁగ, స్వర్గమెక్కుటకుఁ బూనికఁ గట్టినత్రాళ్ళకైవడిం,
బాలుపుగ వృద్ధిఁజెందిన తపోధరణీజము మేలిపూలగు
త్తు లనఁగఁ దెల్లనౌ జడలతో మిగులన్ విలసిల్లు నాతనిన్. 101

తే. ఇంపుమెయి నడ్డముగఁ బ్రవహింపుచున్న
యమరతటినీప్రవాహత్రయమున నొప్పు
హిమగిరిశిలాగతిం ద్రిపుండ్రములతోడ
డంబుమీఱు లలాటపట్టంబువాని. 102

తే. అరయ సత్వగుణప్రరోహంబు లనఁగ,
నమలకరుణాప్రవాహంబు లనఁగ నొప్పు
వేదపఠనంబుతఱిఁ దోఁచు విమలదంత
కాంతుల నిజాగ్రభాగంబు గప్పువాని. 103

తే తనువు గనిన శాపాక్షరోత్కర మనంగ
సారెసారెకు సోమరసంబు గ్రక్క-
చుంటఁ దద్వాసనకు మోమునొద్ద జేరి
వెలయు నళిపంక్తిచే నుల్లసిలెడువాని. 104

తే. అమితచపలంబు లగు నింద్రియాశ్వములకు
లీలమెయిఁ గట్టిపెట్టిన త్రాళ్లు లనఁగ
నిడుపు లగు కంఠనాడుల నడరి మిన్నుల
వంగిన శిరోధరంబున వరలువాని. 105

తే. తేలెడు మృణాళవల్లితోఁ గ్రాలు నిర్జ
రాపగాపూర మనఁగ నంసావలంబి
యజ్ఞసూత్రంబుసంగతి ననిలజనిత
తనుతరంగంబు గల మేను దాల్చువాని. 106

తే. లాలిత స్థూల ముక్తాఫలముల నమరు
భారతీకంఠహారంబు పగిదినొప్పు
నిర్మలస్ఫటికఖండవినిర్మితాక్ష
వలయముం గేలఁ ద్రిప్పుచు నలరువాని. 107

వ. రాజహంసంబుచేఁ బుండరీకషండంబుకైవడిం, జంద్రకిరణమ్ములతోడ
ను, దుగ్ధఫేనంబులతోడను నిర్మింపఁబడి మానససరోవరజలంబుల
ను కుకుటం బరిశుభ్రంబగు దుకూలవల్కలంబు తోడను దివిజనదీ
సలిలపూర్ణంబై, త్రిదండోపవిష్టంబై సమీపంబునఁ దనరు స్ఫటికమణి
మయకమండలువున విరాజిల్లుచు మఱియును 108

తే. సరసిజభవుం డనంగ నాశ్రమగురుఁడయి
దివిజగురుఁడన జన్మవర్ధితకచుఁడయి
భస్మపాండుగోమాశ్లిష్ట వర్ష్ముఁడయి, శి
వానుకృతుఁడగు జాబాలిమౌనిఁ గంటి. 109

తే. కాంచి మదిలోన నిట్టు లూహించుకొంటి,
భూతలంబున నెటువంటిమునులకైనఁ
దేజ మతిదుస్సహంబు గదే తలంప
బూదిగవిసినచంద్రనిప్పుకలువోలె. 110

సీ. సకలలోకార్చితచరణసరోజు, లు
దగ్రతపోజలధౌతమతులు
కరతలామలకంబుగతి సర్వలోకంబు
దివ్యదృష్టిం జూచు భవ్యమతులు
నైన యీదృఙ్మహామౌనిజనంబుల
పటిమ లెన్నంగ నేమిటికి వీరి
నామాక్షరంబులైనను పాపములఁ బాపు
నన దర్శనంబుల నడుగ నేల

తే. యనఘుఁ డితఁ డీశుఁడౌట నీ యాశ్రమంబు
జెందె ధన్యత్వ, మిదియేల క్షితితలంబె
ధన్యతం జెందె భూతలధాత్రియైన
వీనికతమున మాటలు వేయునేల. 111

తే. అరయ, నీమునులెల్లఁ బుణ్యాత్ములుగద
యితని రెండవయజుఁడని మతిదలంచి
దినము నేతన్ముఖాబ్జంబుఁ గనుచుఁ బుణ్య
కథలనాలించుభాగ్యంబు గనిరకతన. 112

చ. అతులమతిప్రసన్నము దరస్మేరసనిర్ఝరశోభియుం, గభీ
రతఁగమనీయమాను రుచిరద్విజయుక్తముఁ దన్ముఖాబ్జము
న్నతిఁగ వసించి మానసమునం గలహంసిబలెన్ దదీయసం
గతిజసుఖంబుఁ జెందుచును గాంచెను ధన్యత వాగ్లతాంగియున్. 113

తే. వీనిచేత సనాథమై వెలయుచున్న
యవనితలమండలంబుఁ గన్నారఁజూచి
సప్తఋషిమండలనివాససంప్రభూత
గౌరవము నిక్కముగ నింగి కాంచదయ్యె. 114

చ. ప్రళయదినేంద్రభానునికరం బన నెంతయు దుర్నిరీక్ష్యమై,
లలితమృగాంకదీధితుల లాగున నిర్మలమైన యీజటా
వళి, శివునౌదలన్ విబుధవాహినికైవడి హవ్యభృచ్ఛిఖా
వళిఁ, దగ వ్రేల్చు పాలగతి భాసిలు నీ జర యెట్టి దిట్టయో. 115

తే. అవిరతము హోమధూమంబు లడరఁజేసి
యాశ్రమమునకు మలినత్వ మంటఁజేయు
వీనిఁగనుఁగొని తపనుండు భీతుఁడట్లు
కిరణములు నేలమోపక తిరుగునిచట. 116

తే. మంత్రపూతంబులైన హోమములనెల్లఁ
బ్రీతిమై స్వీకరించెడురీతి నిచటఁ
బవనచలితశిఖాకలాపంబు లనెడు
నంజలులు గల్గి యొప్పారు నగ్నితతులు. 117

సీ. కరుణారసమునకు వరనదీపూరంబు,
దవవహ్ని రాగపల్లవితతికి,
బడబానలంబు లోభమహార్ణవమునకు,
సాధుత్వమునకును జన్మభూమి,
నికషోపలము శాస్త్రనికరరత్నములకు,
సత్యంబునకుఁ బ్రాణసమసఖుండు,
కలికాలమునకు నుగ్రతరవిపక్షుండు,
పుణ్యసంపత్తికిఁ బుట్టినిల్లు,
తే. కమలమిత్రుండు మోహాంధకారమునకు,
నఘపయోధరతతికిఁ జంఝూనిలంబు,
దుర్గతిద్వారములకు నర్గళంబు,
సత్పథంబుల కరయ దర్శకుఁడు నితఁడు. 118

తే. ఈతపోధనుమహిమచే నీతపోవ
నంబు నన్యోన్యజాతివైరంబు లుడిగి,
కనులపండువు గావించు జనులకెల్ల
నద్భుతముగాదె మునుల మాహాత్మ్య మరయ. 119

తే. తనరఁ దిర్యగ్వ్రజంబుసైతమును నిచట
నీసులును, జాతివైరంబు లెల్లఁద్రోచి
యసదృశములైన మునివనవసతిసుఖము
లనుభవింపుచు నుండెగా వినుతలీల.

తే. ఫుల్లకైరవవిపినంబు బోలు చంద్ర
కములగమినొప్పు బర్హిపింఛమునుగాంచి
హరిణదృక్కాంతిశబలితమైన శాద్వ
లమని తచ్ఛాయకరిగెఁ జిల్వ వడదాఁకి. 120

తే. వెలయ నీ లేడి తల్లిని విడచి కేస
రములు మొలవని హరికిశోరములఁ గూడి
యెడ తెగక పాలఁ జేపుసింహీ స్తనంబు
గోసర కుపజాతమైత్రిచేఁ గుడుపఁ దొడఁగె. 121

ఆ. ఇచటనున్నయట్టి యీకపివిసరంబు
జాపలంబుఁ బోఁగ జలకమాడి
పూతవృత్తినున్న మునికుమారకులకు
ఫలము లిడుచునుండు నెలమిమివుల. 122

తే. మానినాయక హోమధూమములనాని
ఫలములందాల్చి మృగచర్మముల వహించి
యోలి నిశ్చేతంబులై గ్రాలు నిచటి
వృక్షములుగూడ వ్రతులట్ల వెలయుచుండె. 123

తే. ఇట్టులెంచెడు నన్నుఁగొని యేగియచటఁ
గ్రాలు రక్తాశోకధరారుహంబు
ఛాయ దింపి హారీతుండు జనకు మ్రొక్కి
పొంతనున్నకుశాసనంబున వసించె. 124

తే. అచటిమానులెల్ల నన్నుఁజూచి యచటఁగూరు
చున్న మునిసుతు నడిగి కోయన్న! నీకుఁ
జిక్కెనెచ్చోటనీచిల్క ? చెప్పుమనుచు
నడుగ వారలఁగాంచి యి ట్లనియెనతఁడు. 125

సీ. మునులార! కొలనిమొద్దుననున్నమ్రానిపై
నలరు నీడమునుండి యవనిఁగూలి
రవికరతాప మోరువలేక కట్టెండ
నుడికిన ధరణిపైఁ బడి పొరలుచు

నొంటియయూరుపుతోడ నున్నయీచిల్కకూ
    ననుఁబట్టి నిజనీడమునను నిలుపఁ
దలఁచితి నేను నద్ధరణీజ మెక్కనే
    రక దీని నేతదాశ్రమమునకును

తే. దెచ్చినాఁడను గరుణ మదింజనింప
నెఱకలొదవి తనంతఁదా నెగుర నేర్చు
దనుక నిటనొక్కతరుబిలమునను నిలచి
మన మిడినమేఁత మేయుచు మనెడునిదియు. 126

తే. అనఘమతులార! మనబోటి మునుల కెల్ల
ధర్మమగుఁగా ననాథసంత్రాణవృత్తి
పక్షులు మొల్చుపిదప నభఃస్థలమున
మెలఁగనోచి యిదిచను వలయు నెడకు. 127

తే. ఇట్టిమూకవృత్తాంత మెల్ల నాల
కించి జాబాలి నను నెఱిఁగినయతండు
బలెఁ గనుంగొని పలుమఱు, పలికె నీతఁ
డనుభవించు నిజావినయఫల మనుచు. 128

తే. ఈతఁడుత్రికాలవేది, జ్ఞానేక్షణమునఁ
దెలియు జగమెల్లఁ గరతలామలకముగను
నెఱుఁగుఁదొలిజన్మముల నెల్ల మఱియు భావి
గతులునుం జంతుజీవిత స్థితులఁదెలుపు. 129

తే. అనెడు తత్సూక్తినాలించి యచటిమౌని
వితతి తచ్ఛక్తిఁదెలియుట కతన నేమి
యవినయమొనర్చె? నెచ్చట నదియొనర్చె?
నెవ్వఁడో వీడు తొలిమేన? నెఱుఁగఁదలఁచి. 130

తే. మునులు జాబాలిఁ గాంచి యోయనఘ! యెట్టి
యవినయఫలంబు నీపుల్గు లనుభవించు ?
నీతఁడెవ్వాఁడు ? పేరేమి ? యిటు ఖగాన్వ
యమున జనియించు టేమి? మా కానతిమ్ము. 131

వ. అనుచు సవినయంబుగఁ బ్రార్థించుచున్మునికదంబకంబుఁ గనుంగొని యత్తపోధనసత్తముండు నాశ్చర్యకరమగు నేతద్వృత్తాంతంబు చాలఁ గలదు. పెద్దయుఁబ్రొద్దు లేదు. స్నానసమయ మాసన్నంబగు చుండె. దేవపూజాకాలంబు నతిక్రమించుచున్నది. కావున యథోచితంబులగు దినకృత్యంబులు నిర్వహింపుఁడు. పిదప నపరాహ్ణసమయంబున ఫలమూలములఁ భుజించి సుఖోపవిష్టులై యుండుమీకు నితఁడెవ్వఁడో, యీతఁడుఁ దొలిపుట్టువున నెట్టియవినయం బొనరించెనో, మఱియు నీలోకంబున నితనిజన్మవిధం బెట్టిదియో సర్వంబు నీ వృత్తాంతంబు నెఱింగించెద నితనికిఁ గూడ నాహారం బిడి నిరత శ్రముఁ గావింపుఁడు. నిజవృత్తాంతంబు సకలంబు సకలంకమతి నాలకించి స్వప్నవిషయంబునుంబోలెఁ దెలియఁగలండని వచింపుచు, నట నుండి కదలి యమ్మునివరులతోఁ గూడి స్నానసంధ్యాదివిధుల నిర్వర్తించె నంతసాయంసమయం బగుటయు. 132

తే. స్నానములొనర్చి పరిపూతులైన మౌను
లవనిపై నిల్చి యొసఁగెడు నర్ఘ్యవిధుల
రహిఁగ్రహించెనోకో యన రక్తచంద
నాంగరాగము నూనె సహస్కరుండు. 133

తే. వదనములనెత్తి తపనబింబమున లోచ
నములఁ బరఁగించి యుష్ణపానమునొనర్చు
మౌనివరులు తేజోరాజి నానిరనఁగ
నాతప మడంగి దినము కార్శ్యతవహించె. 134

తే. సప్తఋషిమార్గసంస్పర్శ సంహరించు
తలఁపునంబలెఁ బాదముల్ మలఁచుకొనుచుఁ
గ్రాలె రాజీవహితుఁడు పారావతాంఘ్రి
పాటలాకృతిఁ బ్రేలి యంబరతలమున. 135

తే. ప్రతిఫలించిన యరుణాంశువితతిఁగూడి
యపరజలరాశి రవియొప్పె నబ్ధిఁవడుమఁ
బుష్పరసమును గార్చుచుఁ బొలుపుమీఱు
కమలదళనేత్రునాభిపంకజ మనంగ. 136

కం. దివసావసానమున ఖగ
నివహమువలె రవికరములు నేలవిడిచి మా
నివనమహీజాగ్రంబుల
నవనీధరశిఖరవీథి నలరె సొబగులై. 137

కం. అరుణాతపంబులంటిన
ధరణీరుహపంక్తి వెలిగెఁ దాపసతతిబం
ధురలీల వ్రేలఁదీసిన
యరుణములగు వల్కలముల నమరినభంగిన్. 138

ఆ. పద్మినీవిభుండు భగవంతుఁడును నైన
తరణి గ్రుంక నబ్ధితటమునుండి
బయలువెడలినట్టి పవడంపుఁదీవనా
నెఱుపుగలిగి సంజ యింపుమీఱె. 139

తే. అరిగి వలసినయెడకు దినాంతవేళఁ
గడఁకనరుదెంచు మునివనకపిలధేను
వనఁగ లోహితతారక యగుచు సంధ్య
మునివరులకెల్ల దృక్పర్వ మొనరఁ జేసె. 140

తే. అబ్జకుట్మలకరకంబు, హంససితసు
కూలము, మనోజ్ఞధవళమృణాళయజ్ఞ
తంతు, వళికులజపమాల, దాల్చి నలిని
బోలిచె రవిరాకకై దీక్షఁ బూనెననఁగ. 141

క. పడమటికడలిం దినమణి
పడఁ బతనరయోత్థితాబ్ధవనికరమన నొ
ప్పడరుచు నభోంగణంబున
నుడుసంతతి తోఁచెఁ జాల నుజ్జ్వలభంగిన్. 142

తే. సిద్ధమునులెల్ల సంధ్య నర్చించునపుడు
భక్తిఁజల్లిన వివిధపుష్పములచేత
శబలవర్ణము గనినట్లు జలదపథము
చాలసొంపారెఁ దారకాసహితమగుచు. 143

తే. సంజ గతియింపఁ దద్వియోగమున కాత్మ
గుందుచు,విభావరీసతి కూర్చుకొనిన
యంజనవినీలమైన కృష్ణాజినంబు
మాడ్కి నూతనతిమిరోద్గమంబు బర్వె. 144

వ. అంతఁ గ్రమంబున నయ్యుష్ణగభస్తి యస్తమించుట యెఱింగి, తారకా
శుద్ధాంతకాంతాసహితుండై సంజాతవైరాగ్యుండగు కురంగలాంఛ
నుండు చంద్రికాధౌతనుకూలవల్కలసితాంబరుండై యల్పతిమిర
తమాలవనరుచిరంబును, సప్తర్షిమండల విరాజితంబును, నరుంధతీ
సతీసంచరణపవిత్రంబును, నేకదేశస్థితసుందరతారకమృగంబును నై
యమలలోకాశ్రమంబుభంగి వెలుంగుచు నింగిఁజెలంగె నయ్యెడ.145

చ. అరయఁగఁ బుండరీకసితమై పొలుపారెడు చంద్రమస్సరో
వరమునఁ జంద్రికాసలిలపాన మొనర్చెడునాస డగ్గ, న
త్వరముగ మేన నయ్యమృతపంకము దాకిన శుభ్రదేహసుం
దరుఁడగు మర్త్యనట్లు హరిణంబు వెలింగె మనోహరంబుగన్. 146

తే. తిమిరమను నబ్దపమయు మతిక్రమింప
విమలసితసింధువారపుష్పములువోలెఁ
దెల్లనగు చంద్రకరముల నుల్లసిల్లెఁ
గలువలవనంబు లంచలగములఁ బోలె. 147

ఆ. ఉదయరాగమెల్ల నొగివిసర్జించిన
విధునిబింబ మొప్పె వేల్పుటేటఁ
బూనిచెందిరంబు పోవంగఁ గడిగిన
గోత్రవైరికుంభికుంభ మనఁగ. 148

సీ. తోడిఁబడ నంతఁ జంద్రుఁడు మీఁదిమీఁదికి
లీల మైఁజన సుధాధూళిఁబోలు
చంద్రాతపంబున జగతీతలం బెల్లఁ
బిండిఁజల్లినరీతి వెల్గుమీఁదఁ
బ్రాలేయజలశీకరస్పర్శఁ జల్లనై
మాటిమాటికిఁ బూని మందగతుల
మెలఁకువ గాంచిన మృగగణంబులచేత
మెప్పొందు ప్రాతస్సమీరణమ్ము

తే. లోలయ నరజాము రాత్రి యుండునంత
లేచి జాబాలిసుతుఁడు నన్ లీలఁ బట్టి
మునులతోఁ గూడి జనకునిపొంత కరిగి
యతనికి నమస్కరించి యి ట్లనుచుఁ బల్కె. 149

సీ. మునినాథ ! యీయున్న మునివర్గమెల్ల న
ద్భుతమైన యీతనికత వినంగఁ
గోరి కూర్చుండెఁ బంక్తులుబంక్తులుగ నిదె
యమితకౌతూహలాయత్తచిత్త

మగుచు, నీశుకపోత మలసటఁ బొఱఁగి సు
స్థితి నుండె; నితఁ డేమిచేసెఁ? బూర్వ
భవమునం దీతఁ డెవ్వఁ? డీఁకెట్టివాఁడు గాఁ
గలవాఁడొ? యిది మాకుఁ దెలియఁజెప్పఁ

తే॥ దనుచుఁ దను వేఁడికొనిన యమ్మునివరులకు
నెనుటఁ గూర్చుండియున్న య న్నెలమిఁ జూచి
వినెదువారిఁగ నెఱిఁగి య మ్మునులఁ బలికె
వినుఁడు కలదేని మునులార వేడ్క మీఁకు. 150

తే. త్రిభువనములకు మణివోలెఁ దేజరిలుచుఁ
బొసఁగఁ గృతయుగమునకుఁ బ్రసవభూమి
చాయఁ దనరి యవంతిదేశములలోన
నుజ్జయిని నాఁగఁ బట్టణ మొకఁడు గలదు. 151

తే. జగముల సృజింపఁ, బెంపఁగ, సంహరింపఁ
గారణుండైన శ్రీమహాకాళుఁ డనెడు
శివుఁడు తాఁ గాపురంబుండ సృష్టిచేసి
కొనిన నూతనధరణి నాఁ దనరు నద్ది. 152

ఆ. అపరరత్నగర్భ యనియెడిశంకచే
నెలమిఁ జుట్టుకొనిన జలధి యనఁగఁ
గడచి భుజగలోకగంభీర మగుచుఁ ద
త్పురము వలనుగొనిన పరిఖ చెలఁగు. 153

తే. శంకరుం డుంట సభ్రంకషంబులైన
శృంగముల నొప్పు కైలాసశిఖరి యనఁగ
నమరఁగ సుధాసితంబౌచు నప్పురమున
నలరుకోట వెలింగె సోయగము మీఱి. 154

తే. శుక్తిముక్తాప్రవాళవిశుద్ధశంఖ
మరకతంబుల రాసులఁ బరఁగి ఘటజుఁ
డుదకములఁ గ్రోలఁ జెలువారు నుదధు లనఁగ
నమరు విపణుల నప్పురం బతిశయిల్లు. 155

తే. పండువులఁ జూడ దివినుండి వసుధడిగిన
యమరగంధర్వసిద్ధవిద్యాధరాళి
దివ్యసురయానములపగిదిం జెలంగు
చిత్రశాలల నప్రోలు చెలువుమీఱు. 156

వ. మఱియు నప్పురవరంబు, సురాసురులు పాలకడలిం దఱచునెడ మీఁదికెగసిన తుంపురులంటి చెన్నడరు తరిగొండ సిగరంబులంబోలె వెలుఁగుచు, నుపరిభాగంబున నమరనదీప్రవాహంబులం బోలుపాఱు హిమగిరిశిఖరంబు లనన్ స్వర్ణమయంబులగు కనకకలశంబులచే నలంకరింపఁబడిన శిఖరంబులం గ్రాలుచుఁ, గరువలికి నిటునటు నెగురు ధవళపతాకంబుల శోభిల్లు సుపర్వమందిరంబుల విరాజిల్లుచుఁ, బూదేనెల నాని మేను మఱచి పెల్లుగ మ్రోయు జమిలిముక్కాలి బారులం గప్పుకొనిన కాఱుచీఁకటి సొబగొందు భవనవనంబులం గోమరుమీఱుచు, నిరంతరంబు బొడము వేదాధ్యయనధ్వనులచే రూపుమాసిన దోసంబుల వాసికెక్కుచు, మృదంగనిస్వనగంభీర గర్జితంబులును జలలవాసారనిర్మితవర్షంబులును నగు ధారాగృహంబులయందుఁ బురులు విచ్చి తాండవం బాడు సముదమయూరంబు లొనరించు కేకారవంబుల నింపుమీఱుచు, వికచకువలయరుచిరంబులును, బరిపుల్లకుముద్ధవళోదరంబులును నై, యనిమిషదర్శనరమణీయంబులగు ననేకసరోవరంబుల బ్రకాశింపుచు, యావనమదమత్త మాళవీకుచకుంభసంక్షోభితతోయయగు శిప్రానదిచేఁ బరిస్ఫురింపుచు, నట్లునుంగాక మైనాకం బనంగ నవిదితపక్షపాతంబై, నాకనదీ

ప్రవాహంబుకై వడిం బ్రకటితకనకపద్మరాశియై, మందరంబుచం దంబున నుద్ధృతసమస్త రత్నాకరరత్నసారంబై, గారుడవిరాజితం బయ్యు భుజంగసంగభీరువై, వినయవంతంబయ్యు వీరంబై, సత్య వాదియయ్యును బ్రియంవదంబై, రూపవంతంబయ్యు స్వదారసం తుష్టంబై, యతిథిజనత్యాగమూర్తియయ్యునుంబర ప్రార్థనావిదితంబై, కామార్థతత్పరంబయ్యును ధర్మప్రధానంబై, మహాసత్వంబయ్యును బరలోకభీరువై, సకలవిజ్ఞానవిజ్ఞంబును, సచ్ఛీలంబును, రుచిరవేషం బును, విజ్ఞాతసకలలిపియునై, మహాభారత పురాణరామాయణాను రాగియై, ద్యూతాదిసమస్తవిద్యాపారంగతంబై, ప్రశాంతంబై, మధు మాసమారుతంబునుంబోలె సదక్షిణంబై హిమగిరివనంబునుంబోలె నంతస్సరళంబై, లక్ష్మణుండునుంబోలె రామారాధననిపుణంబై, దివ సంబునుంబోలె మిత్రానువర్తియై, మెఱయు రసికవిసరంబుచే నావృ తంబై, యింద్రతనువిధంబునం గ్రతుశతవహ్నిధూమపవిత్రంబై, ఖగపతిశరీరముంబోలె నచ్యుతస్థితిరమణీయంబై, సంధ్యచందంబునం బద్మరాగారుణంబై, ప్రభాతసమయంబుపగిదిం బ్రబుద్ధసర్వలోకం బై, గౌరితీరున మహాసింహాసనోచితమూర్తియై, యదితితెఱంగున దివిజకుల సహస్రసంసేవ్యంబై, హరివంశకథపోలిక ననేకబాలక్రీడా భాసురంబై, ప్రకటాంగనోపభోగంబయ్యు నఖండితచరిత్రంబై, రక్త వర్ణంబయ్యు సుధాధవళంబై, యవలంబిత ముక్తాకలాపంబయ్యు విహారభూషణంబై, బహుప్రకృతియయ్యు స్థిరంబై వెలుంగు. 157

సీ. వియులసిందూరకుట్టిమముల ప్రాలి సం
ధ్యారుణత్వముల్లట్ల యలరుచుండు
లలి మరకతవేదికలఁ దాఁకి విమలాసి
తాబ్జినీనాళంబు లన వెలుంగు

లక్షితవైడూర్యభూములనంటి యాకాశ
సీమఁ బ్రాఁకెడునట్లు చెలువుమీఱు
మదగజయానల వదనంబు లంటి ప
ద్మముల నుద్దిడునట్లు దనరుచుండు

తే. విమలధవళపతాకాంశుకముల నంటి
గగనతటినీతరంగసంగతులఁ గనిన
విధమునం బొల్పుమీఱు నప్పీటిలోనఁ
జిత్రభానునిఘృణులు విచిత్రలీల. 158

తే. రమణుల మణీవిభూషణప్రభలకలిమిఁ
జిమిర మొనవమి సురతప్రదీపతతులు
వృథలుగాఁగ బాలాతపపింజరంబు
లగుచు నప్పీట సొబగొందు యామవతులు. 159

తే. లలనల ముఖాబ్జకాంతుల లజ్జగను న
నుష్ణకరునంకముం బాపుచున్న వనఁగఁ
బవనచలితదుకూలపల్లవములనరు
ధ్వజభుజములూను ప్రాసాద తతివెలుంగు. 160

తే. హర్మ్యశిఖరాంతరంబులయందు నిద్రఁ
జెందు పురసుందరులను వీక్షించి మదన
పరవశునిచందమున వ్రాలి పొరలుచుండు
విమలమాణిక్యకుట్టిమములవిధుఁడు. 161

తే. మాటలేటికి? విబుధకిరీటఘటిత
చారుమణికాంతిచుంబితచరణనఖుఁడు
యమాఖుఁడభవుఁడు కైలాస ముజ్జగించి
లీల వసియించె నెట మహాకాళుఁ డనఁగ. 162

తే. నహుష జనమేజ యార్జున నల యయాతి
భరత మాంధాతృ నృగ ఘనప్రతిముఁడగుచు
భుజబలోపార్జితాశేషభూతలుండు
ఘనుఁడు మతిమంతుఁ డత్యంతవినయపరుఁడు. 163

తే. హరిభుజాంతర వాస మనాదరించి
విడచి కమలవనంబుల వికచజలజ
హస్త యగు లక్ష్మి యితని నిర్వ్యాజలీలఁ
గడఁగి తనయంతఁ దాఁబోయి కౌఁగిలించె. 164

తే. సకలనిర్జరమానిసంస్తవ్యమైన
సారకల్లోలినీవారిపూర మునకుఁ
బాలమున్నిటియల్లుని పాదతలముఁ
బోలె సత్యంబునకు జన్మభూమి యగుచు. 165

కం. ఆపట్టణంబు నేలున్
క్ష్మాపాలుఁడు సంహృతప్రజాపీడుఁడు తా
రాపీడుఁ డనఁగ సకలధ
రాపాలకిరీటమణివిరాజితపదుఁడై. 166

తే. శ్రితజనసురావనీజంబు రతివిలాస
జనితనిరుపమకరుణావిశాలహృదయుఁ
డభవుఁడు సృజించినట్టి రెండవమనోజుఁ
డనుచు జనులెల్లఁ దలఁతు రేఘనచరిత్రు. 167

సీ. ఎవ్వాఁడు సకలమహీభారధారణ
క్షముఁడయి, నెగడి శేషఫణి యనఁగ
గుణనిధి యెవ్వాఁడు గురుసత్వనిలయుఁడై
యంభోనిధానంబు ననుకరించి

చతురుఁ డెవ్వాఁడు ఘటితసంధివిగ్రహుం
డగుచు జరాసంధుఁ డనఁగ నెగడి
సద్బుద్ధి యెవఁడు ప్రసాధితసుర్గుఁడై
త్ర్యంబకుండో యన నభినుతిఁగని

తే. క్రతుభుగధినాథునకు బృహస్పతి యనంగ
రామునకుఁ గౌశికుండన, భీమునకును
దమనకుండన, నామహీరమణునకునుఁ
దనరు శుకనాసుఁ డనుమంత్రి ధరణిసురుఁడు. 168

తే. భవ్యయశుఁ డగునమ్మహీపాలు నుండి
సకలలోకప్రహర్షదాయకము నమిత
పావనంబైన గుణపంక్తి బయలువెడలెఁ
గొంచమలనుండి యంచల గుంపువోలె. 169

తే. ఓపరాని ప్రతాపసంతాపమునకు
నడరి యెంతయు నలసినయదియుఁబోలె
నొలసి సామ్రాజ్యలక్ష్మి ముహూర్తమైన
విడక వసియించు నెవ్వానిగొడుగుసీడ. 170

తే. తలఁచు నరకాసురోగ్రశస్త్రప్రహార
భీషణంబగు కేశవు పేరురమునఁ
గ్రాలు నిందిర నెవఁ డవలీలఁ గైవ
సంబు నొనరించుకొనఁగఁ బ్రజ్ఞాబలమున. 171

తే. ఆమహీనాధకులసార్వభౌముచార
నికర మవనీతలంబెల్ల నిండియుంట
నతని కెచ్చటివృత్తాంత మైనఁగాని
తెలియుఁ దనయింటిపనులట్ల తెల్లముగను. 172

తే. శైశవమునందె యమ్మహీశ్వరుఁడు సప్త
జలధిపరివృతమగు ధాత్రి గెలిచి మంత్రి
ఘనుఁడు శుకనాసునం దిడి జనుల సుఖులఁ
జేసి యౌవనసుఖముల జెందుచుండె. 173

వ. అమ్మహీంద్రుం డొకానొకప్పుడు ప్రణయినుల చిఱునగవుకాంతులవంటి చందనజలధారలం దడుపఁబడుచు, నేత్రప్రభలవంటి కర్ణోత్పలంబులం గొట్టఁబడుచు, రత్నాభరణకాంతులవంటి కుంకుమపటవాసధూళులచే మిఱుమిట్లుగొన్న కన్నుఁగవం జెలంగుచు, సంపఁగిపూదండలవంటి భుజలతలచే బాధింపఁబడుచు, మదనపరవశుండయి, వాతెఱఁ జుంబించునప్పు డడ్డంబిడిన కెంగేల నడరు రత్నకటకంబుల కలకలధ్వనులచే మనోహరంబగుచు, రతివేగమున నలిగి యొత్తుగబడిన దంతపత్త్రంబులుగల శయనంబున నలరుచు, కృష్ణాగురుద్రవంబున వక్షోరుహంబుల నిర్మింపఁబడిన పత్త్రలతలచే నంటిన ప్రచ్ఛదపటంబున మనోజ్ఞంబగుచును నొప్పు సురతము నొనర్చుచు, నొకానొకవేళఁ గామినీకరపుటవినిర్గతంబులై వెడవిలుతుని పసిఁడి ములుకులంబోలు కుంకుమజలధారలచే బింజరితశరీరుండై, జాళువా చిమ్మఁగ్రోవులంబట్టి జలవిహారంబులం గ్రీడింపుచు నొకానొకతఱిఁ బొగడమ్రానుచందంబున మదవతీగండూషసీధుధారాస్వాదముదితుండై వికాసమందుచు, నొకానొకసమయంబున నశోకతరువు వడువునఁ దరుణీచరణప్రహారసంక్రాన్తాలక్తకరసుండై, రాగము వహించుచు, వేఱొకప్పుడు మధువ్రతంబుభంగి వికసత్కుసుమకోరకంబులగు లతాభవనంబులం జరియించుచు, నొకానొకనాఁడు ప్రాసాదమధ్యంబుల మిత్రులతోఁగూడి సంగీతప్రసంగము గావించుచు, వేయేటికి? యతనికి నిరతంబులగు మహీవ్యాపారంబులు లేకుండుటం జేసి యేయే కార్యంబులు తనకు రమణీయంబులగును, నభిమతం

బులును, నవిరుద్ధంబులును నని తోమనో, యట్టికార్యముల నెల్ల నన న్యచిత్తుఁడై సాకల్యంబులుగ సేవించుఁ. గాని వ్యసనంబులం జిక్క కాడు. ప్రజలపైఁ గూర్మికలుగుటం జేసి నడుమనడుమ దర్శనంబిచ్చుచు, దగు కారణంబులున్నతఱి సింహాసనంబునం దధిరోహణ మొనర్చు చుండె.

చ. నలఁత యొకింత లేక వరనాయకుఁ డిచ్చిన రాజ్యభారము
న్వలనుగ దాల్చి యమ్మనుజనాయకుభంగి సమస్తకార్యముల్
పొలుపుగఁ జేసికొంచుఁ బతి పోలె వరూథ్యుఁడు మర్త్యకోటిఁ బెం
పొలయ సమస్తభంగులను నొద్దికఖీలఁగ నేలెఁ గూరిమిన్. 175

సీ. ప్రాజ్యసామ్రాజ్యభారము నెల్ల మంత్రిపై
నిలిపి యౌవనసుఖంబులను దేలు
చున్న యన్నరనాయ కోత్తమునకు నొక్క
సంతానసుఖము కొఱంతగా స
కలసౌఖ్యములు దీఱెఁ గాని, సంతానసౌ
ఖ్యము లేకయుంట శుద్ధాంత మెల్ల
ఫలశూన్యమగుచుఁ బూవులు గాత్ర మగపడు
శరవణం బనఁ దోచె జనవిభునకు

తే. దినదినముఁ బ్రాయ మెట్లు గతించుచుండెఁ
బూని లావణ్యమెట్లు సంతానచింత
తలఁచుకొనె నవపత్యుఁ డతండు నృపస
హస్రపరివేష్టితుం డసహాయుఁడట్లు. 176

తే. జలదమార్గంబునకు రిక్క చాలువోలె
మానసమునకుఁ గలహంసమాలవోలె
భూషణంబుగఁ దోచె నాభూవిభునకుఁ
బడఁతుక విలాసవతియను పట్టమహిషి. 177

వ. అంత నొకనాఁడు. 178

తే. పరిజనంబులు తనచుట్టుఁ దిరిగి జేరి !
వలవ దుడుగుము నీ కింక వంత యనుచు
నూరడించిన నుడుగక యున్న కాంతఁ
గనియె సతియంతిపురిఁజేరి మనుజవిభుఁడు. 179

తే. తన్నుఁగని లేచు తరుణిఁ ద చ్ఛయ్యపై వి
భుండు గూర్చుండఁబెట్టి, కూర్చుండి యతఁడు
వెతకుఁ గారణ మెఱుఁగక వెఱపుగదురఁ
జెలువచెక్కులు దుడుచుచుఁ బలికెనిట్లు. 180

సీ. కార్చుచున్నవిగదా కనుఱెప్ప లుష్ణాశ్రు
జలములు ముత్యాలచాలువోలె
రతనంపుఁదొడవు లేర్పఁదాల్పవిదియేమి ?
నడుమున నొడ్డాణ మిడవిదేల ?
యరుణాంబుజముల బాలాతపం బంటిన
చాయనంఘ్రుల లాక్షఁబూయవేల ?
ఖనదీప్రవాహంబునను శివుతలమీఁది
కమలాదివోలె హారమున నీకు

తే. గళము శోభిల్ల దిదియేమి ? జలజగంధి !
కారణంబేమొ, భృత్యవర్గంబొ, నీవి
చారమునకు, మదీయరాజ్యమును, జీవి
తమును, దరళాక్షి! భవదధీనములుగావె. 181

వ. ఎంతయాలోచించినను నావలన దోషం బొంకితయేనియుం బొడసూప దయ్యె. సుందరీ ! నీవిచారకారణంబు నానతిమ్మనుచు నతండు వేడిన నవ్విలాసవతి యేమియుం బ్రతివచనం బీయక మాటిమాటికిం గన్నీరు సోనలుగ గార్చుచుంటఁ జూచి తత్పరిజనంబు నేమనియెడుగఁ దాంబూలకరంకవాహిని యనెడు పరిచారిక యోర్తు భూవిభుని సమీపించి యిట్లని వచియించె.

తే. పార్థివకులావతంస! మీ వలన నింత
యేని యపరాధ మియ్యెడఁ గానరాదు
మీర లిట్లుండ నిచట నెవ్వారికైన
శక్తికలుగునే? కీడు మీ సతికిఁ గూర్ప. 183

తే. అధిప నేడు చతుర్దశి యగుట నిచట
లీలఁ జెలువొందు శ్రీమహాకాళుఁ గొలువ
నరిగి యీపద్మలోచన యటఁ బఠించు
చున్న భారతమున నొక్క సూక్తి వినియె. 184

తే. సుతులు కలుగని వారికి గతులు లేవు
కలిగెనేనియు శుభలోకములు హుళక్కి
యొనరఁ బున్నామనరకంబు నుండి బాపు
వాఁ డగుటఁ గల్గెఁ బుత్రశబ్దం బతనికి. 185

కం. ఈవచనంబుల విని యో
దేవా! నిజభవనమునకుఁ దిరుగు మొగమునన్
వే వచ్చి తొడవు లూడిచి
యేవంవిధదశ వహించె నీసతి యనియెన్. 186

తే. అనుచు వచియించుపలుకుల నాలకించి
విభుఁడు, క్షణ మూఁగి సతి సమీపించి, దేవి!
యడలనేల దైవాయత్తమైన వస్తు
విషయమై చింతనొందుట వెఱ్ఱితనము. 187

తే. దయ కలుగదయ్యె మనయందు దైవమునకుఁ
గొడుకునుం గాంచి యతని ముద్దిడెడు సౌఖ్య
మునకునై పూర్వభవమున మనము నోఁచి
పుట్టలేదేమొ వగపేల పువ్వుఁబోఁడి. 188

కం. తొలిపుట్టువులం జేసిన
సలలితకర్మములకె కూర్చు సదసత్ఫలముల్
కలికి యవి త్రోచి దైవము
గలిగింపఁగలాఁడె యొండుగతి మనుజులకున్. 189

తే. తనరఁ నెంతటియత్నమి మ్మనుజులందు
నంతజతనంబొనర్పుమీ యలకుఁబోఁడి!
గురులయెడ భక్తి ద్విగుణంబుఁ గూర్పు, దేవ
పూజ రెట్టింపు నెఱపు మంభోజవదన. 190

కం. కొలువుము సన్మునివర్యులఁ
గలికీ! దేవతలకంటె ఘనులు మునీంద్రుల్
లలి, దుర్లభములు నగు ఫల
ముల నిత్తురు భక్తిఁగొలుచు పుణ్యాత్ములకున్. 191

సీ. కమలాక్షి! తొలిఁ జండకౌశికుండను ముని
వరుఁ గొల్చి మగధాధిపతి బృహద్ర
థుం డను మనుజనాథుండు జరాసంధుఁ
డనుపుత్రు హరిఁ గెల్చు నతనిఁ గనియెఁ
బంక్తిరథుండు విభండకమౌని కూ
రిమితనూభవుఁ డైన ఋశ్యశృంగు
నర్చించి తదనుగ్రహమున శ్రీహరిభుజం
బులఁబోలు పుత్రుల నలువురఁ గనె

ఆ. రమణి! వీరె కాక రాజర్షులెందఱో
కొలిచి ఋషుల నాత్మజులను గనిరి
మునుల సేవఁ జేయు పుణ్యుల కోరిక
లొదవకుంట గలదె యుర్విలోన. 192

తే. లీల బాలాతపంబునం గ్రాలు తపను
బింబమునఁ జెన్నమీఱు దివియనఁ, బసుపు
వలువఁ దాల్చి, సుతుఁ దొడ నిలిపికొని, ము
దంబు నా కెప్డు కూర్చునో యంబుజాక్షి. 193

తే. తత్తరంబునఁ జేతుల నెత్తుకొనుచు
దంతశూన్యస్మితాస్యుఁడై తప్పటడుగు
లిడుచుఁ బడుచును లేచుచుఁ గడుముదంబు
నాకు నెపుడు ఘటించునో నందనుండు. 194

కం. సలలితమణికుట్టిమముల
నిలచి యధోదృష్టి సుతుఁడు నిర్భరకౌతూ
హలమునఁ దన నీడల గని
కలకం దడఁబడుచుఁ బట్టఁ గాంచుట యెపుడో. 195

తే. భూపకోటిప్రసారిత భుజయుగాభి
నంద్యమానాగమనుఁడు, తనయుఁడు వస్తు
మణిమయూఖాకులీక్రియమాణదృష్టి
తోడఁ గొలువున్న నా మ్రోల నాడు టెపుడో. 196

తే. అనుచు నిటువంటి కోరిక లనవరతముఁ
దలఁచు నన్నును ననపత్యతాప్రభూత
మైన శోకంబు ప్రతిదిన మగ్గిబోలెఁ
దాఁకి దహియించుచుండెఁ గాఁ దలిరుఁబోఁడి. 197

తే. నాకు లోకంబె రిత్త గన్పట్టుచుండె
రాజ్యమును జీవితమును వ్యర్థములుగాఁగఁ
దలఁచుచున్నాఁడ విధి తప్పఁదలఁచి నప్పు
డేమొనర్తుము వగవకు మిందువదన. 198

తే. ధర్మమును ధైర్యమును బుద్ధిఁ దగులుకొలుపు
మంబుజేక్షణ! ధర్మపరాయణులకు
నిరతమును సన్నిహితములై నిరుపమాన
సకలకల్యాణసంపదల్ సాగుచుండు. 199

తే. ఇవ్విధంబునఁ బలుకుచు నెలమితోడ
వికచపద్మోపమము బాష్పబిందుయుతము
నైన నిజకాంతనెమ్మోము నాత్మహస్త
పంకజంబునఁ దుడుచుచుఁ బార్థివుండు. 200

తే. మఱియు శోకాపనోదసమర్థములును
విమలధర్మోపదేశగర్భితములు నగు
వచనములచేత నూరార్చి వనజముఖినిఁ
బోయెఁ బేరోలగమునకు భూవరుండు. 201

తే. అవ్విధంబున విభుఁ డేగ నవ్విలాస
వతియుఁ మదిలోనఁ బొడమెడు వెతల నడఁచి
విమలమాణిక్యమయభూషణములఁ దొడిగి
సముచితములైన దివసకృత్యముల నడపి. 202

కం. నిరత మది మొదలుకొని య
య్యరవిందేక్షణకు దేవతారాధనలన్
ధరణీసురపూజనముల
గురుసేవావిధుల మిగులఁ గోరిక లెసఁగెన్. 203

తే. ఎవ్వ రెవ్వ రేయే పూజ లేర్పడంగ
జేయుమని చెప్పి రవి యెల్లఁ జేయుచుండె
విసుగుఁ జెందక సతత మక్కసలయోష్ఠి
యాత్మజుఁడు కల్గు తసకను నాసఁ జేసి. 204

తే. రత్నఖచితసువర్ణపాత్రములఁ దిలలు
పోసి ముదమున జలజాక్షి భూసురులకుఁ
బ్రతిదినము దాన మిడుచు నశ్వత్థముఖ్య
భూజములకును వలఁగొని మ్రొక్కుచుండు. 205

తే. కొనర కెల్లప్డు మాహార్తికుల భజించు
శకునవిజ్ఞానవంతుల సత్కరించు
వేదముల బుధులచేఁ జదివించు దేవి
యాత్మజముఖావలోకన మాత్మఁ గోరి. 206

సీ. శుచివృత్తి నుపవసింపుచుఁ దాల్చి ధవళాంబ
రముఁ జండికాభవనములలోన
దర్భలుపఱచిన ధరణిపై నిద్రించె
స్నానమాడెను దివ్యనదులలోన
సోదెచెప్పెడి వారి సూక్తుల మన్నించె
వృద్ధాంగనలమాట విశ్వసించె
ననవరతంబుఁ బుణ్యశ్లోకుల చరిత్ర
లాలించె బలివిధు లోలి నడపె

తే. జంబుకములకు రాత్రి మాంసబలిపిండ
ముల విసర్జించె నిరత మక్కులువకంటి
కడఁగి పొలిమేరలందు మాంగళ్యబలుల
నడపుచును గాల మీరీతిఁ గడపుచుండ. 207

సీ. అటు కొన్నిదివసంబు లరుగ వేకువవేళఁ
గలలోన నమ్మహీకాంతలవిభుండు
చెలువగు నిజసౌధశిఖరంబునం గల
సతియగు నవ్విలాసవతి వదన

మునఁ బ్రవేశించు సంపూర్ణమండలుఁడైన
కమలారిఁ గాంచి మేల్కని, నితాంత
సంతోషవికచలోచనదివ్యకాంతిచే
ధవళీకృతాత్మీయభవనుఁ డగుచు
తే. సచివు శుకనాసు బహుమాన సహితముగఁ దత్
క్షణంబున బిలిపించి ధరణిధవుఁడు
తన కల తెఱంగు వినిపింప విని యతండు
సంతసం బంది పల్కె భూకాంతుతోడ. 208

క. మనకును భూజనులకుఁ గల
మనోరథము లిపుడు పండె మానవనాథా!
విను కతిపయదివసములకుఁ
దనయుని గనుఁగొనెదుసుఖము దలకొను నీకున్. 209

ఉ. ఓవసుధేంద్ర! ధౌతధవళోజ్జ్వలవస్త్రముఁ దాల్చి శాంతుఁడై
యొప్పువిబుధుం డొకండు నవచంద్రకళాపరిశుద్ధపత్రసం
భావితమున్ మరందలవవర్షియు నైన సితాంబుజంబు మ
ద్దేవికి నంకమం దిడినతీరున నేఁ గలఁ గంటి నీనిశన్. 210

తే. ధరణినాయక! యీనిమిత్తములు భావి
కాలఫలముల నెఱిఁగించుఁ గాదె! యింత
కంటెఁ బ్రియములు నానందకారణంబు
లైన యర్థంబు లింక నీయవనిఁ గలవె. 211

తే. అధిప! యదియునుఁ గాక నిశావసాన
సమయములఁ గానిపించిన స్వప్నము లవి
తలఁచుగ నమోఘఫలములై వఱలుననుచు
విబుధు లెఱిఁగింప వినమొకో విశదముగను. 212

తే. ధరణిధవ! దేవి, వేగ మాంధాతవంటి
పుత్త్రు రాజర్షి ధౌరేయు భువనహర్ష
కారణుండగువానినిఁ గాంచి నీకుఁ
గను ముదముఁ గూర్పు నొక్కింతకాలమునకు. 213

తే. అనుచు వచియించు నిజమంత్రి నాత్మహస్త
పంకజంబునఁ గ్రహియించి పార్థివుండు
నంతిపురి కేగి యట నిజకాంతఁ జూచి
తమ కలలఁ జెప్పి యమితహర్షమును గూర్చె. 214

కం. కతిపయదివసములకు జన
పతికాంతకు నవ్విలాసవతి కింపుగ నా
సితకరుఁడు గర్భగోళ
స్థితుఁడై నానాఁడు వృద్ధి చెందుచు నుండెన్. 215

తే. లచ్చిసైదోడు గర్భగోళమున నుంటఁ
బారిజాతంబుచే నింద్రునవనముఁబోలెఁ,
గౌస్తుభముచేత విష్ణువక్షఃస్థల ము
పగిది నెంతయుఁ బొలుపారెఁ బట్టమహిషి. 216

తే. అల్లనల్లనఁ బ్రతిదివసాభివర్ధ
మానగర్భభరంబున మానవతియు
వ్రాలి నీరాని చను మేఘమాలవోలె
నింపుమై మందముగఁ జరియింపఁ జొచ్చె. 217

వ. మఱియుం గేశకియుంబోలె గర్భపాండురయగు నవ్విలాసవతి నాలో
కించి, యాపి గర్భవతియగుట పరిజనులెఱింగె వారిలోన. 218

కం. కల దావిలాసవతికిం
గల పరిచారికల కగ్రగణ్యయు సరరా
ట్కులసంవాసనచతురయుఁ
గులవర్ధన యనెడు కాంత కూరిమి యనుఁగై. 219

వ. ఒకదివసంబున. 220

సీ. సలలితతారకావళిమధ్యగతుఁ డైన
వనజారిరుచిరబింబముకరణి
ఫణిరాజవరఫణామణిసంస్థితుం డైన
కమలాక్షుఁడగు రమారమణు పగిది
మూర్ధాభిషిక్తులౌ భూపాలవరులచేఁ
బరివేష్టితుం డౌచుఁ బ్రభువరుండు
కమనీయనిజసభాంగణమున నుండెఁ బ్ర
శస్తమైనట్టి వాసరమునందు
తే. సహితగుణుఁ డగు శుకనాసమంత్రితోడ
సరససంభాషణంబులు సలుపుచుండ
నాథు చెవిలోనఁ గులవర్ధన యను కాంత
యధిప! నీకాంత గర్భిణియైన దనియె. 221

సీ. అశ్రుతపూర్వమౌ నా శుభసూక్తిచే
సమ్మృతాంబుధిం దాన మాడినట్లు
ప్రకటరోమాంకుర నికరకంటకితగా
త్రయుతుఁ డై యానందరసముచేత
స్మితకాంతిలవవికసితగండయుగళుఁ డై
యాత్మలో నిండిన హర్షరసము
ధవళ దంతాంశు వితానచ్ఛలంబున
వెదజల్లుచున్న భూవిభుఁడు లోల
తే. తారకంబును, నానందవారిబిందు
పంక్తిసంక్లిన్నసలలితపక్ష్మమాల
యైన నిజనేత్రమును బ్రాల్చె నప్పు డతని
పొంతఁ గూర్చున్న శుకనాసు ముఖమునందు. 222

సీ. భూపాలుని యదృష్టపూర్వంబు నిరుపమ
హర్షప్రకర్షంబు నరసి మఱియు
దరహాసవికసితసురుచిరానన యౌట
వచ్చిన యా కులవర్ధనఁ గని
సచివోత్తముఁడు తేని సంతోషకారణ
మొండేమియును గానకుండి, చనిన
వృత్తాంత మేమియు నెఱుఁగనివాఁడయ్యుఁ
బోలుపుగ నూహించి, బుద్ధిలోనఁ
తే. దెలిసికొని, యంతఁ దనదు గద్దియను డిగ్గి
పొంతకరు దెంచి ధారుణీకాంతుతోడ
వినయవినమితగాత్రుఁడై విహితఫణితిఁ
బలికె మృదుభాషణమ్ము లస్పష్టముగను. 223

సీ. రాజేంద్ర! ప్రియవచఃశ్రవణసంప్రీతిచేఁ
గర్ణమూలంబుల కడకుఁ బోయి
రహిమీఱ నీలకైరవకర్ణపూరశో
భ ఘటించి, యానందబాష్పబిందు
ధారాంచితము లోలతారకంబును వికసితమైన యస్మదక్షిద్వయంబు
తెలుపుచున్నది భవదీయప్రహర్షకా
రణ మిమ్మహోత్సవశ్రవణకుతుక
తే. మగుచునున్నది మచ్చిత్త మవనినాథ!
యెలమి నెఱిఁగింపుమని మంత్రి పలికి, మాట
లాడకుండినఁ గాంచి యయ్యవనినాథుఁ
డల్ల చిఱునవ్వు నవ్వి యిట్లనుచుఁ బలికె. 224

తే. మానవాధీశ ! నీకలఁ గానఁబడిన
వార్త లేమైననిజములై వరలెనేమొ
తలఁపఁ గులవర్ధనయు హర్షవిలసితాస్య
యగుచుఁ గనుపట్టుచుండె ననఁగ విభుండు. 225

తే. ఈమె వచియించినది నిక్కమేని నాదు
కల తెఱంగెల్ల నిజమంచుఁ దలఁపవచ్చుఁ
గాని, మది విశ్వసింప నింతైన నెట్లు
మాదృశుల కింతభాగ్యసంపదఘటిల్లు ? 226

తే. ఇట్టి శుభములకుం బెట్టి పుట్టకున్న
నన్నుఁ దలపోసి, మును బొంకకున్నఁగాని
యల్ల కులవర్ధనను గల్లలాడినట్లు
తలఁచుచున్నాఁడ మది నిట్టి పలుకులయెడ. 227

తే. రమ్ము శుకనాస! యిపుడ మద్రమణిఁజూచి
కల్లనిజముల తెఱఁగెల్లఁ గ్రమముగాను
దెలిసికొనవచ్చుగా యని పలికి యతఁడు
పుడమిఱేఁడుల నెల్లరఁ బోవఁబంచి. 228

తే. ఒడలిపై గల్గు రతనంపుఁదొడవులెల్ల
నొలిచి, కులవర్ధనకు నిడి యెలమి నదియుఁ
దోడఁజనుదేర శుకనాసుఁ గూడి వలయు
పరిజనులతోడ ఱేఁ డంతిపురికి నరిగె. 229

సీ. ఆరీతి భూనాథుఁ డలరుచు నటు చని
నవసుధాలేపనధవళితంబు
లలితోజ్జ్వలన్మంగళప్రదీపయుతంబు
మంగళకలశాభిమండితంబు

శివతరాలేఖ్యభాసితభిత్తిరుచిరంబు
సన్నుతసుకృతరత్నాయుతంబు
భాస్వన్మణిప్రదీపవిధూతతిమిరంబు
వివిధమంగళవస్తువిలసితంబు
తే. నైన యంతఃపురంబు భూజాని సొచ్చి
కరము కరమున శుకనాసుఁగదియఁబట్టి
చెలువుమీఱఁగ నేమియో చెప్పుకొనుచుఁ
దనదు కులకాంతపడకటిల్ దఱియఁజొచ్చె. 230

సీ. లలిఁ బాన్పుతలవైపు నిలిపిన రత్నమం
గళకలశంబులవెలుఁగుదాని
జానొంద నిటు నటు జల్లిన తెల్లని
యావాలచేఁ బ్రోది యైనదాని
వివిధౌషధీమూలవిలసితం బగుదాని
నెలడాలుగులుకు డబ్బాలునదాని
లీలమై భూతిఁజల్లిన పత్రలతలచేఁ
బరిరక్షితం బయి వరలుదాని
తే. సద్రి రాజశిలాతలాయామ మగుచుఁ
బరఁగుదాని, సమున్నత పాదపీఠ
సంప్రతిష్ఠితమగుదాని జనవిభుండు
తల్పమొక్కటి కాంచి తత్తల్పమునను. 231

సీ. అబల యంతర్వత్ని యయి యొప్పెఁ గులశైల
గర్భిత యగు మహీకాంతఁబోలి
నిజజలాభ్యంతరనిర్మగ్నదివిజేంద్ర
దంతియౌ నిర్ఝరతటినిఁ బోలి

వరగుహాంతర్గతపంచాననంబగు
క్ష్మాధరాధీశమేఖలనుబోలి
తపనగర్భితజలధరసముద్యోతిత
యైన వాసరలక్ష్మి ననుకరించి

తే. యుదయశైలాంతరితలలితౌషధీశ
మండలం బగు యామినిమాడ్కి, మృదుల
ధవళరుచిరదుకూలంబుఁ దాల్చియున్న
నిజసతీమణిఁ గన్గొనె నృపవరుండు. 232

తే. తరుణి కంతట నాత్మీయపరిజనంబు
తత్తరంబునఁజేరి కై దండయిడినఁ
గడఁకఁ దనచేయి నెడమ మోఁకాలిమీఁదఁ
బెట్టి రతనంపుటందెలు బిట్టుమొరయ. 233

కం. లేచెడు నిజకాంతామణిఁ
జూచి మహీవిభుఁడు లేవఁజూడకుమని తా
నా చెలి గల తల్పమునం
దే చటుకునఁ గూరుచుండె దివ్యాననుఁడై. 234

కం. అంతట శుకనాసుండును
శ్రాంతసితధవళవసనపరిశోభితమున్
గాంతకనకపదయుతత
ల్పాంతరమున విశ్రమించె నతికుతుకమునన్. 235

ఉ. తోడన యంత సంతసముతోఁ దమచెంగటనిల్చియున్న పూఁ
బోఁడిని గర్భిణిం గని విభుం డెలనవ్వున దేవి! యద్భుతు
న్నాఁ డితఁడొక్కమాట శుకనాసుఁడు, నాకులవర్ధనోక్తముల్
చూడఁగ బొంకులో, నిజములో యనుచున్ వచియింపఁగాఁదగున్. 236

ఆ. అనెడు నతనిపలుకు లాలించి యొకవింత
చిఱునగవుదోప సిగ్గుకతనఁ

జేలచెఱఁగు మోముపై లీలఁ గదియించి
తల నగంబు వాంచె జలరుహాక్షి. 237

ఉ. మాటికిమాటి కిట్లడుగ, మానవతీమణి కాంతుఁజూచి నా
కేటికి సిగ్గుగూర్తు? రొకయించుక యేనియు నేనెఱుంగ మో
మోటముమాని యిట్లడుగ యుక్తమె! మీ కనిపల్కి యంత న
ప్పాటలగంధి మోము నఱవాంచి పతిం గనె సాభ్యసూయయై 238

తే. అవ్విధంబునఁ దనుఁజూచు సామెఁ గాంచి
వినుతదరహాసచంద్రికావిశదమైన
యాననసుధాంశుమండలుండగుచు నవని
పాలతిలకుండు గూర్మితోఁబలికె మరల. 239

తే. నేను పలికినపలుకులే నీకు నింత
సిగ్గుగల్పించినవి యేనిఁ జిగురుఁబోడి!
యూరకుండెద లెమ్ము, మను క్తియొకటి
కలదు విని యత్తెఱంగెల్లఁ దెలియఁజెప్పు. 240

సీ. విరిసినసంపంగివిరిచాయ గలమేను
తెలుపయ్యె నిది దాచదలఁచుటెట్లు?
లుదరామృశధ్వస్తహృదయశోకానల
ప్రభవమౌ పొగ గ్రక్కుపగిదిఁ దోచి
నీలోత్పలంబుల నెఱి మీఱఁబట్టిన
చక్రవాకంబులచంద మొంది
లలితతమాలపల్లవములనించిన
బంగారుకుండలభంగి, దనరి

తే. కడఁక నాఁడునాఁడు కాలాగురుద్రవ
లిఖితపత్త్రలతలలీల మెఱయు
చూచుకములచాయ గోచరింపఁగ నిద్ది
దాచఁదలఁచుటెట్లు? తలిరుఁబోడి. 241

ఆ. ప్రతిదినంబు బిగియు పసిఁడియొడ్డాణంబు
కతన నలఁగి వళులగర్వమడఁచి
కృశతఁదొఱఁగి నాటికిం బెంపునరుపే
నడుముసొబగు డాఁపఁగడఁగుటెట్లు? 242

కం. అని యిట్లనియెడు ధరణీ
శునిఁ గనుఁగొని పలికె నిట్లు శుకనాసుం డిం
పున నంతర్ముఖసంగు
ప్త నితాంతమనోజ్ఞరుచిరదరహాసుండై. 243

తే. వెలఁది నీరీతి నాయాస పెట్టెదేల?
లలన నీమాటలకుఁగడులజ్జనందె
విడువు మిఁకఁ గులవర్ధన నొడివినట్టి
పలుకు లిట నుచ్చరించుట పార్థివేంద్ర. 244

తే. ఓలి నీరీతిఁబలుకుచుఁ జాలతడవు
నిలచి శుకనాసుఁ డరిగెఁ దన్నిలయమునకు
నంత భూకాంతుఁ డాత్మనిశాంతమును
గాంతతోఁ గూడ నారాత్రి గడపెఁ బిదప. 245

తే. కొంతకాలంబునకు మహీకాంతుదేవి
గణకనిశ్చితభవ్యలగ్నంబునందు
నెమ్మిమై మేఘమాల యిరమ్మదంబు
పగిది నానందకరుఁడగు పట్టిఁగనియె. 246

తే. మనుజనాథుండు నిజసుతుఁ గనుఁగొనంగఁ
దలఁచియుం గాలవశమున నిలచి తగఁ గృ
తాంతనిశ్చిత మగు ముహూర్తమ్మునఁ బరి
జనుల విడనాడి శుకనాససచివుఁగూడి. 247

వ. మణిమయమంగళకలశయుగళబంధురంబును, వివిధవనపల్లవవిరాజి
తంబును, ధవళప్రసవంబుల నెడనెడ ముడిచిన దూర్వాప్రవాళ

మాలికల నలంకరింపఁబడి సురుచిరంబై నదియునగు ద్వారప్రదేశంబున విరాజిల్లునదియు, మఱియు సూతికాగృహమండపంబులగు మంగళ వస్తువుల సంపాదించు పురంధ్రీసముదయంబున సొబగొందుచు, తెక్కల కెక్కువయగు ముత్తైదువల మొత్తంబులు పఠించు సూతికా మంగళగీతముల్లల మనోహరంబగుచు, ధవళకుసుమమాలికామనోజ్ఞం బగుచు, నారాయణనామ సహస్రపఠనసంకులంబగుచు, మంగళశతం బుల నంతరంగంబున ధ్యానింపుచున్నవోయన నిశ్చలశిఖలఁ జెలంగి భర్మయష్టికాప్రతిష్ఠాపితంబులగు మంగళదీపంబుల భాసిల్లుచు, నోఱలనుండి వెఱికిన కరవాలంబులం గరంబులంబూనిన యామికు లచేఁ బరివృతంబగుచు నొప్పుమీఱు సూతికాగృహంబుం గనుం గొని జలంబును జ్వలనంబు నుండాఁకి లోనికిఁ బ్రవేశించి, 248

సీ. ప్రసవపరిక్షామపాండురమగు దేవి
యుత్సంగతలమున నున్న వాని
లలితహాటకయష్టికలితదీపాంశుల
నిజదేహకాంతిఁ గందించు వానిఁ
బసనత యొలయని సురధరిత్రీరుహ
పల్లవం బన నుల్లసిల్లు వాని
ముఖపంచకంబు పొల్పుగ దోపకుండంగఁ
బుట్టిన క్రౌంచారిఁబోలు వాని

తే. ధరణితలమును గనుఁగొనఁ దలఁచి దిగిన
లోహితాంగుఁడనంగ వెలుంగు వాని
నమరతరుణీకరభ్రష్టుఁ డగు జయంతుఁ
డనఁగ శోభిల్లుకొమరునిఁ గనియె విభుఁడు. 249

తే. అప్పుడాప్పుక యన్నేలఱేఁడు సుతుము
ఖంబు ముద్దాడి ధన్యతఁగంటిననుచు

నెంచుకొనునంత శుకనాసుఁ డేగి నృపతి
తనయు దేహంబు దడవుచు ననియె నిట్లు. 250

సీ. అవ్యక్తగాత్రుఁడై యలరుచున్నను నీ కు
మారునకుం గల మహిమ లెల్లఁ
జాటుచున్న విగదా జననాథమణి! చక్ర
వర్తిచిహ్నంబు లేర్పడఁగఁ గనుము
తెలిదమ్మిఁబోలి, పీనులఁ దాఁకి, గృహ మెల్లఁ
దెలుపొనర్చెడు నీని దృగ్ద్వయంబు
పరిఫుల్లనీరజ పరిమళం బగు ముఖ
గంధ మాఘ్రాణించుకరణి మిగుల

ఆ. నిడుపుకల్గి పసిఁడిపుడక బోలినముక్కు,
శౌరిబోలె శంఖచక్రపద్మ
చిహ్నములను నుల్లసిల్లెడు కరయుగ
ళంబుఁ, జూడుమో మనుజేంద్ర. 251

క. తురగ చ్ఛత్త్ర రథ ధ్వజ
సరసిజ రేఖలఁ జెలంగి జనపతివ్రాళి
స్ఫుర దమల మణిమయూఖో
త్కర చుంబన యోగ్య మీపదద్వయ మధిపా. 252

సీ. సచివుఁ డివ్విధమున వచియింపుచుండ మం
గళకుఁడగు పురుషుఁ డొక్కరుఁడు కడు జ
వంబున వచ్చి నిర్భరహర్ష పులకిత
గాత్రుఁడై స్మితముఖకమలుఁ డగుచు
నరనాయకుని చరణంబుల కెఱఁగి నీ
యహితు లడంగుత మధిప! నీకు

జయమగుఁ గాక విశ్వమునెల్లఁ గెలువుము
శుకనాసునకును నీమ కృపవలన

తే. బ్రాహ్మణియు నగ్రసతియు నై బరఁగు శ్రీ మ
నోరమ యనంగఁ, జెన్నారు నారియాదు
రాముఁ డోయన రేణుకారమణియందుఁ
బొలుపు మీఱంగ నుదయించెఁ బుత్రుఁ డొకఁడు. 253

ఆశ్వాసాంతము.

క. నిఖిలజగద్రక్షక! శత
మఖముఖ సురవినుత సుగుణమండల! సీతా
ముఖకమలహేళి! త్రిజగ
త్సఖ! సజ్జనవినుతనామ! దశరథ రామా!

చతుర్విధ కందగర్భిత మణిగణ నికరము.

సరసిరుహనయన, జలనిధిశరణా!
స్వరధిపముఖ దివిజవినుతచరణా!
స్మరజనక! నృహరి! సదమలచరితా!
స్మరరిపుసఖ! కృతమదదనుజరణా!

గద్య.

ఇది శ్రీమద్భారద్వాజసగోత్రపవిత్ర, కామేశ్వరీ శ్రీరామ
దంపతీసుపుత్ర, సుధీజనవినుతచరిత్ర, శ్రీపరమేశ్వర
కరుణాకటాక్ష సంప్రాప్తకవితా విశేష, వినయా
దార్యప్రముఖనిఖిలసుగుణవిభూష, శేష
కవిప్రణీతంబైన పద్యకాదంబరి
యను మహాకావ్యంబున
ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# పద్యకాదంబరి.



## తృతీయాశ్వాసము.



లలనాహృదయేశ్వర !
నాళీకవిశాలలోచనా! భవహరణా !
బాలేందురుచిరఫాల ! మ
రాళాబ్జయశోవిశాల! రామనృపాలా! 1

వ. అవధరింపుము. 2

తే. బాపురే శుభపరంపర బాగుబాగు
జనులకుఁ సంపదలమీఁద సంపదలును
నాపదలమీఁదనాపద లగునటంచు
విబుధులనుమాట నిజము గాన్పించె నేఁడు. 3

తే. సౌఖ్యములు దుఃఖములుగూడ సమముగాఁగ
బడయు మనకిప్డువిధియు నేర్పడఁదనూభ
వులను దయచేసి సమసుఖంబుల ఘటించెఁ
గాదె యనిపల్కి శుకనాసు గారవించి. 4

వ. అవ్వసుంధరాధినాథుండుఁ జాలసంతసించి యిట్టి శుభసూక్తి దెలిపిన యమ్మంగళకునకు నపరిమితంబగు పారితోషిక మిచ్చున ట్లాజ్ఞాపించి, యటనుండి కదలి, శుకనాసుభవనంబునకరిగి, యచ్చటఁ బర

స్ఫురకేయూరకోటిసంఘర్షణపాటితోత్తరీయంబును, స్వేదజలప్రక్షా
ళితాంగరాగరంజితనూతనవసనంబును, వేణువీణామురజకాంస్యతాల
లయానుగతంబును, మృదంగమర్దలపటహానినదానుగతకాహళీశంఖ
నిక్వాణజనితరభసంబును, బదవిన్యాసంబులవలనం బుడమిబీటలు వా
రించెడునట్టి రాజపరిజనంబుచేతను, చారణగణంబులతోడను, స్వభవ
నంబునందలి యుత్సవముకంటె ద్విగుణంబగు నుత్సవముఁ జేయించె.

తే. పదియవదినంబునను నరపాలకుండు
మణుల గోవులఁ బసిఁడి బ్రాహ్మణులకొసఁగి
వనిత నెమ్మోమునన్ శశిఁగనుటఁదాను
నునిచెఁబేరు చంద్రాపీడుఁడని సుతునకు. 6

తే. సచివముఖ్యుండు మఱునాఁడు సంతసమున
ధరణిదేవోచితములు కృత్యముల నెఱపి
రాజననుమతి నాత్మతనూజునకును
నునిచె వైశంపాయనుండ నుచుఁబేరు. 7

వ. క్రమంబుగ నతనికి వర్షసమయంబున నుపనయనాదికంబు లొనరించె
నంత కొండొకకాలంబునకు నచ్చంద్రాపీడునకు శైశవంబతిక్రమించు
టయు నంతఁ దారాపీడుఁడును. 8

సీ. శిప్రానదీతటక్షితిపొంతఁ బ్రాలేయ
శైలంబుఁబోలు విద్యాలయంబు
నరక్రోసు నిడివిగాఁ బురిబైటఁ గట్టించి
బలితంపుతలుపు లేర్పడ ఘటించి
వ్యాయామశాలల నమరించి మఱియును
వాహ్యాళికై కొంత వసుధవిడిచి
యమరాలయముబోలి యమరుతద్గృహమున
నిఖలవిద్యలయందు నిపుణులైన

తే. గురుజనంబులకడ తనకూర్మిసుతుని,
మంత్రికొమరుని నిలిపి సమస్తమైన
విద్యల న్నియమమునను జెప్పించుచుండ
భాషలెల్లను నేర్చి రబ్బాలురంత. 9

తే. నిశ్చలమనస్కుఁడౌట నానృపసుతుండు
సకలవిద్యలఁ దత్తదాచార్యజనులు
బ్రోడతనమునఁ గఱపంగ ముదితుఁడగుచు
నచిరకాలంబులోపల నభ్యసించె. 10

సీ. స్ఫటికంబునందునఁ జాయకైవడి, వివే
కప్రౌఢిమఁ బదవాక్యప్రమాణ
ములయందు, రాజనీతుల, ధర్మశాస్త్రంబు
లందు, నాయుధవిద్యలందు, భరత
రచితముల్, నృత్యశాస్త్రములందునున్, మఱి
నారదీయాది గాంధర్వవేద
ములను, వీణావేణుమురజదర్దురకాంస్య
తాలాదికములు వాద్యములయందు,

తే. చిత్రకర్మల, వారణశిక్షలందు,
వాస్తువిద్యలఁ, గథలఁ, గావ్యములఁ, బ్లుతుల,
సర్వలిపులందు, సురతశాస్త్రముల, నింద్ర
జాలఛందోవిధులఁ బూనెఁ జాల నేర్పు. 11

సీ. ఏన్గుగున్నలఁబట్టి యెత్తుచో నవియు సిం
గము బారిబడినట్లు కదలకుండు
బాలుఁడయ్యు నితండు తాళవృక్షముల నొ
క్కొక కత్తిదెబ్బచే నుర్విఁగూల్చెఁ

బృథ్వీధరంబుల భేదించె నేతద
   స్త్రంబులు భృగురాముశరములట్ల
దశసంఖ్యపురుషు లెత్తఁగ లేని యుక్కుగం
   బముఁ జేతఁగొని పరిశ్రమ మొనర్చె
తే. మనుజపతిపుత్రుఁ బోలె, నమ్మంత్రిసుతుఁడుఁ
దలఁప, నొకమహాప్రాణత వెలితిగాఁగ
నిఖలవిద్యలయందును నిరుపమాన
ఘనతరప్రౌఢిమం దాల్చె జనులు మెచ్చ. 12

క. వైశంపాయనుఁ డొద్దన్
శైశవముననుండి యుంటఁ జంద్రాపీడుం
డా శుకనాసునియెడఁబలె
సౌశీల్యము గౌరవంబు సమముగ నుంచెన్. 13

సీ. జననాథసుతుఁడు వైశంపాయనుని నిమే
   షము బాసియును నిల్వఁజాలఁడయ్యెఁ
బద్మాప్తు దివసంబు భంగిఁ జంద్రాపీడు
   విడచి వైశంపాయనుఁడు ముహూర్త
మేనియుఁ జరియింపఁ డీరీతి నుండంగ
   జలధికి నమృతరసంబుబోలె
సురమహీజమునకు విరికాన్పునుంబోలె
   వనదవేళకు సురధనువుబోలె
తే. నధిపసుతునకు యౌవనం బంకురించి
మేనిసొబగున కినుమడిమెఱుఁ గొసంగెఁ
బ్రాలుమాలిన నూత్న సేవకుఁడుబోలెఁ
బార్శ్వములయందు వసియించెఁ బంచశరుఁడు. 14

తే. లచ్చితోఁబాటు వక్షఃస్థలంబు విరిసె,
నూరుయుగళంబు బంధుమనోరథముల
తోడ నిండింపఁబడినట్లు తోఁచె, మఱియు
రిపుజనులుబోలె మధ్యంబు గృశతఁదాల్చె. 15

సీ. దినదినం బభివృద్ధి దనరారుచుండెను
ద్యాగంబుబోలె నితంబసీమ
యెలమిమై నొకరీతి దలసూపు పౌరుష
శ్రీమాడ్కి విలసిల్లె రోమరాజి
యహితులకాంతల యలకలతోఁబాటు
పొలుపుగఁ బొడవయ్యె భుజయుగంబు
నానాడు చెలువారు నడవడితోఁబాటు
ధవళత్వ మందె నేత్రద్వయంబు

తే. నాజ్ఞతోఁబాటు గురువయ్యె నంసతలము
రాజసుతునకుఁ గంఠస్వరంబుతోన
గ్రాలె హృదయంబునకు గభీరత్వ, మాతఁ
డంత విద్యలనెల్ల సమాప్తి చేసి. 16

సీ. అఖిలవిద్యలయందు నాఱితేఱెనతనా
భవుఁ దోడి తెప్పింపఁ బార్థివేంద్రుఁ
డూహించి, యంత వలాహకుండను చమూ
పతికి నియోగింప, నతఁడు నేగి
క్షితిపాత్మజునకు జాగిలిమ్రొక్కి తనకర్హ
మగు పీఠమున వినయంబుతోడ
జననాథతనయుని యనుమతిఁ గూర్చుండి
పనిగొని తత్సమీపమున కరిగి

ఆ. యావలాహకుంఁడు ననువైనతఱిఁ గాంచి
వినయశాలి యగుచు విహితఫణితిఁ
బలికె, నోకుమార! పార్థివేంద్రుఁడు నన్ను
బంచె నిటకు, మిమ్ముఁ గొంచురాఁగ. 17

సీ. శాస్త్రంబులెల్లను జదివినాఁడవు గదా!
గఱచినాఁడవు గదా! కళలనెల్ల
నెగడినాఁడవు గదా! నిరుపమప్రజ్ఞతో
శస్త్రవిద్యలనెల్ల సంగ్రహించి
సకలవిద్యాచార్య సమ్మతిఁ గొని నీవు
వదలినాడవు గదా! చదువుగీము
రాకేందుఁ డనఁగ సర్వకళాకలాప వి
స్ఫూర్తి శోభిల్లు నిన్ బ్రోలిలోని

తే. వారుఁ జూడంగ నువ్విళులూరుచున్న
వార, లంతఃపురములోనివార లంత
కంటె, మిక్కిలి యుత్సాహకలిత లగుచు
వరలుచున్నారు ధారుణీవరకుమార! 18

సీ. ఆఱవయేట విద్యాలయంబునఁ జేరి
పదివత్సరంబులు చదివికొంటి
వారయ నిపుడు పదాఱువత్సరముల
ప్రాయంబువాఁడవై గ్రాలుచుంటి
విద్యాగృహమునుండి వెడలు నిన్ జూడఁ గో
రిన తల్లులకును దర్శన మొసంగి
గురులకుం, దల్లులకుం బూజ లిడి, రాజ్య
సౌఖ్యమున్, యౌవనసౌఖ్యములను

తే. గాంచి, రాజులనెల్లను గారవించి,
నేలవేల్పులఁ బూజించి, నిఖిలజనుల
నేలి, చట్టాల కానంద మోలిఁ గూర్చు
మనఘ! తెచ్చితి నింద్రాయుధాఖ్యహయము. 19

తే. పారసీకాధినాథుఁడ వ్వారువంబు
నొసఁగెఁ దారాపీడున కుపదగాఁగ
నతఁడుఁ బుత్తెంచె నీకు నాహయవతంస
మదియు ద్వారప్రదేశంబునందు నిలచె. 20

తే. అనఘ! యాయశ్వనామ మింద్రాయుధంబు
గరుడ పవనసమానవేగంబు గలది
యీహయంబు మహారాజు లెక్కుటకును
యోగ్యమని, యెంచి, పంచె నీ కుర్వివరుఁడు. 21

తే. లక్షణజ్ఞులు నయ్యశ్వలక్షణముల
నరసి, యుచ్చైశ్శ్రవమున కున్నట్టి లక్ష
ణములు గల దిట్టియశ్వరత్నంబు నింత
కంటె మును లేక, నిఁకముందుఁ గలుగ దనిరి. 22

తే అనఘ! యయ్యశ్వ మెక్కి మీరరుగునపుడు
చేరి కొలువంగ మూర్ధాభిషిక్త నృపతి
వంశజులు రాకుమారు లశ్వముల నెక్కి
నిలచియున్నారు గుంపుగుంపులుగ బయట. 23

వ. ఏగుదె మ్మనుచు వచియించి యవ్వాలాహకుం డూరకొనినంతఁ జం ద్రాపీడుండును జనకునాజ్ఞ శిరసావహించి పయనంబున కాయత్త పడి జలధరధ్వానగంభీరంబగు వచనంబున నింద్రాయుధంబు నిటకుఁ దోడి తెమ్మని యాజ్ఞాపింప నిరువురు సేవకు లరిగి కనకఖలీనముం గీలించి యిరుగెలంకులం బట్టి లాగుచుఁ జంద్రాపీడునొద్దకుం గొని దెచ్చినంత. 24

సీ. హేషారవోద్భూత భీషణధ్వని జగ
ద్గర్భరంధ్రములఁ జీకాకుచేసి
పులుఁగులదారకుఁ దప్పులు దిద్దుగతి మీఁది
కెగురుచు వ్రాలుచు నేఁగుదాని
నొగి జవ మాప నీసాదవి మ్రుట్టియ నెత్తి
భువనంబు లంఘింపఁ దివురుదాని
నబ్దచాపముఁబోలె నరుణపీతాసిత
ద్యుతుల రేఖలనొప్పు నొడలిదాని
తే. రజతగిరి ధాతురసపూర రంజితంబు
శూలివృషభంబు కైవడిఁ గ్రాలుదానిఁ
జిత్రకంబళరుచిరమహా సింధురంబు
పగిదిఁ గన్నులపండువై నెగడుదాని. 25

సీ. దానవవరుల రక్తం బంటి సటలెల్ల
నెఱ్ఱఁబారిన గొఱగుఱ్ఱ మనఁగ
సకలలోకంబులం బ్రకటించి నిజశక్తి
వెసరూపుఁ గాంచిన వేగమనఁగ
నడచుచో నదిమున్న నాసవెంబడిఁ బీల్చి
వమనం బొనర్చిన వాయువనఁగ
వెలయుదానిని, మున్ను జలధిలోపల నిల్చి
త్రావిన యమృతపూరముల వెలికిఁ
తే. గ్రక్కుచున్నట్లు, వాఁగెల రాపువలనఁ
బొడము లాలాజలంబుల నడరు ఫేన
జలలవంబుల విడచుచు నలరుదాని
ఖురులఁ బొడవైన మెడగల్గి మెఱయుదాని. 26

తే. మౌళినిలిపిన యరుణచామరము లనఁగ
నొసలికెంపులకాంతుల నెసఁగి, మీఁది
కెగసి, నిశ్చలశిఖలతో నెగడి, మిగుల
సొగసుగులికెడు చెవులసోయగముదాని. 27

తే. పసిఁడిగొలుసుల కాంతులఁ బరగి, లక్క
వోలె నెఱుపైన లంబజటాళిఁ దనరి,
వనధిఁ జరియింపుచోఁ దగులొ్కను ప్రవాళ
పల్లవం బన, వెలుగు గ్రీవంబుదాని. 28

తే. మరకతవిభూషణద్యుతి వరలియుంట
శ్యామవర్ణత నొప్పు దేహమునఁ దనరి,
గగనమునుండి నేలకు దిగిన వేఁడి
వెలుఁగువారువ మనుశంకఁ గొలుపుదాని. 29

తే. అబ్ధిపరిచయలగ్నంబులైన మౌక్తి
కములొకో! యన రోమకూపములనుండి
నిజరయం బాపినంత జనించు ఘర్మ
జలకణంబుల విడుచుచు నలరుదాని. 30

తే. అనిలభుగ్వైరిరయమున కరియనంగఁ,
భువనముల సంచరింపుచోఁ బవనునకును
దోడుపడియెడునట్టి మిత్రుం డనంగ
వేగసబ్రహ్మచారినా వెలయుదాని. 31

సీ. హరిచరణం బన, నఖిలవసుంధరో
ల్లంఘనక్షమమై, చెలంగుదాని
నలలిత వరుణహంసముకై వడిన్, మాన
సప్రచారంబై, పొసంగుదాని

మధుమాసదివసంబుమాడ్కి, వికాసితా
శోకపాటల మాచు సాగియుదాని
భుజగకులాధీశు పోలికఁ దగ సదా
గత్యభిముఖ మాచుఁ గ్రాలుదాని
తే. గ్రీష్మదివసం బనఁగ నతితేజసమును
లలి, మహాయామమై యుల్లసిలెడుదానిఁ
గనుఁగొనియె నమ్మహీనాథతనుభవుండు
సర్వకులరత్నమైన యింద్రాయుధమును. 32

కం. శుభలక్షణ లక్షితమును
త్రిభువనపూజ్యమగు నాహరిం గని, ధరణీ
విభునందనుండు ధీర
స్వభావుఁడయ్యును నొకింత సంశయ మొందెన్.

వ. ఒక్కించుక నివ్వెరపడి తనమనంబున.

సీ. కలశాబ్ధిఁ దరిగొండఁ జిలికెడుచో సురా
సురుల కీతురగంబు దొరకదే మొ
యీయశ్వ మెక్కని యింద్రున కే రీతిఁ
గ్రాలెనో? త్రిజగంబు లేలుమహిమ
నుచ్చైశ్శ్రవముఁ జూచి యుబ్బినదేవేంద్రుఁ
డబ్ధిచే వంచితుం డయ్యెఁగాదె
భగవంతుఁడగుశౌరి పక్షీంద్రు నెక్కనా
యీసైంధవముఁ గాంచెనేనిఁ దాను
తే. త్రిభువనమ్ములయందు దుర్లభములైన
రత్నములకల్మి మాతండ్రి రాజ్య మరయ
ధరణిధరవైరిరాజ్య మధఃకరించు
నట్లు వెలుగొందె నని యాతఁ డాత్మఁదలఁచె. 33

తే. అఖిలలోకంబులకుఁ జాల నద్భుతంబుఁ
గూర్చు నీగుర్తు లోకపాటిగుఱ్ఱములకుఁ
గలుగునే యెంతయైన నిక్కముగ నాకు
నెక్కుటకు మదిఁ బొడమెడు నొక్కశంక. 34

క. జడదారుల శాపంబుల
నొడళుల విడనాడి సుకలు నొనరఁగ ధరపైఁ
బడి, శాపములకు ననువగు
నొడళులనుం బడసి మెలఁగు చుందురుగాదే. 35

సీ. మును, స్థూలశిరుఁడను మునికులతల్లజుం
డఖిలలోకలలామ యైనయట్టి
యప్సరఃకాంత రంభాభిధాన శపింప
నదియు నిర్జరలోక మపుడ విడచి
యిలనొక్కబడబయై మృత్తికావతి యను
నగరిలో శతధన్వనాముఁడైన
నరవిభుఁ గొలుచుచుఁ జిరకాలము వసించె
నని పురాణంబులయందు వినమె

తే. యితరులైన మహాత్ము లనేకు లిట్లు
స్వప్రభావంబు లవియెల్ల సన్మునీంద్ర
శాపములఁ దూలిపోఁ బెక్కురూపముల వ
హించి రటుగాన నిదియు నిట్టిద యటంచు. 36

సీ. నృపసుతుం డీరీతి నెంచుచు నెక్కుట
కత్తురంగముపొంత కరిగి, వాజి
వంశవతంస! యెవ్వఁడవైన నేమి? నా
మీఁదఁ గోపం బూనఁగాదు నీకు

ననుచుఁ బ్రార్థించు నాతనియింగిత మెఱింగి
యంగీకరించినభంగి నదియుఁ
దల నూచి, యోరచూపులఁ జూచి, కుడిడెక్క
తోడ నచ్చటినేల దవ్వి దువ్వి,
తే. మెలమి నెక్కుటకై తన్నుఁ బిలచుచున్న
కరణి, సపరుషహుంకారకలితముగ, మ
నోహరంబుగ, సకిలింప నాహయంబు
నెక్క నతఁ, డెక్కుట కనుజ్ఞ నిచ్చెననుచు. 37

వ. అయ్యెక్కిఁరింత నెక్కి యక్కుమారుండు జగంబెల్లనుం బ్రాదేశమాత్రంబుగఁ దలంచుచు నటనుండి కదలి ప్రళయకాలజలధరంబులు విడచు పడగఁడ్లవానలచేతనుంబోలె నొప్పుచు, నతినిష్ఠురంబగు గొరిజలచప్పుడులతోడను, హేషారవంబులతోడను, భువనగోళంబునకుం జెవుడు గూర్చుచు, నున్నాళనీలోత్పలకలికాసాంద్రంబగు సరసియుంబోలె, నూర్ధ్వీకృతంబై రవికిరణకాంతిసంపర్కంబున నిర్మలంబగు కప్పునఁ దనరు కుంతలతావనంబుచే గగనంబు నలంకరింపుచు, శక్రచాపకలాపకల్మాషితంబగు తొలకరిచందంబున నుద్దండమాయూరాతపత్రసహస్రాంధకారితాష్టదిఙ్ముఖత్వం బగుచుఁ బ్రళయజలధిజలకల్లోలసమూహంబున, నిరతంబు నురువులుగ్రక్కుటం దెలుపైన వదనంబులతోడను, వల్గనచటులత్వంబుననుఁ దనరు ననంతంబగు నశ్వసైన్యముం గాంచెను. చంద్రాపీడుఁడు కదలినంత నయ్యశ్వసైన్యంబెల్లఁ జంద్రోదయంబున సింధూదకంబునుంబోలె నెంతయు సంచలించె. రాజపుత్రులెల్లరుఁ బ్రణామతత్పరులై యానృపతిసమూహమువనుండి నిజాశ్వంబులం ద్రోవవెంబడిమరలింపుచు, నానృపకుమారుని వెంబడించిరి. ప్రతినృపతిపేరును వలాహకుండుఁ దెలుపుచుండ నరవిభులెల్లరుం జేతుల జోడించి కిరీటమణులు కదలునట్లు చంద్రాపీడునకు నమస్కరించిరి.

సీ. అంతఁ జంద్రాపీడుఁ డానరేంద్రుల నర్హ
విధుల సంభావించి, పిదప మంత్రి
కొమరుండుఁ దనతోడఁ గూడి వేఱొక యశ్వ
రత్నంబునెక్కఁగా, రాజ్యలక్ష్మి
కాపురంబుండ యోగ్యంబగు తెలిదమ్మి
పూవుపోలికఁ జాలఁ బొలుపుమీఱి
కలశాబ్ధిఫేనసంగతిఁ దెల్పయిన సర్వ
విభు ఫణామండల ప్రభలఁ జెలఁగు

తే. మౌక్తికంబుల దండల మలసి, కనక
దండమున నొప్పు నాతపత్రమ్ము నెండ
మలపుచుండఁగ వందులు బలసి కొలువఁ
బట్టణాభిముఖుండయి బయలువెడలె. 98

సీ. దేహంబుతో ధరిత్రికి నేఁగుదెంచిన
మన్మథుండనఁ బురమార్గమునను
జనియెడు నాతనిఁ గని నిజకార్యముల్
విడచినప్రజ చంద్రుపొడుపువేళఁ
జెలువారు కలువలకొలనువోలె వెలింగి
యితని యమానుషాకృతి ముదమునఁ
గనులారఁ గనుఁగొనఁ గలుగుట మనమెల్ల
నతిపుణ్యవంతుల మైతి మనుచు

తే. సఫలతంగాంచె నిదె మనజనన మెల్ల
నరయఁ జంద్రాపీడుఁడై యవనిమీఁద
నవతరించిన హరికి జోహా రటంచు
మొగిచిరి కరాబ్జముల మౌళి నగరిజనులు. 40

తే. వీటిలోని గవాక్ష కవాటవితతి
తెఱచి యుండుట నప్పురి నెఱిఁ దనర్చె
నృపకుమారుని గనుఁగొన నిచ్చగించి
మెల్లకన్నుల విప్పిన ట్లుల్లసిల్లి. 41

వ. మఱియు నన్నగరంబున నున్న యున్నమిన్నలెల్లరును జనువులనెల్లఁ జాలించి విద్యాలయంబుననుండి చంద్రాపీడుం డేతెంచుచున్నవాఁడని యెఱింగి, యతనిం గనుంగొను కుతూహలంబున నలంకరించుకొనుచున్నవార లలంకరించుకొనుటలుమాని పూర్ణచంద్రులతోడ గొమరొందు రాకారాత్రుల చందంబునం గొందఱు దర్పణంబుల వామకరంబులం బట్టి సొబగొందువారును, లేయొండలఁ గ్రోలిన కమలంబులతోడం జెలువారు కమలినులంబోలెఁ గొందఱు లాక్షారసలేపనంబుల నరుణంబులగు చరణంబుల మెఱసెడువారును, కాలిగొలుసు లడ్డపడ మెల్లమెల్లనఁ దిరుగు కరిణులపోలికం గడువడి నడచుచో జాఱె యొడ్డాణంబు లడ్డంబులగుటం దడఁబడు నడుగుందమ్ములఁ జెలంగువారును, జలధరసమయదివసలక్ష్ములుంబోలె గొందఱు శక్రచాపరుచిరంబులగు నంబరంబుల ధరించి విలసిల్లువారును, మనోజవినాశశోకంబునఁ బటికంపు జపమాల ధరించిన మరు రాణికైవడిఁ గొందఱు కరతలంబుల మౌక్తికహారంబులం దాల్చి గ్రాలెడువారును, సొమ్ము ద్రావి రతనంపు పానపాత్రముల విడచువారు గొందఱును నై యా యరవిందవదనలు ప్రాసాదంబుల నెక్కి రంత. 42

సీ. మహియెల్లఁ బల్లవమయ మయ్యె లాక్షార
సారుణచరణ విన్యాసములను,
లలిఁ బట్టణంబెల్ల లావణ్యమయ మయ్యె
నంగప్రభాప్రవాహముల కతన,

జలదపథంబెల్ల శశిబింబమయ మయ్యె
నాస్యమండల సమూహంబు కతన,
నంభోజవనమయం బయ్యె దిక్తతి యొండ
మరలింప నెత్తిన కరతలముల,

తే. భూషణాంబర కాంతులఁ బొలుపుమీఱె
నాతపం బింద్రచాపమయంబు గాఁగ
నయనఘృణుల దినం బొప్పె నల్లకల్వ
పూలగమివోలెఁ బెక్కుగ్రు పోలఁతులుంట. 43

అ. స్ఫటికమణులయట్ల జలముమంబుల పోల్కి
ముకురమయములట్ల పొలుపుమీఱు
నప్పురాబ్జముఖుల యాత్మలఁ బొలిచె నా
వసుమతీంద్రసుతుని భవ్యమూర్తి. 44

వ. మదనరసం బుదయింప నమ్ముదిత లొండొరువులు సపరిహాసంబుగ, సవిస్రంభంబుగ, సోత్ప్రాసంబుగ, సాభ్యసూయంబుగ, సమన్మథంబుగ, నతిమనోహరంబులగు నాలాపంబు లాడుకొనఁ గడంగిరి. ఓ త్వరితగమనా! నావంకఁ గూడఁ జూడుము. దర్శనోన్మత్తా! చేలచెఱఁగుఁ జక్క దిద్దుకొనుము. చపలా! నుదుటంబడిన ముంగురులం బంధింపుము. 45

క. ఇయ్యధిపతనయుఁ గనుఁగొన
నొయ్యన వచ్చితివి యాననోన్మాదినివై
యియ్యన్నజనులు గనియెదుఁ
బయ్యెద సవరించికొనుము పద్మదళాక్షీ. 46

కం. ఆ శక్రసుతునిబోలు మ
హీశసుతుం డేగుదెంచె నిదె! నగరికి రా
కాశశివదనా! చూతము
కేశములం దిద్దికొను మొగిన్ ద్వరితముగాన్. 47

కం. ఎలమిం దళుకొత్తఁగా భూ
తలపతిసుతుఁ గాంచునట్టి తలఁపున రా నీ
గళితోత్తరీయముం గని
కలకల నవ్వెడు జనంబుఁ గనుఁగొను మబలా. 48

వ. కుతూహలిని! పునర్దర్శనంబాసంగు, మసంతుష్టా! మొంతతడవు చూచెదవు, రాగావృతనేత్రా! నెచ్చెలులం జూడవుగదా! యత్రావనవతీ! పయోధరయుగళంబునం బీడించెద విదియేమి? యతికోపనా! యొకటికి రమ్ము. మత్సరిణి! నీవొక్కతవే గవాక్షంబు నాక్రమించెద వేమి? గతధైర్యా! పెద్దలమ్రోలఁ బరుగిడెద విదేలా? కలికీ! యేల కలఁత నందెదవు? ముగ్ధా! మదనజ్వరోద్భూతంబగు పులకలమొత్తంబును గప్పిపుచ్చుము. శూన్యహృదయా! నిజభవనంబునుండి పోవుచున్న నిన్ను నీవెఱుఁగకుంటివి. అంతస్సంకల్పరచితరతిసమాగమసుఖనిమీలితనేత్రా! యితం డేగుచుండెఁ గనులఁ దెఱువుము. కుసుమబాణబాణప్రహారమూర్ఛితా! రవికరనివారణంబునకై యుత్తరీయాంశుకపల్లవంబు నొందల సంఘటింపుము. ఓయీ! సాధ్వీవ్రతగ్రహగృహీతా! దర్శనార్హు నవలోకింపక నయనయుగళంబు వంచింపుచుంటివిగదా! మఱియు, 49

కం. అళికుల నీలంబగు నృపు
తలఁ గని, తమమనుచుఁ దలఁచి, తల నిలిపిన యు
జ్జలజారిబింబమో యన
విలసద్గతిఁ దోచు జాజివిరిఁ గనుఁగొంటే. 50

తే. కర్ణభూషణ మరకతకాంతివలన
నీలవర్ణతఁ దనరు కపోలసీమ
పొలిచెఁ దొడవుగఁ జెవియందు నిలిపికొనిన
సంప్రఫుల్లశిరీషపుష్పంబుబోలి. 51

తే. మృదులయౌవనరాగంబు హృదయమందు
జొచ్చుటకుఁబోలె హారవిస్ఫురితశోణ
మణుల కాంతికలాప దంభమున బాహ్య
భాగమునఁ దోచెఁ గంటె భూవరసుతునకు. 52

తే. హయఖురన్యాసజనితమై యధిపుమౌళి
లగ్నమైనట్టి రజము వలాహకుండు
చిలుకతెక్కలకాంతుల నలరుచున్న
యుత్తరీయంబుచే నూడ్చుచుండెఁ గంటె. 53

తే. లక్ష్మికరకమలముఁబోలి లలిఁ జెలంగు
చరణపల్లవ మెత్తి యీ ధరణినాథ
పుత్రుఁ డివ్వాజిరత్నంబు మూఁపుమీఁద
డంబుమీఱఁగ నిడియె నడ్డంబుగాఁగ. 54

తే. ధన్యగద! యాలతాంగి, యేతరుణి లచ్చి
కరణి నత్యబ్జమగు వీనికరముఁ బట్టు
నంబుజాక్షీశిరోమణి యగు విలాస
వతియు ధన్య జగత్ప్రభు నితనిఁ గనుట. 55

చ. అని వచియించు నవ్వనిత లక్షులవెంబడిఁ గ్రోలుచుండిరో
యన, మణిభూషణధ్వనుల నల్లన రమ్మని పిల్చుచుండిరో
యన, వరరత్నభూషణ మహార్ఘ్యశిరస్సులఁ గట్టుచుండిరో
యన నరేం గుమారుఁడు నరాధిపుసద్మసమీపభూమికిన్. 56

క. సకలద్వీపాగత దూ
తకులంబుల హస్తిఘటల ధవళచ్ఛత్ర
ప్రకరములఁ దనరు నరనా
థకులద్వారమున దిగియెఁ దత్తడి నతఁడున్. 57

వ. దిగి వైశంపాయనుకరంబు నిజకరంబునం బట్టి చంద్రాపీడుఁడు వలా
హకోపదిశ్యమానమార్గుండై మెల్లన. 58

ఉ. తెల్లని జోడులం దొడిఁగి తెల్లని పాగలఁ జుట్టి మాళులన్
దెల్లనిపూలఁ గీల్కొలిపి తెల్లని పుట్టములన్ ధరించుటన్
దెల్లని రూపులం దనరి తెల్లని దీవియువా రసన్ విరా
జిల్లెడు ద్వారపాలకులఁ జెన్నగుద్వారము కల్గుదానినిన్. 59

తే. భుజగకులసంకులంబులై పొలుపుమీఱు
చున్న పాతాళలోకంబు లోకొ యనఁగ
నిశితశస్త్రాస్త్రములతోడ నిండియున్న
యాయుధాగారముల నందమైనదాని. 60

వ. మఱియు నాస్థానమంటపంబున నర్హాసనంబులం గూర్చుండి ద్యూత
క్రీడలం గాలంబుబుచ్చువారును, నృపాలునిమూర్తిఁ జిత్రఫలకంబుల
లిఖించువారును, వారాంగనాభినయంబుల నవలోకించువారును,
మనుజేంద్రవిరచితకావ్యసుభాషితంబులఁ బఠించువారును, వైతాళిక
గీతంబుల నాలించువారును, నైధఃశ్లోష్ణీషంబులం ధరించినవారును,
గిరీటంబుల గీలించినవారును, మూర్ధాభిషిక్తులును నగు సామంత
మహీకాంతులతో నిండారుచుఁ, గరిఘటాకరశీకరంబులకతన సనీ
హారంబై రక్తాశోకంబులకతన సబాలాతపంబై ముక్తాకలాపంబుల
కతన సతారాగణంబై మఱియు, శివభవనం బన ద్వారస్థితదండపాణి
ప్రతీహారగణంబును, నప్సరోగణంబనఁ బ్రకటమనోరమారంభంబును,
మహేశ్వరబాహువనంబుపోల్కి మహాభోగిమండల సహస్రాధిష్ఠిత
ప్రకోష్ఠంబును, మహాభారతంబుకైవడి ననంతగీతాకర్ణ నానందితనరో
జ్జ్వలంబై, వ్యాకరణంబుపోలికఁ బ్రథమమధ్యమోత్తమపురుషవి
భక్తిస్థితానేకాదేశకాఖ్యాతసంప్రదానక్రియావ్యయప్రపంచసుస్థితంబై,
కడలివడువున భయాంతఃప్రవిష్టసపక్షభూమిభృత్సహస్రసంకులంబై,

యుషానిరుద్ధసమాగమంబుభంగిఁ జిత్రలేఖాదర్శితవిచిత్రసకలభువనాకారంబై, బలియజ్ఞంబువిధంబునఁ బురాణపురుషవామనాధిష్ఠితాభ్యంతరంబై, ప్రాగ్వంశంబుపగిది నానాసవపాత్రసంకులంబై, నిశాసమయంబుఁబోలె ననేకనక్షత్రమాలాలంకృతంబై, ప్రథమవేశ్యాసమాగమంబుకరణి నవిదితహృదయాభిప్రాయచేష్టావికారంబై, ధర్మారంభంబుకీతి సమస్తజనమనఃప్రహ్లాదనంబై, మాద్రీకులంబుతీరున నకులాలంకృతంబై, రఘుకులంబన భరతగుణానందితంబై, నదీప్రవాహంబులాగున సకలదురితాపహారంబై, సంధ్యాసమయంబు చందంబున దృశ్యమానచంద్రాపీడోదయంబై, నారాయణవక్షఃస్థలంబు భాతి శ్రీరత్నప్రభాభాసితదిగంతంబై, స్కంధునిచందంబున శిఖిక్రీడారంభచంచలంబై, కులాంగనాప్రచారంబుఫక్కి సర్వదోషజాతశ[illegible]యై, వేశ్యాజనంబువిధంబున నుపచారచతురంబై, దుర్జనునట్లు నపగతపరలోకభయంబై, వాసరారంభంబు వడువునం బఁస్ఫురత్పద్మరాగారుణీక్రియమాణనిశాంతంబై, భారతరణంబుకరణిఁ గృతవర్మశిలీముఖచక్రసంభారభీకరంబై, పాతాళంబుచందాన మహాకంచుకిసహస్రాధ్యాసితంబై, మహాద్వారంబయ్యును దుష్ప్రవేశంబై, యవంతివిషయగతంబయ్యును మాగధజనోల్లసితంబై కొమరొందు రాజభవనంబుఁ బ్రవేశించె నంత. 61

సీ. వెసలేచి చేదోయి నొసలిపై మోఁపి ప్ర
తీహారితతి త్రోవఁ దెలుపుచుండఁ
బేరు ప్రతీహారి వినిపింప రాజన్యు
లర్పించు జోహారు లందుకొనుచు
నాచారనిపుణలై యలరు ముత్తైదువల్
మంగళక్రియల నేమమున నెఱప
భువనాంతరంబులం బోలె నొప్పెడు సప్త
కక్ష్యాంతరంబులం గడచిపోయి

తే. రాకుమారులతోడ సద్భ్రములతోడ
మెఱయుచున్నట్టి కొలువున మిన్ను చేటి
సైకతంబున సౌరగజంబుఁ బోలె
ధవళతల్పంబునందున్న తండ్రిఁ జూచె. 62

తే. చూచి సాష్టాంగవినతుల నాచరించి
వినయమున ముందల నిలచిన తనయుఁ గాంచి
రమ్మురమ్మని విభుఁడు గరద్వయంబు
లీలమై సాచి తమిఁ గౌఁగిలించుకొనియె. 63

సీ. నృపచంద్రుఁ డాత్మజు నుపగూహన మొనర్చి
విడచినంతట మహీవిభుసుతునకు
నుత్తరీయాంశుక మొగిఁ జుట్టగాఁ జుట్టి
రమణి తాంబూలకరంకవాహి
ని, నృపాలుచరణసన్నిధి నిడినట్టి యా
సనముఁ దొలంగింపు మనుచు నాకు
శేశ యాత్మికి సన్నఁజేయుచుఁ జరణాగ్ర
మున ద్రోసి నేలమీఁదన యతండు

తే. నేలమిఁ గూర్చున్నయంత నుర్వీశ్వరుండుఁ
బిలచి వైశంపాయనుఁ బ్రియకుమారు
బలెనుఁ గౌఁగిటఁ జేర్చి వీడ్కొలుప విభుని
కొడుకుకడనున్న పీటపైఁ గూరుచుండె. 64

సీ. ఉర్వీవరుండు ముహూర్తకాలంబు కు
మారునిఁ గాంచి కుమార ! నీవు
పోయి యిచ్చటనుండి పుత్రవత్సలమైన
భవదీయజననికిఁ బ్రణతిఁ జేసి

నిన్నుఁ జూడఁగఁ గోరియున్నట్టి తక్కిన
జననుల కెల్ల దర్శన మొసంగి
హర్షాబ్ధిలో నోలలాడింపు వారల
నని పల్కి వీడుకొల్పిన నతండు
తే. వినయమున లేచి, నిజపరిజనుల నాపి,
సరస వైశంపాయనుం డరుగుదేర
వేచి తగువారు త్రోవఁ జూపించుచుండ
నల్లనల్లనఁ జనియె శుద్ధాంతమునకు. 65
సీ. లెక్కకెక్కువయైన లేమలు ధవళదు
కూలముల్ ధరియించి పాలకడలి
తరఁగలు కలుముల తలిరుఁబోఁడిం బోలె
దనుఁ జేరి కొలువంగఁ దనరు దాని
సంజలపగిదిఁ గషాయరక్తాంబరం
బులఁ దాల్చి సమస్తభువననుత చ
రిత్రలైన జరత్పరివ్రాజికలు జేరి
ధర్మోపదేశ సందర్భములను
తే. దెలుపు, చిత్రహాసములఁ జెప్ప, చెలిమిఁ గొలువ
గిరియుగాంతఃప్రభూతభాగీరథీప్ర
వాహయగు ధాత్రినాఁ గుచద్వయము నడుమ
గ్రాలు హారంబుగల తల్లిఁ గాంచి మ్రొక్క. 66
సీ. అలరుచు లేచి నిజాజ్ఞఁ జెల్లించెడు
పరిజనుల్ తనపొంత వరలుచున్న
దనకుఁదాఁ బోయి సుతునిమౌళి మూర్కొని,
కదిసి కొండొకసేపు కౌఁగిలించు

కొని, తదుపరి మంత్రితనయు నిజాత్మజు
 కైవడి ముద్దాడి కౌఁగిలించు
కొని, తాను గూర్చుండి, వినయంబుమై మహీ
 తలమునఁ గూర్చుండుతనయుఁ బట్టి
తే. యెలమి నంకతలంబున నిలిపికొనఁగ
 నెంచి, యతఁ డందులకు సమ్మతించకున్న
 బలిమిమైఁ బట్టి లాఁగి యజ్జలజనేత్ర
 పట్టెఁ దొడమీఁదఁ గూర్చుండఁ బెట్టికొనియె 67

సీ. అంతట భృత్యసమానీత మగుపీట
 మీఁద మంత్రికుమారుఁ డాదరమునఁ
 దగ విశ్రమింపంగఁ దనయుఁ జంద్రాపీడుఁ
 గమలాక్షి పలుమఱుఁ గౌఁగిలించి
 నెమ్మోము, భుజశిఖరమ్ములు, వక్షంబుఁ
 బలుమారు దడవుచుఁ బలికె నిట్లు
 నాచిన్నితనయ! చంద్రాపీడ! నీతండ్రి
 కడునిర్దయుం డైనకతన భువన
తే విసుతమైనట్టి నీరూపవిభవ మింత
 దనుక మితిలేనికష్టంబు లనుభవించెఁ
 గటకటా! గురుజనంబుల కఠినశిక్ష
 కెట్లు సైరించితో కదా! యింతతడవు. 68

సీ. బాలుండవయ్యు సచ్ఛీలుఁడవయ్యు నీ
 ధైర్యంబు కటికిచందంబు బళిర!
 లేఁగూనవయ్యు బళీ! నీదు హృదయంబు
 శిశుజనక్రీడ కాశింపదయ్యె,

బాపురే! గురువులపై నీకుఁ బొడమిన
భక్తి యొందును ననల్పంబు గాదె!
జనకు ననుగ్రహంబున నెట్లు విద్యల
యం దాఱితేఱి నా కగపడితివొ

తే. యట్టు లనురూపలైన భార్యలఁ జెలంగు
నిన్నుఁ గనులారఁ గాంతు నోయన్న! యచిర
కాలమున నన సిగ్గుచే మాళివాంచు
కొనిన సుతుచెక్కు గవ ముద్దుగొనియె జనని. 69

తే. తల్లికడనుండి కదలి, శుద్ధాంతములకుఁ
బోయి తల్లులఁ గాంచి, యింద్రాయుధంబు
నెక్కి, మంత్రికుమారనరేంద్రసుతులు
వెంటఁ జనుదేర శుకనాసునింటి కరిగె. 70

చ. సమదమదావళప్రకరసంకులమై, తురగావళీసమా
క్రమహితమై ప్రయోజనవశంబున వచ్చినవారితోడనుఁ గ్,
దమిఁ బరికింప వచ్చినజనంబుల నిండిన మంత్రిచంద్రు ద్వా
రమునఁ దనంత డిగ్గెను దురంగము నెవ్వరు నాపకుండఁగన్. 71

సీ. ఆతఁ డయ్యశ్వంబు నాద్వారమున నిల్పి
లీల మంత్రికుమారు కేలుబట్టి,
పరిజనంబులు ముందుఁ బసవిడఁ బ్రతిహారు
లేతెంచి మార్గంబుఁ బ్రీతిఁ జూప,
సేవింప నేగుదెంచిన ధరిత్రీపతుల్
మాటిమాటికిఁ బ్రణామము లొనర్ప,
నొనరఁ బ్రతీహారహుంకారభయమునఁ
బలుకంగ వెఱచిన పరిజనములఁ

తే. గ్రాలు కక్ష్యాంతరంబులఁ గాంచుచుండి
యుల్లనల్లన విమల సుధావదాత
మైన ప్రాసాదవితతి పొంపగుచు రాజ
భవనముంబోలు శుకనాసువసతి కరిగి. 72

క. తనజనకునిచందంబున
మనుజవరులనడుమ నున్నమంత్రికి శుకనా
సునకుం జంద్రాపీడుఁడు
వినయాంత్ముం డగుచు మ్రొక్కె విశ్రుతలీలన్. 73

తే. అంత నిజపుత్రుబోలె భూకాంతుసుతునిఁ
గాంచి, నిర్భరహర్షసంకలితుఁ డగుచు
మంత్రి శుకనాసుఁ డధికసంభ్రమముతోడ
లేచి, యెదురేగి, వెసఁ గౌఁగిలించుకొనియె. 74

సీ. పరిరంభణ మొసఁగి, వదలి రయంబున
రత్నాసనం బాదరమున నిడిన
విడచి, యయ్యేకిమీఁదికొడుకు మహీతలం
బునఁ గూరుచుండె, నావెనుక మంత్రి
కొడుకు వైశంపాయనుఁడుఁ దానుఁ గూర్చుండ
నంతకుమున్న యర్హాసనముల
విశ్రమించిన మహీభృత్ప్రకరం బెల్ల
నాసనంబుల వీడి యవనిమీఁదఁ

తే. గూరుచుండి రంత గుణమణి శుకనాసుఁ
డంగకములఁ బులక లావహిల్లి
తనదు మానసమునఁ దగిలినహర్షంబు
వెలికిఁ దెలుపుచుండఁ బలికె నిట్లు. 75

క. నేఁడు గద పతికిఁ దారా
పీడునకుం జవ్వనమున విద్యలయందుం
బ్రోడవగు నిన్ను వేడుకఁ
జూడఁగ సమకూరె రాజ్యసుఖము లభించెన్. 76

సీ. వినుము కూరిమి గురుజను లిడ్డదీవనల్
నేఁడుగదయ్య ఫలించెఁ దండ్రి!
చెలువారు నేఁడుగాఁ దొలిమేనఁ జేసిన
పూజలెల్లను ఫలోన్ముఖము లగుచుఁ,
దలపోయ నేఁడుగాఁ గులదేవత లనుగ్ర
హమ్ముఁ జూపిరి మనయందుఁ గూర్మి,
దఁరదృష్టవంతులౌ నరులకు నీయట్టి
యతఁడు కుమారకుం డగునె! నీదు

తే. ప్రాయ మెచట, సమానుషప్రజ్ఞ యెచట,
నిఖిల విద్యాప్రభూతపాండిత్య మెచట,
భరతరఘుతుల్యుఁడవు నీవు ప్రభుఁడ వగుట
నిఖిలజనము లు ధన్యులై నెగడి రుర్వి. 77

తే. నిన్నుఁ బతిఁగాఁగ వలచిన మన్నువెలఁది
మంచికర్మంబు లేమి గావించెనొక్కొ,
కమల విష్ణునివక్షఃస్థలమును వీడి
విగ్రహిణి యగు నిన్ను సేవింపఁ గడఁగె. 78

సీ. ఆదిసూకరము దంష్ట్రాగ్రంబునంబోలెఁ
గల్పశతంబు లనల్పలీలఁ
దండ్రితోఁ గూడి యీధరణీభరం బెల్ల
వహించుపుమీ భుజవలయమందు

నని పల్కి స్వయముగ నాభరణాంబర
పుష్పాదికంబులఁ బూజ సేసి
యల్లన వీడ్కొల్పి నంతఃపురమునకుఁ
గ్రక్కునఁ జని మనోరమ యనంగఁ
తే. దనరు వైశంపాయనుజననిఁ గాంచి
పోయి యటనుండి యెక్కి యింద్రాయుధంబు
లలితమంగళవస్తు సంకలితమైన
స్వభవనంబున కరిగె భూపాలసుతుఁడు. 79
తే. అరిగి శ్రీమండపమున నున్నట్టి శయ్య
పైని గూర్చుండి క్షణము భూపసుతతోడ
స్నాన మాదిగ నశనావసానముగను
దివసకృత్యంబు నడపెఁ బార్థివసుతుండు. 80
వ. అంత సాయంసమయం బగుటయు.
తే. తివిరి దివినుండి దిగుచున్న దివసలక్ష్మి
స్వప్రభాపిహిత రత్నమౌ పద్మరాగ
నూపురంబో యనంగ నున్ముక్తపాద
మగుచు రవిమండలము జారె నపరజలధి. 81
తే. అర్కరథచక్రమార్గంబు ననుసరించి
పాఱుచున్నట్టి సలిలప్రవాహ మనఁగ,
దివసలక్ష్మీ సమంచితతేజ మెల్ల
నల్లనల్లనఁ బడమటి కరుగఁ జొచ్చె. 82
తే. అభినవ కిసాలలోహితమైన పాణి
తోడనుంబలె దివస మధోముఖముగ
విన్ననంబోవు జలజా ప్రతిబింబమునను
దుడిచెఁ గలయంతతమ్ముల నడరు కెంపు. 83

తే. కరపుటంబులఁ బవల్లెల్లఁ గమలహితుఁడు
కమలమధురసముం గ్రోలి గగనగమన
ఖేదమున సంజవేళఁ గ్రక్కెనో యనఁగ
సాంద్రరక్తాతపము బర్వె జగము నిండ. 84

సీ. పొరిఁ బ్రతీచీకర్ణపూరహల్లకమైన
యజ్జాపుఁ డరుగ లోకాంతరంబు
గగనసరఃఫుల్ల కమలినియగు సంజ
లలి నముల్లసితమై యలరుచుండ,
నాశాముఖముల గృష్ణాగురుద్రవపత్ర
లతలపోలికఁ దమోవితతి వెలయ,
రేచాన నొసటఁ దీర్చిన పల్లవముఁ బోలు
సంజకెంపల్లన జాఱుచుండ,

తే. వెలయ సంధ్యార్చనాబలిపిండచయము
ననదృశస్థితి వెలుగంగ దెసలయందు
సిగరముల నంధకారంబు దగిలి బర్హి
యష్టు లెడలిన నెమళులున్నట్లు దనర. 85

తే. నలిని గ్రోలిన లేయెండ వెలికిఁ ద్రోయ
నాత్మఁ దలపోసి సొచ్చెడు నంధకార
పల్లవము లనఁ గమలగర్భములయందు
మొత్తముగ నిల్చి తుమ్మెదల్ ముద్దుసూప. 86

సీ. చిలుకలు, గోరవంకలుఁ జూతతరుగత
పంజరంబులఁ గూర్కు-వడి యడంగ,
నంగనామణు లెల్ల సంగీతముం బాడి
యూఁచిన వల్లకు లేఁపుమీఱఁ,

క్రమమునఁ బ్రథమయామమున నేతెంచెడు
సింధురంబులు బ్రవేశింపుచుండ,
క్షితినాథునకుఁ బురోహితులు దీవెన లిచ్చి
యలరుచు నిండ్లకు నరుగుచుండఁ

తే. బఱజనుల్ దివ్వెలం గొంచు నరుగుదేర
జనకులం గాంచి, నిజగృహంబునకు నరిగి
పుండరీకాక్షుఁ డహిఫణామండలముఁ
బోలెఁ మణిశయ్యఁ బన్నుండె భూపసుతుఁడు. 87

సీ. వేగుఁజామున లేచి విభుఁడైన జనకుని
యాజ్ఞఁ గైకొని వేఁట కరుగఁ దలఁచి,
యుష్ణాంశుఁ డుదయింపకుండ నింద్రాయుధం
బెక్కి చంద్రాపీడుఁ డేగుచుండఁ
దనమ్రోల వింతవింతల పాగలం జుట్టి
శస్త్రాస్త్రములఁ గేల సంతరించి,
కుక్కల బంగారుగొలుసులఁ బట్టి లా
గుచు వేటకాండ్రుఁ దన్గూడి రాఁగ,

తే. నవనినాయకపుత్రుఁ డింద్రాయుధంబు
మంచివేగంబుగా నడపించుకొనుచుఁ
గరి తురంగ పదాతి సంకలితుఁడగుచు
వెడలె దుర్గాంతమగు నొక్క విపినమునకు. 88

తే. అవ్వనంబునఁ దీక్ష్ణశస్త్రాస్త్రనిహతిఁ
గిరులఁ జమరీమృగంబుల శరభములను
సింగములఁ బెద్దపులుల జింకపిండ్లఁ
గెడపి బ్రదికినగొన్నింటి నొడిసిపట్టె. 89

సీ. నలినమిత్రుఁడు మింటినడుమఁ జేరఁగఁ దాన
మాడినపగిది శ్రమాంబుబిందు
వుల విడచుచుఁ, గళ్లెముల రాపుచే ఫేన
విసరముం గప్పుచు, వీనుదోయిఁ
బొలుపుగ నిడిన పూవులసౌరభమునకు
నాశించి వచ్చిన యళుల రొదల
నింపుమీఱుచు నున్న యింద్రాయుధం బెక్కి
యొడలిపైఁ జెమటలు పొడమియుంట

తే. లోనఁ గవచంబు తడిసి నెమ్మేను మెఱయ
గొడుగుబలె నొక్కకిస మెండ నడపుచుండ
సరయతురగంబు లెక్కి భూవరులసుతులు
సరసఁ గొందఱు రా నేగె సదనమునకు. 90

సీ. అరిగి చంద్రాపీడుఁ డశ్వంబు డిగినంతఁ
గడువడిఁ బరిజను లిడిన యాస
నమునఁ గూర్చుని కంచుకము నూడ్చి పిమ్మట
హయసమారోహణార్హంబులైన
తొడవుల నన్నింటి విడచి యిర్వంకల
వింజామరము లూని భృత్యగణము
విసరుచుండ నొకింత విశ్రాంతిఁ గైకొని
కలధౌతమణిహేమకలశతతుల

తే. నొప్పుమీఱుచుఁ గనకపీఠోజ్జ్వలంబు
నైన యభిషేకభూమికి నరిగి జలక
మాడి తలయార్చుకొని ధవళాంబరములఁ
బూని తలపాగ నిడి దేవపూజ నెఱపి. 91

సీ. నెఱిఁ గూరుచున్నంత నృపుపరిచారికల్
 కులవర్ధనాప్రభృతులు విలాస
వతివరవుల్లు నుద్ధతి వెంట శుద్ధాంత
 సంప్రేషితలు పరిచారికలును
నంగరాగముల ధౌతాంబరమ్ములఁ బుష్ప
 మాలలం దెచ్చి భూపాలసుతుని
యగ్రభాగంబునయం దుంచిరంతఁ జం
 ద్రాపీడుఁ డవి యంది తాను మొదల
తే. నొడలిపైఁ బూసికొని, మంత్రికొడుకునకును
బూసి, యచ్చటఁ గల పెఱభూపతులకు
నొసఁగి తొడవులఁ బూతల వసనములను
బోయె నాహారమంటపంబునకు నతఁడు. 92

ఉ. మానవనాథనందనుఁడు మంత్రికుమారుఁడు రాజపుత్త్రులున్
బోనము సేయుచున్నయెడఁ బొల్పుమెయిం దగ నీపదార్థమున్
వీనికిఁ బెట్టుఁడంచుఁ బృథివీపతిపుత్త్రుఁడుఁ దెల్పుచుండి స
న్మానముఁ జేయుచుండఁగఁ ముదంబున జేసిరి భోజనంబులన్. 93

ఆ. కుడిచి పుడమిఱేనికొడుకు కిటునటు సంచ
రించు చెలిమి ముచ్చటించుచుండి
తన కనేకభృత్యజనులున్న నతఁ డేగి
యశ్వమునకు వైచి యవసచయము. 94

కం. నరపతిభవనమునకుఁ జా
నరిగి, మునుపుఁబోలె జనకు నవనీనాథుఁ
బరికించి, పిదప నభ్యం
తరగృహమున కేగి గడపెఁ దగ నారాత్రిఁ. 95

వ. మఱునటినా డుదయంబున కైలాసనాముండగు కంచుకి వచ్చి వెంటం
దవిలి.

తే. బాహువల్లులలీల నిర్వంకలకును 96
ద్రిప్పుకొనుచుండ నఖముల నుప్పతిలిన
భవ్యకాంతిమిషమున లావణ్యరసము
నోలి ధారలఁగాఁ గార్చుచున్నదాని. 97

తే. దిఙ్ముఖమ్ములకడఁ దాఁకి తేజరిల్లు
హారములఁబుట్టు సత్కాంతిపూరమునను
నొడలు మునిఁగినకతనఁబొల్కుడలినడుము
లీలఁదలసూపు సిరియనం గ్రాలుదాని. 98

కం. కోమలతనులతఁ గ్రాలుచు
భామిని సొబగొందె నూత్నవనరాజి యనం
గా, ముఖశాలయనన్ వే
దీమధ్యమనోజ్ఞయగుచు దీపితయగుచున్. 99

సీ. సింహికాసుతుఁడు గ్రసించునన్ భీతి నే
లకు డిగినట్టి చంద్రకళయనఁగ
సురుచిరాకృతిఁబూని ధరణిపైఁబుట్టిన
ప్రభుకులభవన దైవతమనంగఁ
బదముల నందెలరొదలొప్పు హంసకం
పితజలజంబు పద్మినియనంగ
మనుజలోకముఁజూడ మదినెంచి నేలకే
ర్పడ నేగుదెంచిన రతియనంగఁ

తే. దనరుచు నమూల్యమైన రత్నంపురశన
లీల జఘనస్థలంబునఁ గ్రాలుచుండఁ
జెన్నుమీఱెడు వలిపూఁపచన్నుదోయి
కలిగి ముదముననేతెంచు కలికిఁజూచె. 100

తే. అంతఁ గైలాసనామకుం డధిపునకు న
మస్కృతి యొనర్చి దేవ! కుమార! తనను
పల్కఁగా నిల్లెఱింగింపఁ బట్టమహిషి
యగువిలాసవతీకాంత యంపెవినుము. 101

ఉ. ఆలమునం గులూతవిభునంతకు చెంతకుఁ బాపి తెచ్చె నీ
బాలికఁ బత్రలేఖ నరపాలుఁడు గూఁతులు లేమి నేనునున్
లీలఁగఁ బెంచితిన్ సుతబలెన్ దగ నీమెను బిల్చుకొంచుఁ దాం
బూలకరంకవాహినిఁగ ముద్దులచెల్లెలువోలెఁ జూడుమీ. 102

ఉ. ఈయరవిందనేత్ర చరియింపుమనుండును నీకు వెంబడిం
జాయయుఁబోలె నొక్కనిమిషంబయినన్ విడనాడకుండ నీ
వీయెలనాగ సర్వమగు కృత్యమునన్ న్నియమింపుచుండుమీ
నాయెడ నీకుఁ గల్గిన ఘనంబగు గౌరవముం దలంపుచున్. 103

తే. రాజకులసంప్రభూత యీరమణి యచిర
కాలమున నిన్నుఁ బూజింపఁగలదు నాకు
నీమగువయందుఁ గల దతిప్రేమ దీని
తెఱఁగెఱుంగఁడు కోమరుఁడం చెఱుఁగఁ జెప్ప. 104

తే. నన్నుఁ బుత్తెంచెనని వాఁడు విన్నవించి
మానమూనంగఁ జేదోయి మౌళిఁ జేర్చి
కొనినయప్పత్రలేఖఁ గన్గొంచు నమ్మ
తించి కంచుకినంపెఁ బార్థివసుతుండు. 105

తే. పత్రలేఖయు నదిమొదల్ ప్రభుకుమారు
రాతిరియుఁ బవలు నాక నిరంతరంబుఁ
గొలుచుచుం జాయ పోలికమెలఁగుచుండె
వదలక నరేంద్రసుతుని పార్శ్వంబువెంట. 106

కం. చంద్రాపీడుండును ద
చ్చంద్రముఖిం జూచినది మొదలుగా మదిలో
సాంద్రమగు కరుణ నివ్వటి
లం ద్రోయక పెక్కువిధములం బాలించెన్. 107

తే. కొంతతడవిట్టులరుగంగఁ గూర్మిపట్టి
యౌవరాజ్యాభిషిక్తుఁ జేయంగఁ దలఁచి
ధారుణీనాయకుఁడు ప్రతీహారులకును
దెలిపె సంభారములఁ గూర్పవలయుననుచు. 108

తే. యౌవరాజ్యోన్ముఖుండైన యాతఁడొక్క
దివసమున మంత్రిఁజూడఁ దద్భవనమునకు
నరుగ శుకనాసు డాతని నధికవినయ
వంతుఁ డగుట మెఱింగి యుఁ బలికెనిట్లు. 109

తే. నిఖిలవిద్యల యందుఁ బండితుఁడవైన
నీకుఁ జెప్పుటకేమున్నదో కుమార !
యైన నీయందు నాకున్న యట్టి ప్రేమ
కతనఁ దెలిపెదఁ గొన్ని సంగతులవినుము. 110

కం. వెలువగు రత్నప్రభలకు
మలఁగవు రాజీవమిత్రుమహితరుచులకున్
దొలఁగవు విద్యుద్ఘృణులకుఁ
గలఁగవు యా[illegible]భవోగ్ర గాఢతమంబుల్. 111

సీ. ఉపచారములశాంతి నొందక దారుణ
స్థితిమీఱుచుండు లక్ష్మీమదంబు
ఐశ్వర్యమను తిమిరాంధత్వరోగంబు
లంజనంబులకు సాధ్యములుగావు

నతితీవ్రదర్పదాహజ్వరోత్కర్షంబు
శిశిరకృత్యములఁ గృశింపకుండు
విషయ విషాస్వాద విభ్రమితమోహంబు
మంత్రతంత్రంబుల మాన్పగాదు

తే. బహుళరాగమలావలేపప్రసిద్ధి
స్నానశౌచప్రవృత్తిచే సడలకుండు
రాజ్యసుఖసన్నిపాత నిద్రయును నకు
పావసాన ప్రబోధమో యధిపతనయ!

తే. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబు
మానితసురూప విభవంబ మానుషప్ర
భావసంపదయు నేఁడు నస్వర్ధసుగుణ
నిన్ను వరించెనో క్షితితలేశ!

కం. పూరుషులకు నీగుణముల
నారయనొకఁడేని గలుగ నవగుణము లకౌన్
దారిమ్మగుసు రిఁకిన్నిఁటి
చేరికగలదేని వేఱచెప్పఁగనేలా.

తే. రాజరాజకిరీటాగ్ర రత్నకాంతి
రంజితపదాబ్జ! యౌవనారంభమందు
శాస్త్రజలపూరధౌత ప్రసన్నమైన
మహితబుద్ధియు వెసనొందు మలినగుణము

కం. గురువచనం బమలంబై
బొరలియు ఖలమతికిఁ గర్ణపుటగతజలశీ
కరమన నితాంత దుస్సహ
పరితాపముఁ గూర్చుచుండుఁ బాయకయెపుడున్.

తే. నిలువుటద్దంబునందున నీడబోలెఁ
జంద్రకిరణవితానముల్ స్ఫటికమణుల
యందునుంబోలె విమలహృదబ్జసీమ
సుకరముగఁ జొచ్చు నుపదేశసుగుణసమితి. 117

ఆ. విషయసుఖముపొంత వెడలని నీకు ని
దేగదయ్య! సదుపదేశవేళ
స్మరశితాస్త్రనిహతమతి నుపదేశముల్
నీటఁగడిగినట్లు నిలువవ్రుగద. 118

సీ. ఘటఖడ్గమండలోత్పలవనవిభ్రమ
చారిణీ యీలక్ష్మి జననవేళ
లలిఁ బారిజాతపల్లవముల రాగ మే
కాంతవక్రత పుకజారి వలనఁ
జంచలత్వమ్ము నుచ్చైశ్రవమ్మునుండి
మోహనశక్తి హాలాహలమున
మదిరారసమునుండి మదముఁ గౌస్తుభమణి
వలన నైష్ఠుర్యసంపదయు నిట్టి
తే. గుణగణంబుల సహవాసగుణమువలన
స్వీకరించియె వీఁకతోఁ బైకివెడల
నధిప! యిటువంటి దీఁకవేఱె యవనియందు
పూని పలుమారువెదకినఁ గానరాదు. 119

వ. ఈసామ్రాజ్యలక్ష్మి లబ్ధంబైనను నేలుటమర్ఘటంబుగదా సుభటనికర కరస్ఫురదసిలతాపంజరమధ్యగతయయ్యును బరిక్రమింపంజూచు, బరిచయంబరయదు. వంశంబుఁ జూడదు, రూప మాలోకింపదు, కులక్రమ మంగీకరింపదు. స్వభావంబు లెక్కసేయదు. నేర్పుమెచ్చదు. విద్య వీక్షింపదు, దానంబున కానందింపదు, సర్వజ్ఞత్వంబు విచారింపదు. సదాచారంబునకు హర్షింపదు మఱియును— 120

తే. క్ష్మాప! గంధర్వనగరలేఖయునుబోలెఁ
జూచుచుండఁగ లోచనాగోచరయగు
లలితనలినీవిహార సంలగ్నకంట
కక్షతయనంగఁ జరణమెక్కడను నిడదు. 121

తే. క్రూరపారుష్యమును నేర్పుకొఱకుఁబోలెఁ
గోరి కాపుండుఁ దా నసిధారలందు
విశ్వరూపత్వము గ్రహించు వేడ్కఁబోలె
నబ్జలోచను దేహంబు నాశ్రయించు. 122

తే. కమలగృహ వసుజననియై గంగకరణి
నంచిత తరంగ బుద్బుద చంచలంబు
ప్రకటితానేక వివిధ సంక్రాంతి యగుచు
దివసనాయకగతి యనఁ దేజరిల్లు. 123

వ. పాతాళగుహయుంబోలెఁ దమోబహుళయై, ప్రావృట్సమయంబునుంబోలె నచిరద్యుతికారిణియై, హిడింబవిధంబున౯ భీమసాహసైకహార్యహృదయయై, మఱియు స్వల్పసత్త్వనకు నున్మాదంబుఁ గూర్చు, నీర్ష్యకతంబునంబోలె విద్యావంతుం జెట్టఁబట్టక, గుణవంతునపవిత్రుని పగిదిం గేల స్పృశింపక, సజ్జనుం దనకుఁ బనిలేనివానిగాఁ జూచుచు, సద్వంశసంభవు సర్పంబునుంబోలె దాటుచు, గంటకంబునుంబోలె శూరునిఁ బరిహరింపుచు, వితరణశీలుని దుస్స్వప్నంబునుంబోలెఁదలంపక, పాపాత్మునింబోలె నీతిమంతుని సమీపింపక, తనచరిత్రంబు జగంబున నింద్రజాలంబుపోలికఁ జూపించుచుండు నదియునుంగాక సతతంబుం బ్రతాపంబుఁ గూర్చుచుండియు జాడ్యంబు గల్పింపుచు, జలరాశిసంభవయయ్యునుం దృష్ణ బెంచుచు, నీశ్వరత్వంబు వహించియు నశివస్వభావత్వంబు సంఘటింపుచు, నట్లునుంగాక యమృతసహోదరయయ్యునుం గటువిపాకయై, విగ్రహవతియయ్యు నప్రత్యక్షదర్శ

నయ్యె, పురుషోత్తమరతయయ్యు ఖలజనప్రియయై, వర్తించుచుండు. దైవవశంబున దురాచారయగు నీరాజ్యరమకుం గైవసంబై నరనాయకవ్యూహంబు వికల్పప్రవృత్తి యగుచుండును వినుము. 124

సీ. లలితాభిషేకాంబువుల గాత్రమలినంబు
కరణి దాక్షిణ్యంబుఁ గడుగఁబడును
బూజితానలసముద్భూతాభిధూమసం
గతిఁబోలె హృదయంబుఁ గలుష మగును
సత్పురోహితకుశ సమ్మార్జనలతోడఁ
దుడిచినవిధమునఁ దొలఁగు నోర్పు
కలనైనను జరాగమనసంస్మరణంబు
సేయఁడు మౌళి నుష్ణీషమునంట
తే. నరయఁ బరలోకదర్శన మాతపత్ర
మండలంబునఁ దొలఁగుచునుండు, సత్య
వాదితయుఁ జామరోద్భూతపవనములకు
మలఁగుఁ బట్టాభిషిక్తుఁడౌ మనుజపతికి. 125

మ. భువి ఖద్యోతవిభాముహూర్తరుచిరంబుల్ ధీరవిద్వజ్జనేం
ద్ర వినింద్యంబులునైన సంపదలచేతం గ్రొవ్వి పంచేంద్రియ
వ్యవసాయుండును దా ననేకశతసాహస్రేంద్రియవ్యాకుల
త్వవిధిన్ మానవనాథుఁ డెల్లయపుడున్ వర్తించు గర్వాంధుఁడై. 126

వ. మఱియుం గుళీరంబునుంబోలెఁ దిర్యగ్గ్భమనంబుల నలరుచు, మృషావాదవిషసంజాతముఖరోగు లన నతికష్టంబుగ సంభాషింపుచుఁ గాలదష్టులైనవారిచందంబున మంత్రంబులచేతనుం దెలివిగనక తృష్ణావిషమూర్ఛితులై సర్వంబును గనకమయంబుగఁ దలంపుచు శ్మశానవహ్నులపోలికి నతిరౌద్రభూతులై, తిమిరరోగులభంగి న దూరదర్శులై మెలంగుచు వ్యసనశతంబులకు లోనయి వల్మీకతృణాగ్రసంస్థి

తంబగు జలకణంబునుంబోలెఁ బతనోన్ముఖంబగు నిజస్థితిఁ దెలియం
జాలక. 127

వ. మఱియు. 128

సీ. జూదమాడుటయే వినోదం బటంచును
బరసతీ గమనమే ప్రౌఢియనుచుఁ
బానగోష్ఠియె తలంపఁగ విలాసమటంచు
రహిఁబ్రమత్తతయె శౌర్యంబటంచు
స్వతరుణీత్యాగ మ వ్యసనిత్వ మగునంచు
స్వచ్ఛందతయె ప్రభుత్వంబటంచుఁ
బరిభవంబోర్చుటే నిరుపమక్షమ యంచు
గణికారతియె రసికత్వమనుచు
తే. మసలుచును దారు తలపోయ మనుజులయ్యు
నిర్జరాంశావతీర్ణులై నెగడినట్టు
లెంచుకొని వేల్పులొనరించు కృత్యములను
జేయుటకుఁబూని నగుబాటుఁ జెందుచుంద్రు. 129

తే. కొలువులోఁగాని ముచ్చటల్ సలుపరయ్యెఁ
దలఁతురు నిజాజ్ఞయె వరప్రధానమనుచుఁ
దాము దర్శనమిడుట సైతము సనుగ్ర
హంబుగఁ దలంతురే కదా ! యవనిపతులు. 130

క. బుద్ధులు తప్పిన నుడులని
పెద్ద లెఱింగించు నుడులు వినకుండగఁ దా
రెద్దులవలె మహిఁ దిరుగుదు
రద్దిర! మముఁ బోలవశమె యన్యులకనుచున్. 131

ఆ. అతని గౌరవింతు, రతనితో భాషింతు,
రతని కీర్తు రెద్దియైన నతనిఁ

జె.తు, రెవఁడు తమ్ము వినుతింపుచు న్వెంటఁ
దిరుగుచుండు నెపుడుఁ దెలుపి లేక. 132

సీ. ఏనరేంద్రులకు నిర్ఘృణమగు కౌటిల్య
నర్థశాస్త్రము ప్రమాణార్థ మగునొ,
నరనాయకసహస్ర పరిభుక్తి నిర్ముక్త
మయినట్టి భూమిపై నాసబుట్టె
నతిఘోర మగు మారణాత్మకశాస్త్ర స
ద్వితతి నేర్చుటయందు వేడ్కపుట్టె
నిజమైన ప్రేమచే నెగడు సహోదరు
లరయ సముచ్ఛేద్యు లగుచుఁబరఁగెఁ

తే. బరుల వంచించు నిపుణులే గురువులైరొ
పాపశీలురు, పరసతీప్రవణు, లధిక
దుష్టబుద్ధులు మిత్రులై తోఁచునట్టి
నేలఱేఁడులతో మన కేల వినుము. 133

సీ. జనులచే నగుబాటు గనకుండ, సాధుల
చేత నెయ్యెడ నిందఁ జెందకుండ,
సూరులచే వ్రేలు జూపించుకొనకుండ,
గురుజనధిక్కృతుల్ వొరయకుండఁ
జెలులచే దూషణంబులఁ గాంచకుండంగ,
విటులచే గేలిఁ గల్పించుకొనక,
కుశలులచే నవ్వు గూర్చించుకొనకుండ,
విభవంబుచే విఱ్ఱవీఁగకుండఁ,

తే. జెనటి కూళలచేత వంచింపఁబడక,
విషయముల పాలుగాకుండ, వెలయుమయ్య!
ధీరుఁడవు తొల్లినుండి యదియును గాక
చదివితివి తండ్రికతన శాస్త్రములనెల్ల. 134

తే. తరళమతులకు విజ్ఞానవిరహితులకు
మత్తుఁ గల్పించుచుండుఁగా విత్తచయము,
త్వద్గుణోద్భూతమైన సంతసము నన్నుఁ
బ్రోత్సహింపుచునుండె సద్బుద్ధిఁ గఱప. 135

తే. జ్ఞానినైనను విద్వాంసునైన నమిత
సత్త్వునైనను సత్కులజనితునైన
ధీరునైనను గుణినైన శూరునైన
శ్రీరమణి చేరి నీతివిదూరుఁ జేయు. 136

సీ. కాంచుమీ నీతండ్రి కావించు యువరాజ
పట్టాభిషేకవైభవపదంబుఁ
దరతరంబులనుండి తాతముత్తాత లూ
నిన మహీభరముఁ బొల్పార వహింపు
బలియురౌ పగఱకుఁ దలవంపు గూర్పుచు
చుట్టాల కభివృద్ధి నెట్టుకొలుపు
సప్తపాథోరాశిసంవేష్టితంబైన
యిల నెల్ల నీతండ్రి గెలిచి యున్నఁ
తే. గాని యువరాజపట్టంబు నూని నీవు
మరల గెలువంగ వలయు నీ ధరణినెల్ల
నీకుఁ దఱి యిది ప్రతాపంబు నెఱపుటకు న
టంచు శుకనాసుఁ డింత వచించి యుడిగె. 137

చ. పలుకక యూరకున్న నరపాలసుతుండు నమాత్యుఁ డన్న య
ప్పలుకుల నిర్మలుం డయినభంగి, నలంకృతుఁడైన యట్లుఁ, బూ
తలఁ గనినట్లుఁ, బూతుని విధంబున నుజ్జ్వలుఁడైనమాడ్కి న
ర్మిలి నభిషిక్తుఁడైనటులఁ బ్రీతి వహింపుచు నేగె పీఠికిన్. 138

సీ. అంతటఁ గొన్ని నాళ్లరుగంగ శుకనాసు
తోడఁ బురోహితుతోడఁగూడి
నరనాయకసహస్ర పరివృతుండైన తా
రాపీడుఁ డౌత్సుక్య మేపుమిఱ
సర్వనదులనుండి సర్వతీర్థంబుల
నుండి సాగరములనుండి యును, స
మానీతమై, లసన్మణుల నోషధులను
సర్వఫలముల మిశ్రంబు నగుచు

తే. నిగమపరిపూతమగు నీట నించినట్టి
కనకకలశంబులం బూని కౌతుకాశ్రు
బిందువులు రాలుచుండఁ దన్నందనునకు
మహితగతిఁ జేసె నభిషేకమంగళంబు. 139

తే. మంగళజలార్ద్రదేహుఁ గుమారుఁ జెందె
విడక తారాపీడు, నేర్పడఁగ మొదలి
మ్రాను విడకుండనే బెఱమ్రానిపైకిఁ
బ్రాఁకులతఁబోలె వడినేగి రాజ్యలక్ష్మి. 140

సీ. తరువాత సకలశుద్ధాంతకాంతావరీ
వృతయుఁ బ్రేమార్ద్రహృదయజలజ
యుతయు నైన విలాసవతి వచ్చి సుతుమేనఁ
జంద్రికాధవళమౌ చందనంబుఁ
బూసి యాఁదలఁ దెల్లపూ వొండు గీలించి
యబ్జారిబలెఁ దెల్లనయిన పట్టు
పుట్టములం దొడ్గఁ బొలుపుగ గోరోచ
నంబు శోభిల్ల దేహంబునందుఁ

తే. దండ్రి తనప్రోల వేత్రంబుఁ దాల్చి నడువ
భద్రలీల సభామండపమున కరిగి
కుముదమిత్రుండు మేరుశృంగమునుఁబోలెఁ
బసిఁడిగద్దియ నెక్కె భూపాలసుతుఁడు. 141

సీ. సింహాసనం బెక్కి క్షితిపులచే సర్వా
గతుల సన్మానముల్ గాంచినంత
జలరాశి మంథరాచలఘాతములఁబోలె
ధరణి నిర్ఘాతపాతములఁబోలెఁ
దగ లయాబ్దము తటిద్దండాహతులఁబోలె
నాదివరాహ ఘోణాభిహతులఁ
బాతాళకుక్షికై వడి నక్కులువులోనఁ
దపనీయదండఘాతములకతన

తే. నధిపతనయుని దిగ్విజయప్రయాణ
సూచకం బౌచు సమ్మదాశ్రులు చెలంగ
లీలఁ బ్రస్థానదుందుభుల్ గ్రాలె నచటఁ
జెవుడు గల్పించుచుం గర్ణవివరములకు. 142

సీ. పాతాళతలమున పడఁకు చిల్వలజేని
పడగలతోఁ జెల్మి నడుగునట్లు
హరిదంతరముల దిక్కరులు దంతము లెత్తి
యెలమి రమ్మని పిల్చి వెలలునట్లు
గిరిశు నవ్వఁగ హుంకృతిసేయు శంకరు
నెద్దుతోఁ బలుకంగ నేగునట్లు
లహరంజికొండపై నలరు చౌదంతితోఁ
జెల్మివాటింప వేంచేయునట్లు

తే. వెలయ యమసదనంబునఁ జెలఁగుచున్న
జమునిమహిషంబుచే వందనములఁ గొనఁగ
నరిగె నన దిక్పతులగుండె లవియఁ జేసి
త్రిభువనంబుల నాౘ్రమోఁత దీటుకొనియె. 143

తే. అట్టి నిస్వన మాలించి యచటనున్న
సకలజనులును జయ జయ జయ యటంచు
నొసర ఘోషింప గద్దియనుండి పగఱ
సంపదలతోడ నృపసూతి సంచలించె. 144

సీ. తెలిపూలమొగ్గ లింపొలయఁ జల్లెడు కల్ప
తరులతోఁ బారిజాతంబుఁబోలెఁ
దొడరి దానోదబిందువుల వర్షించు ది
గ్దంతులతో నింద్రుగజముఁబోలెఁ
దారాగణంబు లింపారఁ జల్లెడు దిగం
తరములతో వియత్తలముఁబోలె
స్థూలంబులైన బిందువులఁ గురియు మేఘ
వితతితో జలధరవేళఁబోలె

తే. సరభసం బొప్పఁగా లేచి చైత్రయాత్ర
లందుఁ జల్లెడు లాజలో యనఁగ మౌక్తి
కములఁ జల్లెడు నరవరోత్తములతోడ
వెలలెఁ జంద్రాపీడుఁ డర్కోౘలువునుండి. 145

సీ. యానంబునకు నర్హమగు భూషణంబు ల
లంకార మొనరించి లలితరీతి
మావటీఁ డొకఁడు దంతావళంబును ససం
భ్రమమునఁ దేర భూపాలతనయుఁ

డుందుపైఁ బత్రలేఖాన్వితుండై యెక్కి
పంక్తికంధరదోర్విభాసమాన
మగు రౌప్యభూధర మనుటకుం దగి మౌక్తి
కస్రజంబులఁ జాలఁ గ్రాలుచున్న

తే. గొడుగు తనమీఁదఁ బసునెండ నడఁచుచుండ
సరస వందిజనుల్ బరాబరులొనర్ప
నిమ్మ మీఱుచు దిగ్విజయమ్మొసర్ప
సైన్యములతోడఁ గదలె రాజన్యవరుఁడు. 146

తే. మణుల నిండిన హాటకమండనములఁ
దనరుచున్నట్టి యింద్రాయుధంబు వెంట
రా వలాహకుఁ డాఖ్య లేర్పడగఁ దెలుప
వారల నతులంది చనెఁ దొల్తఁ దూర్పుదిశకు. 147

సీ. ఇట్లు చంద్రాపీడుఁ డిలునుండి కదలుచోఁ
బయనంబునకు నర్హ భంగి రుచిర
ధవళదుకూలముల్ ధరియించి శిరమునఁ
బూవును నెమ్మేనఁ బూఁత లమర
బలములుం బార్థివప్రకరంబులున్ వెంట
నేతేరఁ జారుసితాతపత్ర
ధారియై మంత్రికుమారుండు రెండవ
యువరాజుకైవడి నొప్పుమీఱి

తే. త్వరితగమనంబు గలయట్టి దంతిరాజు
నెక్కి చంద్రాపీడుసమీపమునకుఁ
జేరి సరసీరుహాప్తుని చెంతనున్న
కలిమిచెలికూర్మితమ్ముని కరణి నమరె. 148

తే. అంత నిటనిట యువరాజటన్న నుడుల
వించు జను సేనలంబుట్టు ప్రేఁగుకతనఁ
జలితకులశైలకీలిత జలధిజల త
రంగగత మనఁగాఁగ ధరాతలంబు. 149

సీ. మానవేంద్రతనూజుఁ డైన చంద్రాపీడు
నడుగునఁ బడి మ్రొక్కి లిడి యిటునటుఁ
జరియించు వసుమతీవరుల మౌళులనున్న
వరకిరీటముల నేర్పడిన రుచుల
తోడ నంగదసముద్భూతకాంతులతోడ
సరవిగ నొకమూలఁ జామరజ
చూర్ణముం జల్లినచొప్పున, నొకమూల
నెమిలికన్నులగుంపు లమరినట్లు,
తే. సారతరుపల్లవముల నిండారినట్లు
లొక్కమొఁత, నొక్కచోటఁ బమోదగము
విండులన, నొక్కచోట లేమ్రొండగముల
తోడ నిండినయటు దిశల్ తోఁచెఁ బదియు. 150

క. సురుచిరమణిగణభవమగు
కిరీటముల కాంతి మీఁదికిం జన ధరణీ
వరుల వెలిగొడుగుముత్తము
కర మమరె మయూరబర్హకలితం బనఁగన్. 151

సీ. పొలిచె నత్తటి మహీతల మశ్వమయ మనఁ
గరిమయం బనఁగ దిక్చక్రవాళ
ము మరె గొడ్డులమయం బన నాకసం బొప్పె
ధ్వజమయంబనఁగ నంబరము తోఁచెఁ

బొదలె గాడుపు కరిమదగంధమయ మన
నృపతిమయంబన నృష్టి దనరె
మౌళిమయంబనం గ్రాలెను రవికాంతి
దినము చామరమయం బనఁగ నెగడె
తే. నాభరణ గణకాంతిమయం బనంగ
నలిఁ జెలంగెను నవలోకనంబు మఱియు
జగము లెల్లను జయజయ శబ్దమయము
లగుచుఁ గన్నులపండువు లగుచు బరగె. 152

క. బలముల కోలాహలమున
కులికినవో యనఁగ దిక్కు లొగిఁ బది యును ని
ర్మల కేతనాంశుకములకు
వలనొప్పఁగ మఱుఁగుసొచ్చి పాఱెన వెటకో. 153

సీ. హైన్యమా భూరజం బంటున స్ఫటి చేఁ
బలె మిన్ను కడుదప్పఁ బాఱిపోయె.
రవికిరణములు వేత్రముల కోడినయట్లు
ధూళిధూసరమైన త్రోవఁ దొలఁగెఁ
గరిమదజలములం గని యుల్కిన ట్లొండ
గొమగులు మరలింప నడఁగె దినము
గరిపదహతుల దుర్భర సైన్యభరమున
నదరి భేరియనంగ నవని మ్రోసెఁ
తే. దఁరగముఖపత త్ఫేనబంధురముఁ గరిక
పోలగళితంబు నగుచు మోఁకాలిబంటి
దనరు మదసలిలమునఁ బదాతిగణము
స్ఖలితగతి సంచరింపంగఁ గడఁగె నంత. 154

తే. సైన్యములరవళి, వాజిహేషలును, జనస
మూహకోలాహలంబులుం, గాహళధ్వ
నులును, డిండిమములమ్రోఁత లొలయఁబర్వి
భువనసముదాయమునకెల్ల మూర్ఛఁ గూర్చె. 155

వ. తత్సేనాసముదయంబుల నెగసిన పరాగం బనేకవర్ణంబులం గాలి యొకచో నృహరిసటాసంకాశంబై, యొకచో మృణాళదండధవళంబై యొకచో రల్లకరోమమలినంబై, యొకచో శంకరవృషభరోమంథ ఫేనపాండురంబై మఱియును, మందాకినీప్రవాహంబునుంబోలె హరి పదసంజాతంబై, క్రుద్ధుండునుంబోలె క్షమను బరిత్యజించి, తృష్ణాధి కుండునుంబోలెఁ గరికరశీకరసలిలంబులం గ్రోలుచుఁ, బక్షవంతుండు బోలె గగనంబున కెగురుచు, మధువ్రతప్రతతియుంబోలె మదలేఖం జుంబింపుచు, ప్రాప్తవిజయుండునుంబోలెఁ బతాకంబులం బరిగ్రహిం పుచు, జరాగమనంబునుంబోలె శిరంబులం దెలుపు జేయుచు, నుత్పాత రాహుమండలంబుం బోలె రవిమండలంబుం గబళింపుచు. 156

సీ. త్రైలోక్యపూజ్యయౌ రాలచ్చి నెమ్మేన
సొబగొందు పటవాసచూర్ణమనఁగ
విమతుల గొడుగులన్ వెలిదమ్మికిట్టకుఁ
బ్రళయవేళాతుషారంబనంగ
దినానాథుకిరణాళి యను పద్మవిపినంబుఁ
గాసిఁ జేసెడు గజౌఘంబనంగ
బలభరంబున కెద నులికిన ధరణికిఁ
గలిగిన మూర్ఛాంధకారమనఁగ

ఆ. మిన్నునుండి జాఱుచున్నట్లు, దిక్కుల
నుండి బయలు వెడలుచున్నయట్లుఁ
దనరుచున్నయట్టి తద్బలోద్గతధూళి
మూఁడులోకములను ముంచి మెఱసె. 157

సీ. వెలిపట్టుపుట్టంబు బలెనొప్పు చదలేఱు
కలుషత్వమందెను గదళివోలె
మహిమేగె ధూళిదంభమున మింటికి వ్రేగు
సురలకు నెఱిఁగించుకొఱకుఁబోలె
విమలరజు బంటి విన్నొప్పెఁదెలినీటఁ
భాసిల్లు కువలయవనముఁబోలె
ధూళిఁ గ్రుంగిన యట్టి ద్యుమణి వెల్వెలఁబాఱె
మాళిపై నిడిన చామరముఁబోలెఁ
తే. బుడమియెల్ల మహాకాలముఖమనంగఁ
బ్రళయవేలాపయోరాశి జలమనంగ
నంబుజనిలోచనుని యుదరంబనంగ
దనరె నతిభయంకరలీలఁ దత్క్షణమున. 158
కం. ఘనమగు తద్రజమడఁగిన
జననాథతనూజుఁడైన చంద్రాపీడుం
గని వైశంపాయనుఁ డి
ట్లనఁ గడఁగె నితాంతవిస్మయాకులమతియై. 159
వ. యువరాజ! చంద్రాపీడ! 160
సీ. రాజాధిరాజు తారాపీడుఁ డేవంక
విజయంబుగాంచక విడిచిపెట్టె
నేమణుల్ వానికధీనముల్ గాకుండె
నేదుర్గములను జయింపకుండెఁ
జతురర్ణవీపరివృతధాత్రినతనికి
వసము గాకుండినదెసలు గలవె
కేల్దోయి నొసలిపైఁ గీలింపరెవ్వారు
ప్రణతిగావింపని ప్రభువులెవరు,

ఆ. విసరుచుందు రెవరు వింజామరములూని
వేత్రపాణులగుచు వెలయు రెవరు
ప్రణతిసేయు రెవరు వరమౌళిగతమణుల్
పాదనఖములందుఁ బ్రజ్వరిల్లి. 161

కం. భరత భగీరథ నల పం
క్తిరథప్రతిమంబు భూపతిప్రకరము నీ
చరణము లభిషేకపయః
పరిపూతములన్ భజింపఁ బొల్పడెఁ గనుమా. 162

ఆ. వీరలెల్ల మున్ను పృథ్వీభరంబును
దాల్చినారు పర్వతంబులట్లు
వీరి వెంట నిచట నిడిసిన వాహినీ
కోటులెపుడు నిన్నుఁ గొలుచుచుండు. 163

కం. లలితైలాపరిమళసుర
భిళమగు కరిమదజలమున వెసఁ దోఁచిన భూ
తలము మఱేఁ, దపనసుతా
జలోర్మిగతమైన మధుపసముదయ మనఁగన్. 164

తే. కుముదధవళంబులగు టెక్కియములగములు
వాహినీభారసంక్షోభ భయముకతన
నడరి దిక్చక్రవాళంబు నాక్రమించి
పొదలె వినువీధి కెగసిన నదులనంగ. 165

తే. సకలకులశైలసంధులున్ జాటి పెక్కు
గతుల నీధాత్రిపతియును గాకయున్న
జలితమగు నెవ్విధంబునఁ జిలువఱేని
పడగ లవనీభరోద్వృత్తి నడఁగి యుండి. 166

తే. ఎలమి మంత్రిసుతుఁ డిట్లు పలుకుచుండ
ధవళమంటపశతసముజ్జ్వలము నైన
భవనమున కేగి యాతఁ డశ్వంబుడిగ్గి
రాజు కైవడి నిఖిలకార్యముల నడపి. 167

తే. అవనివిభులును మంత్రిపుంగవులుఁ దెలుపు
వివిధకథలను వినుచుఁ దద్దివసశేష
మతఁడు గడపెను నూతనపితృవియోగ
సంప్రభూతార్తి తనమది సందడింప. 168

తే. మంత్రిసుతుఁ డొక్కపాన్పునన్, మహీతలమునఁ
బఱచినతివాసిపై నొక్కవంకఁ జిత్ర
లేఖయుఁ, బరుండ నెడఁ బవళించి ఱేని
కొడుకు వేగించె నారాత్రిఁ గూర్కఁగనక. 169

సీ. ఉదయంబునన్ లేచి యుర్వీవరాత్మజుం
డమితంబులైన సైన్యములఁ గూడి
ధరణినూగింపుచు గిరులఁ గంపింపుచుఁ
బిండిచేయుచు నెల్ల విపినములను
దుర్గవ్రజంబెల్ల దుమ్ముగాఁ జేయుచుఁ
బరపి పూడ్పించుచుఁ బల్లములను
నున్నతస్థలముల నొగిఁ జక్కఁ జేయుచు
చెదరంగఁ జేయుచు నదులనెల్ల

తే. సరసి రక్షింపుచును శరణాగతులను
జేయుచున్ భూవరుల కభిషేకములను
నిజజయాంకంబులెల్లెడ నిలిపికొనుచు
శాసనంబులవ్రాయు చిచ్ఛాప్రవృత్తి. 170

తే. మణులఁగూర్చుచు మునులకుఁ బ్రణతులిడుచు
నగ్రజన్ములకెల్లను నర్చలిడుచు
జనులకుం బ్రీతిఁగూర్చుచు ఘనయశంబు
గాంచు చతఁ డీజగంబెల్ల సంచరించె. 171

తే. తొలుతఁ జంద్రాపీడుండు గెలిచెఁ దూర్పు
దెసను, బిమ్మట దక్షిణదిక్కు గెలిచె,
నంత సాగరవిభుదిశ నాక్రమించె,
నుత్తరముఁ గెల్చెఁ దరువాత నుత్సుకమున. 172

క. అతఁడున్ సప్తద్వీపా
వృతక్ష్మా చతురర్ణవపరీతాఖిలభూ
మితలం బెలమిన్ వర్ష
త్రితయంబున గెలిచి సంచరించెం గలయన్. 173

తే. లోకములనెల్ల నిర్జించి యాతుమారుఁ
డఖిలమహికిఁబ్రదక్షిణ మాచరించి
యరిగె నొకనాఁడు కైలాసగిరి కుఱంగట
నెగడిన సువర్ణపురమను నగరమునకు. 174

వ. పూర్వసముద్రంబునకుం బ్రాంతంబున హేమజటనామకులగు కిరా
తుల నివాసస్థానంబైన యన్నగరంబును జయించి, యచటఁ జంద్రా
పీడుండు సర్వసర్వంసహాసంచరణఖిన్నంబైన నిజసైన్యంబునకు
విశ్రాంతికారణంబుగాఁ గొన్నిఘస్రంబులు విశ్రమించె నంత. 175

సీ. నృపసుతుం డొక్కనాఁ డింద్రాయుధంబెక్కి
వేఁటకై చని యొక్కవిపినవీథిఁ
దగిలిచరింపుచో దైవవంశంబునఁ
గనియెఁ డా నద్రిశృంగముననుండి

క్రిందికి దిగుచున్న కిన్నరమిథునంబుఁ
గనినంత వారిఁ గన్గొను కుతూహ
లమ్మున నింద్రాయుధమ్మును గదువడి
నెలమిఁదోలుచుఁ దత్సమీపమునకు

తే. నేగుదెంచెను నొంటిఁ బదేనుయోజ
నంబు లంతటఁ దన్మిథునంబు శైల
మెక్కెఁ జంద్రాపీడుండు నెక్కి వారిఁ
జూడ వెదకియు నచ్చోట జాడఁగనక. 176

క. ఒడలెల్ల స్వేదజలమున
నెడఁదడిసిన తనను జూచి యింద్రాయుధముం
బొడగాంచి తనకతమున
న్వడరం దురగంబుడిగ్గి యతఁడిట్లెంచెన్. 177

సీ. పసిబిడ్డపోలిక బాధపెట్టితిఁగదా
వ్యర్థంబుగాఁగ మదాత్మనిపుడు
కిన్నరయుగళం బొగిన్ నాకుఁదోచినన్
లలిఁ దోఁపకుండినన్ లాభమేమి ?
చిక్కెనుబో దీనఁ జేకూరునదియేమి
చిక్కకుండిననేమి చేటుమూడు
నామూర్ఖపద్ధతి నేమందునక్కటా !
భ్రమయేఁలపుట్టెఁ దుచ్ఛములయందుఁ

తే. గొంకులొందించు పనులపైఁ గోర్కెయేమి ?
తలఁపిదేమి నిరర్థకార్యములయందుఁ ?
జేసినదియెల్ల భగ్నమై చెల్లిపోయె
భావికార్యంబు విఫలమై పరిణమించె. 178

తే. అడఁగెగద మిత్రకార్యంబు నటుమఁదగిలి
గురులకార్యంబుఁ గానదు పరిసమాప్తి
భువనవిజయంబునుఁ దుదిముట్టదయ్యె
నక్కటా ! యొంటి నిచ్చోటఁ జిక్కియుంటి. 179

తే. పరిజనంబులఁ దొఱఁగి మీఁ దరయకుండ
నింతదూరంబు నేను రానేల ? యకట
యొనరవచ్చితిఁబో నిష్ప్రయోజనముగ
వాజిముఖదంపతులఁజూడ వచ్చుటేమి ? 180

సీ. అనియిట్లు చింతించుకొనునంత నిజముగ
నవ్వ నాలో నాకు నివ్వటిల్లె
నెఱుఁగనేరనుగదా ! యెంతదూరంబున
నిలచియున్నవియొ నాబలములిపుడు
నెంచ మదశ్వమీ యింద్రాయుధమ్మని
మేషంబునం గడు మేఱఁబోవు
నరుదెంచునపుడుఁ దత్తురగాస్యమిథునంబుఁ
బఱికింపుమం ద్రోవ నరయనైతి

తే. నరయ నిట నా కొగి సువర్ణపురమునకును
ద్రోవఁజూపించువాఁ డెవ్వఁ డీవనమున ?
నవనికి సువర్ణపురము సీమాంతలేఖ
యదియు నుత్తరమున నున్నదనఁగవింప. 181

వ. ఆసువర్ణపురమునకు నావల జనరహితంబగు నరణ్యంబనియు, నయ్యది గడచినం గైలాసపర్వతంబనియుఁగూడ నేను వినియుంటిఁ గైలాసమిదిగో ! యిటనుండి కదలి దక్షిణదిశ నాశ్రయించి మార్గంబు నరయుచు, నొంటిమై బోవలసియున్నది. స్వయంకృతంబులగు దోషంబుల ఫలంబులఁ గుడువకపోవచ్చునే యనుచు నిశ్చయించి వామకరంబునం గళ్లెంబు లాగుచు నత్తురంగంబును మరలించెనంతట. 182

సీ. వాసరశ్రీమేఖలాసక్తమణివోలె
లలి, రవి మధ్యమలంకరించె
నంతయు నలసి, యాయింద్రాయుధము, లేఁత
కసవుమేసె నొకింత కాన దీని
ముదమున గొనిపోయి నదియందునంగాని,
సెలయేటిలోఁగాని, కొలనఁగాని,
నీరంబు ద్రావించి నిర్గతశ్రమునఁజేసి
నేనుఁగూడ నొకింత నీరుఁద్రావి
తే. యేదియేఁ జెట్టుక్రింద నొకింతసేపు
బడలికలఁ దీర్చుకొని మీఁద వెడలవచ్చు
ననుచుఁ దలపోసి జలముల నరయుచుండి
యటునిటుంజూడ్కిఁ బరపుచుఁ నతఁడుఁదిరిగి. 183

సీ. చూచె నాతఁడొక్కచో సరోవరముల
సలిలంబులం గ్రుంకి చనినయట్టి
యేన్గులపదముల నెనసిన బహుళమ
ర్దమకర్దమమ్మునఁ దడిసినదియుఁ
గరములం బెకలింపఁ గాడతో నూడిన
తమ్ములఁ గల్మాషితంబునగుచు
నొక్కింత తడిగల్గియున్న శైవాలముం
జరు లసితత్వంబు సంఘటింప
ఆ. నడుమ జాఱియున్న నలినకైరవకుట్మ
లములతోడఁ జాలఁ గొమరుమీఱి
లలితవకుళపుష్పకలితసౌరభమైన
మదజలంబుతోడఁ బొదలుత్రోవ. 184

వ. చూచి యటఁ గొంత జలాశయంబులు నిశ్చయించి చనిచని యత్యు న్నతంబులై యుపరిభాగంబున ఛత్త్రాకారంబుగఁ దోచుచున్న సరళ సాలసల్లకీప్రముఖంబులగు భూరుహంబుల నొప్పారుచు, వనకరులు దంతంబులం బొడిచియైన మనశ్శిలాధూళులం ధూసరవర్ణమునఁ దన రుచు, గుగ్గులుద్రుమంబులనుండి ప్రసరించు రసంబునఁ దడిసినప్రస్తర నిసరంబుల నెసంగుచు, సైకతనిమగ్నంబులగు చమరకస్తూరికా మృగీశఫరసందోహంబునం జెలంగుచుఁ, జకోరయుగళంబులతోఁ సొబగొందు శిలాతలంబులం గ్రాలుచున్న యాకైలాసప్రాంతంబున నుండి కొంతమేర చని యారజతగిరికిం బూర్వోత్తర దిగ్భాగంబునఁ నొక్కచో జలభరంబున నలసిన వారివాహవ్యూహంబునుంబోలె, నొక్కచోఁజేర్చిన కృష్ణపక్షాంధకారంబునుం బోలె నొప్పునొక్క ధాత్రీరుహవ్రాతంబు నవలోకించి. 185

చ. అలరుఁలతావులం గొనుచు నల్లన వారితరంగసంగతిం
జెలువగు మందమారుతనుచేఁ దగఁ గౌఁగిలిఁగన్నయట్లు ని
ర్మలవికచారవిందమకరందము గ్రోలినహంస లేర్పడం
గలరవ మొప్పఁ బిల్చెననగాఁ దరుషండము సొచ్చె నాతఁడున్. 186

సీ. అరిగి తత్తరుసమూహంబునందుఁ ద్రైలోక్య
రమకు మాణిక్యదర్పణమనంగ
వసుమతీదేవికి స్ఫటికభూగృహమన
లలి, హరిత్తులపాలుదలయనంగ
ద్రవముగా బరఁగిన రజతాచలమనంగ
నవని వ్రాలినతుషారాద్రి యనఁగ
రసముగఁ దోచు చంద్రప్రభాచయమన
నంబువైన శివాట్టహాస మనఁగఁ

తే. త్రిజగతీపుణ్యరాశి యీరీతిగాఁగ
సరసియై యుజ్జగంబునఁ వరలెననఁగ
సరయు సలిలాకృతివహించి ధరణిమీఁద
నొప్పు వైడూర్యనగపంక్తియో యనంగ. 187

క. మునిజనచిత్తరంబుల స
జ్జనగుణముల మౌక్తికాంశుసంతానము లం
గొని దీనిం గల్పించిన
యనువునఁ గనుపట్టు నిర్మలాకృతినుంటన్. 188

తే. నిర్మలజలౌఘములతోడ నిండియున్న
నైన నంతర్గతంబు వృత్తాంతమెల్లఁ
దెల్లముగ నెల్లవారికిఁ దెలియుచుంట
నిర్జలక్షోణియుంబోలె నెగడుదాని. 189

తే. అభవుఁ డేతెంచి తమిఁ దానమాడునెడల
మౌళిగతచంద్రగళిత సుధాలవముల
వామ సుకపోలగళితలావణ్యపూర
మునను సమ్మిశ్రమగునీటఁ దసరుదాని. 190

వ. మఱియునుం దీరంబుల నంజనగిరిసంకాశంబులగు తమాలవనంబులంతర్భాగంబునం బ్రతిబింబింపఁ బాతాళద్వారంబులుబోలెఁ జెన్నడరు జలభాగంబులచే గంభీరంబగుచు, నిరంతరంబు సప్తర్షిమండలంబొనరించుస్నానంబులచేఁ బవిత్రంబైన యుదకంబునఁబొదలుచు, జలకేళు లొనరింపనేగుదెంచిన కుబేరశుద్ధాంతకాంతల కమనీయంబులగు నాభిమండలంబులం గ్రోలినజలంబుల నలరుచు, నొక్కయెడఁ గల హంసపరీతంబులైన వికచకమలవనషండంబుల మీఱుచు, నొక్కయెడ దిక్కరులు వారివిహారంబులొనరింపఁ జీకాకువడిన మృణాళదండంబుల నింపారుచు, నొక్కచో మకరధ్వజంబుపోలికి మకరాధిష్ఠి

తంబై, దివ్యంబునుంబోలె ననిమిషలోచనరమణీయంబై, భుజగకులం
బునుంబోలె ననంతశతపత్రపద్మోద్భాసితంబై మఱియు, 191

సీ. శౌరి నా, మీన కచ్ఛప పద్మచక్ర ప్ర
కటలక్షణంబులు గలుగుదాని
రహిఁ బాండు ధార్తరాష్ట్రికుల పక్షక్షోభి
తమయి భారతమన నమరుదాని
క్షీరాబ్ధిమథనానుకృతిఁ దీరశిఖికంఠ
పరిపీతవిషమయి పరలుదాని
సలలితమలయమేఖలఁబోలెఁ జందన
శీతలవనములఁ జెలఁగుదాని

తే. క్రముకచయుగమున ననేకశతనాగ
పీతసుక్షీరములు గల్గి వెలయుదానిఁ
గనియె నచ్ఛోదమను పేర దనరు సరసిఁ
బొలుపుమీఱంగ నారాజపుంగవుండు. 192

సీ. కనినంతనే మనంబున మున్నువొడమిన
యలసట మలఁగ నిట్లనితలంచె
దురగాస్యమిథునానుసరణంబు నాకు ని
ష్ఫలమయ్యె నిదిగంట సఫలమయ్యెఁ
జూడంగఁ దగిన వస్తువులఁగాంచుఫలంబు
కడముట్టెఁ గద నేఁడు కన్నుఁగవకు
రమ్యంబులగు పదార్థముల కంతముఁ గంటి
నాహ్లాదవస్తుల కవధిఁ గంటిఁ

తే. ప్రీతిజనకంబులగు వస్తుజాతములకు
నంత్యభాగంబు ప్రత్యక్ష మయ్యె నేఁడు
చూచితి విలోకనీయవస్తులకు హద్దు
నందమగువస్తువుల కెల్ల నవధిఁ గంటి. 193

సీ. మున్నీసరోజలంబును సృష్టిగావించి
విధి సుధారసమునాపిదపఁ జేసె
నమృతంబుపగిది నియ్యదియు సర్వేంద్రియం
బులకును నత్యంతముదము గూర్చు
నైర్మల్యముననుఁ గన్గవకుఁ బ్రీతిఘటిల్లె
శైత్యంబు గల్పించె స్పర్శసుఖము
కలహంసరవములం గర్ణముల్ ముదమందె
నలినగంధమునకు నాసమెచ్చె

తే. దీనిఁ గన్గొనఁదలఁచి కదా ! నిరంత
రంబు శివుఁడు కైలాస నగంబుమీఁద
విడక వసియింపుచున్నాఁడు వేడ్కతోడ
నిట్టి కాసార మున్నదే యెచటనైన. 194

తే. ప్రళయసమయంబులందున జలధరౌఘ
మీసరోవారిఁ గైకొనియే నితాంత
భీకరంబుగ దుర్దాంతవృష్టిఁ గురిసి
నీటిపై లీలఁ దేలించు నిఖిలజగము. 195

తే. వేలుపులపెద్ద సృష్టిఁ గావించునపుడు
తొల్లి బ్రహ్మాండరూపంబుఁ దోయమయముఁ
గాఁగఁ జేసిన జగములొక్కెడఁ జేరి
యీసరోవరమయ్యెనం చేఁ దలంతు. 196

సీ. ఈరీతినెంచుచు నే శిలాఖండ క
ర్కశమైన యిసుకచేఁ గ్రాలునదియు
నెస నరుంధతి రవి కిడు నర్ఘ్యజలబిందు
వులఁ బొల్చు తమ్ముల నలరునదియు

బ్రాహ్మ్యాదిమాతృవర్గపవిత్రమ్ముమచర
ణారుణాంభోజగణాంకితమును
యక్షాంగనాపూజితానేక నిర్మల
చారుసైకతలింగసంకులమును
ఆ. నగుచు సొంపుమీఱు నచ్ఛోదసరసికి
దక్షిణంపుదిశ కతండు నేగి
యెలమి హయము డిగ్గి యింద్రాయుధము మేన
నొప్పుసొమ్ములెల్ల విప్పివైవ. 197
సీ. ధరణిపై నవ్వాజి పొరలి దిగ్గనలేచి
వెస నట నొక్కింత కసవుమేయ
గట్టంబు సంత నక్కొలనిలోనికిఁ దోల
నిచ్చచొప్పునఁ జరియించి యదియు
నీరుఁ గ్రోలినయంతఁ దీరమెక్కఁగఁ జేసి
బంగారుగొలుసుతోఁ బాదయుగళి
బంధించి తత్సమీపమునఁ గల్గినయన్య
తరుశాఖకుం గట్టి తగ నతండు
తే. నాసరోవరతీరంబునందు మొలచి
యున్న దూర్వాంకురంబుల నొక్కకొన్ని
గోసి తనకత్తితోడ నాగుఱ్ఱమునకు
మ్రోల నిడి తాను డిగియె సరోవరమున. 198
సీ. తరువాత నాతండుఁ గరచరణంబు లే
ర్పడఁ గడిగికొని సరోవారిలోన
నుడుగణాధీశుని వడువున ముద మొప్పఁ
గుముదంబులం గరాగ్రములముట్టి

సలిలతరంగసంకలితానిలంబుల
నమవుగ ఫణివోలె ననుభవించి
కందర్పశరములం గందినాతఁడువోలె
జలజముల్ బోమ్మ్లన నిలిపికొనుచుఁ
తే. జాతకమువోలెఁ గైకొని సలిలభుక్తి
సింధురమువోలె నాతండు శీకరార్ద్రి
పుష్కరోజ్వలకరుఁడయి పొల్పు మీఱి
తీరమున కెక్కె తత్సరోవారినుండి. 199

తే. లలితకుంజంబునందు శిలాతలమున
శైశిరములగు నలినీపలాశముల ర
చించుకొని సెజ్జగా విశ్రమించె నతఁడు
చెలువెఱుఁగు శిరంబునంగేలుకొలిపి. 200

సీ. విశ్రమించిన యాత వెనఁ దత్సరోవరం
బునకు నుత్తరతీరమున మనోజ్ఞ
తరలీల గీతశబ్దం బొండు వినిపింపఁ
గనవుమేయుట మాని కంఠమెత్తి
శ్రవణద్వయంబు నిశ్చలగతిఁబెట్టి యిం
ద్రాయుధం బాస్వన మాలకింప
వినిమె నాతండు నావెనుక వీణారవ
సమ్మిశ్రమగు మానుషస్వనంబు
తే. వినియు నిర్జనమైన యీవనమునందు
గీతశబ్దంబు బొడముంగ హేతువేమి
యనుచు నాసెజ్జపైనుండి యపుడ లేచి
గీత మేతెంచుదెస నిరీక్షించె నతఁడు. 201

సీ. ఎంతజూచినగీత మేతెంచునచ్చోటు
గడుదూరమగుటచేఁ గానరాక
కేవలం బతఁడు తద్గీతనినాదంబె
యనవరతంబును వినఁదొడంగె
నాగీతవృత్తాంత మరయ వేడుకపుట్టి
తురగంబునకు జీనుఁ దొడిగి దాని
నెక్కి తాఁ గోరకయే వనహారిణముల్
మార్గంబుఁ దెలుప సమ్మదముతోడ

తే. వకుళస ప్తచ్ఛదై లాలవంగకుసుమ
పరిమళోద్భాసితము మధువ్రతవిరావ
బధిరితంబైన కాన కేర్పడఁగ నపుడ
వెడలెఁ దద్గీతశబ్దంబు వెంటనంటి. 202

వ. వెడలి, యట నున్మదపికనికరకబళీకృత రసాలకోమలకిసాలంబుల తోడను, భ్రమ దళికుల జర్జరిత ముకుళంబులతోడను, సముదపుష్పం ధయబృందముఖరిత సహకారకోరకంబులతోడను, జకోరచంచూ పుటచుంబితమరీచాంకురంబులతోడను, అండజకుండఖండిత పిండ ఖర్జూరకుట్మలంబులతోడను, శైలానకల్లోలినీపులిన శీతలభూభాగం బులతోడను సొబగొందుచు, వనదేవతాకరతలంబులుంబోలె నతి సుకుమారంబులైన కిసలయవిసరంబులవహించి జానకీనాయకుబలం బులువోలె నంజననీలనలసంగతంబులును, నభిషేకజలంబులువోలె సర్వౌషధీకుసుమకిసలయసహితంబులును, కుమారులఁబోల్కి భార ద్వాజద్విజోపసేవిత బులును, మహాసమరముఖంబులువోలె బున్నా గసమాకృష్టశిలీముఖభాసురంబులును, భూపాలశయనంబులుంబోలె సింహపాదాంకితంబులును నగువృక్షంబులచే నావృతంబై, కైలాస ప్రత్యంత పర్వతకాంతిచే శోభిల్లుచుఁ జంద్రికాధవళంబును, జంద్ర ప్రభనామధేయంబును నగు శూన్యమైనశివాలయ బుం గనుంగొని,

చ. హరుఁ బఠింప నేగెడుమహాత్ములు దేహములన్ విభూతి నె
క్కరణి ధరింతు రప్పగిది గాలికిరాలిన కేతకీరజం
బుఁరహిఁ బడన్ శరీరమున బోయికనుంగొనె లోని కాతఁడీ
శ్వరు, విబుధాపగాకనకసారసపూజితు లోకవందితున్. 204

సీ. ఆశంకరునకుఁదా నభిముఖాసీనయై
బ్రహ్మాసనంబును బాసకొలిపి
విలయంబుతఱి వెల్లి విరియు దుగ్ధాంభోధి
యలలకై వడిఁ దెల్లనగుచు, సకల
హరిదంతరంబుల నాటిపాఱుచున్న
చిరసమార్జితతపశ్శ్రీయనంగ
నలరారి, యాదితేయాపగాజలములఁ
బోలు దేహప్రభాపూరమునను

తే. చాయతరలీల నెసఁగి, తా శైలములను
భీకరారణ్యములతోడ వెలయుచున్న
యట్టి యాప్రదేశంబున కభయవృత్తి
యొలయఁ గల్పించుచుం దగ వెలయుదాని. 205

సీ. కనరాని తనుకాంతిఁ దనరుటం బటికంపు
టింటిలోపల వసియించినట్లు
పాలమున్నీటిలోపల మగ్గియున్నట్లు
వెలివల్వ మఱుగున నిలచినట్లు
శరదభ్రనికరమన్ తెర వెక్కనున్నట్లు
దర్పణాంతరమునఁ దనరునట్లు
ఘనసారశకలంబు తనువు గాంచినయట్లు
సితకరప్రభ రూపుఁ జెందినట్లు

తే. నమరువానిని, నవరిస్ఫుటాంగకముల
దనరువానిని, బంచభూతములఁ దొఱఁగి
యొక్కధవళగుణంబుతో నొనర సృష్టి
జేయఁబడినదియో యనఁ జెలఁగుదాని. 206

క. వెడవిల్తునొడలు నడఁగఁగ
మృడుకృపకుం దప మొనర్ప మొయికొను రతికై
వడి వెలిమిడిపూఁతల నొ
ప్పడరుచుఁ దెల్లనగుమేన నమరెడుదానిఁ. 207

సీ. హరుహారాళినున్న చందురుఁ జూచి వేడ్క నే
తెంచిన దుగ్ధాబ్ధిదేవి యనఁగ
సైంహికేయుని కుల్కి శంకరు శరణంబుఁ
బూనవచ్చిన చంద్రుమే ననంగ
నవలాత్ము మెడనున్న యంధకారముఁ ద్రోయఁ
దలపోసి దిగిన వెన్నెల యనంగ
మృడుఁడు తాండవ మాడు నెడ నేలపైఁబడి
పొడవును గనిన విభూతి యనఁగ

తే. దేహమూనిన శివువృషదీప్తి యనఁగ
క్షితికి దిగినట్టి యజుతపస్సిద్ధి యనఁగ
భవునిఁబూజింప స్వయముగవచ్చియున్న
కుసుమసముదాయమో యన నెసఁగుదాని. 208

సీ. సత్రపోల్లఁ జరియించి శ్రాంతిఁగై కొనియున్న
కృతయుగలోకేశ కీర్తియనఁగఁ
గలియుగహృతధర్మగతికిఁ జింతింపుచు
విపినంబుపాలైన వేదమనఁగ

నొగి, భవిష్యత్కృతయుగబీజకళకన్న
శతపత్రలోచనాకృతి యనంగఁ
గ్రతుభుజ్నదీపూరరయమున నిలఁబడ్డ
విబుధదంతావళవీథియనఁగ
తే. దశముఖుఁడు పెల్లగించుచోఁ దలఁకు వుట్టి
క్రిందికుఱికిన శివగిరిశ్రీయనంగ
మేనునూనిన మునిజన ధ్యానమనఁగ
లీల నెంతయుఁ జెలువారి గ్రాలుదాని. 209

క. ద్వీపాంతరంబుఁ గనుఁగొన
దీపించెడువేడ్క నరుగుదెంచిన శ్వేత
ద్వీపశ్రీ యన నెంతయుఁ
జూపులకుం బాడువగుడు సొబగగుదానిన్. 210

సీ. పాతాళముఁ దొలంగి వసుధ కేతెంచిన
సర్పనాయకు తనుచ్ఛాయ యనఁగ
నెలమి శరద్వేళ నీక్షింపవచ్చిన
కాశప్రసూన సత్కాంతి యనఁగ
హాలామనోద్ధతి నవనిపై జాఱిన
బలిభిదగ్రజు తనుప్రభ యనంగఁ
గొఱరొప్పు నొక్కచోఁ గుప్పగాఁగూర్చిన
శుక్లపక్షప్రశోభ యనఁగఁ
తే. బాదరసమునఁ గడుగంగఁబడినయట్లు
పాలనురువంటి తెల్లనై గ్రాలినట్లు
నమరి, బిసములఁ గూర్చిన ట్లమరుచున్న
యవయవంబులు గలిగి యొప్పారుదాని. 211

క. హరిదశ్వరథతురంగమ
ఖురములఁ బొడిమైన చుక్కగుమిచూర్ణ మనఁగ
సురుచిరమగు భస్మంబున
వరలుచు మెఱసెడి లలాటపట్టికదానిన్. 212

వ. మఱియు, వియన్నదియుంబోలె నంతరిక్షంబుననుండి దిగినదియు, దీక్షితువాక్యంబునుం బోలె సప్రాకృతమై, నమృతపానం బొనర్చిన వపువునం దృష్ణారహితమై, యనుపజాతరాగయగు శూలపాణిశిర శ్చంద్రకలయుంబోలెఁ దనరుచు, నిర్మథితసముద్రజలలక్ష్మిం బోలె నంతఃప్రసన్నమై, ననుమ స్తపదవృత్తిఁబోలె నద్వంద్వమై, బౌద్ధబుద్ధికైవడి నిరాలంబనమై, సీతపోలిక సమధిగతజ్యోతిప్రవేశమై, ధరణికరణి సలిలావృతదేహమై, నిర్మలయు, నిర్మమయు, నహంకారశూన్యయు, నిర్మత్సరయు నై పాశుపతవ్రతంబవలంబించియున్న యొక్కకన్యం గనుంగొనియె. 213

సీ. అంతఁ జంద్రాపీడుఁ డామావు డిగి యొక
చెట్టుకొమ్మకు దానిఁ గట్టివైచి
లోనికిఁ జని భవానీనాథునకుఁ ద్రిలో
చనునకు నతిభక్తి వినతిఁజేసి
యమ్మెడఁ గలయట్టి యాదివ్యకాంతనే
కనుఱెప్పవెట్టక యనవరతము
నాపద్మదళనేత్ర రూపసంపదయును
గాంతియు శాంతియు గనుఁగొనంగ

తే. విభునిసుతునకు మదిలోన విస్మయంబు
బొడమె, యారీతి నూహింపఁ గడఁగె నౌర!
పుడమిపైఁ బ్రాణికోటి కెయ్యెడలనైన
ననురూపంబులగు పనుల్ దనరుగాదె. 214

సీ. తొలుదొల్తవేటాడు తలఁపునఁ జనుదెంచి
తిరిగెడు నాకుఁ గిన్నరయుగంబు
గనిపింప విధివశంబున దాని వెన్వెంట
నంటి యేతెంచి నిరర్థకముగ
నరుల కగమ్యమై సురసంభరణయోగ్య
మగునీప్రదేశంబు నరసినాఁడ
నిచట నీరంబు నన్వేషింపుచుం గంటి
నచ్ఛోదమను పేర నమరు సరసిఁ
తే. గాంచి తత్తీరమున విశ్రమించివింటిఁ
బ్రీతితో నమానుషమగు గీతరవము
నంత యేతెంచి, యీదివ్యకాంతఁ గంటి
దీని సురకాంత యనఁగ సందియము గలదె. 215

సీ. దీనియాకారమే తెలుపుచుండెనుగదా
దైవతకులసముద్భవ యటంచుఁ
గనుఁగొన నీరీతి గంధర్వులకును మ
హీతలంబునఁబుట్ట హేతువేమి
తగ నిప్డు నాదృక్పథమునుండి చనకున్న
నీరావ్యభూధర మెక్కకున్న
గగనతలంబున కెగసిపోవకయున్న
నడిగెద దీనివృత్తాంత మెల్ల
తే. నెవ్వతెవు నీవు నీదుపేరేమి లేఁత
ప్రాయముననుండి యీరీతివ్రత మొనర్పఁ
గారణంబేమి యనుచు నిక్కలికిచరిత
మరయఁ దోఁచుచునుండె నత్యద్భుతముగ. 216

వ. అనుచు నిశ్చయించి, యాస్ఫటికమండపమ్మునందు వేఁజోకకంబంబు
నాశ్రయించి గీతసమాప్తి నిరీక్షింపుచు నాతఁడు కూర్చుండె. 217

సీ. తదనంతరమున నాతరుణి పాడుటమాని
వీణ వాయించుట విడచి లేచి
శితికంఠునకుఁ బ్రదక్షిణముల నొనరించి
సాష్టాంగవినతుల నాచరించి
తగఁ బుణ్యములతోడఁ దాఁకుచున్నట్లు తీ
ర్థోదకంబులఁ గడ్గుచున్నయట్లు
భూపాలసుతునిఁ జంద్రాపీడుని విసర
ధవళంబులైన నేత్రములఁ జూచి

తే. పలికె నతిథికి నీ కిదే! స్వాగతంబు
అనఘచారిత్ర యిప్వనంబునకు నేల
వచ్చినాఁడవు లెమ్ము నాయిచ్చునట్టి
యతిథిసత్కారముఁ గూర్మి నందుకొనుము. 218

సీ. అపుడు చంద్రాపీడుఁ డా సరోజదళాక్షి
పలికినయట్టి యవ్వచనముల
తన్ను ధన్యునిఁగాఁగఁ దలఁచుకొనుచు లేచి
కేల్గవ మొగిచి యంగీకరించి
యాకాంతతోఁగూడి యల్లన నరుగుచుఁ
దర్కించుకొనఁ జొచ్చెఁ దనమనమున
నకట! యీకల్కి నన్నరసి యంతర్ధాన
మొనరింప లేదె! యీవనితచరిత

తే. మదుగ నామది తహతహ పడుచునుండె
నెట్లు మెలఁగిన తనకత నెల్లనాకుఁ
జెప్పు నట్లుండి మది విశ్వసింపఁజేసి
తెలుపుమనఁ దెల్పుఁ దప్పక కలతెఱంగు. 219

సీ. అని నిశ్చయించి యవ్వనితతోఁ జరిగి తా
నటఁ గాంచె నొక్క గుహాస్థలంబుఁ
గనుఁగొని తద్ద్వారమున శిలాతలమం ద
తఁడు విశ్రమింప నత్తలిరుఁబోఁడి
యభ్యంతరమ్మున కరిగి వీణియ సెజ్జ
పైఁబెట్టి పిమ్మట వాఁగునుండి
గొనితెచ్చిన జలంబు నొనర నర్ఘ్యంబుగాఁ
బత్రపుటంబునం బట్టితెచ్చి
తే. యిచ్చునచ్చెల్వఁజూచి యిదేల దేవి!
నిక్క మఘమర్షణంబుగ నెగడె నీదు
దర్శనమ నాకు నీకుఁ బూజ తగదొసర్ప
ననినఁ జెలి తప్పదన నాతఁ డనుమతించె. 220

తే. అతివ యాతిథ్యమొనరించి యచటనున్న
యన్యశిలయందుఁ గూర్చుండి యతనిచరిత
మడుగ నతఁడును దిగ్విజయంబు మొదలు
గాఁగ సర్వంబు నది తుదగాఁగఁ జెప్పె 221

తే. అతనికత విని యక్కన్య యపుడ లేచి
పూని భిక్షాకపాల మభ్యాభరహాముల
దండఁ జరియింప ఫలములనిండె నంతఁ
దెచ్చి తిను మని నృపసూతి కిచ్చె నెలమి. 222

చ. వరమహిమోజ్జ్వలంబులు తపంబుల కెందు నసాధ్యమున్నదే
సారిది నచేతనంబులయి శోభిలుచెట్లును జేతనత్వ వి
స్ఫురణము చెందినట్లు ఫలముల్ తగ నీమెకు నిచ్చుచుంట య
చ్చెరువుగఁదోచె నిట్టిది విచిత్రము మున్నెటనైనఁగంటినే.

తే. అనుచు దలఁచుచు హయము కళ్యములవిప్పి
ప్రాంతమునఁ గట్టి యతఁడేటి కరిగి క్రుంకు
లాడి యాపండ్లమెసఁగి నీరాని కేలుఁ
గడిగికొనినంతఁ దినియె నప్పడఁతుకయును. 223

సీ. భుజియించి యటఁ దనపొంతనొక్క శిలాత
లమ్మునను న్న యక్కొమ్మఁగని స
మీపంబుజేరి చంద్రాపీడుఁ డల్లన
వినయంబుతోడ నిట్లనియె దేవి!
యడుగ కూరకయుండు నన్నను భవదీయ
కరుణమైఁబొడమిన కౌతుకంబు
పురికొల్పుచుండె నీచరితంబు సర్వమే
ర్పడ ముదంబున నన్ను నడుగు మనుచు

తే. నదియు వినిపింపఁదగినట్టి దయ్యె నేని
తెలిపినను ధన్యునిగఁ జేయు తలిరుఁబోఁడి
నిన్నుఁజూచినయది మొదల్ నిక్కముగను
బ్రీతి జనియింపుచుండె నివ్విషయ మడుగ. 224

సీ. అప్సరో ఋషిగుహ్యకాదితేయులలోన
నెవ్వారికి వుదయించి తొక్కొ
పువుబోలెమ్మృదువైన నవయౌవనంబున
నీమాడ్కిఁదప మొనర్తేమి యొక్కొ
యీవయస్సెక్కడ యీతపంబెక్కడ
యిటువంటి సురుచిరాకృతియు నెచట
వరసిద్ధకలితముల్ సురలోకరుచిరంబు
లగు నాశ్రమంబుల నొగిఁ ద్యజించి

తే. మానవవిదూరమైన యిక్కానన నొంటిఁ
దిరిగెద విదేల! యిట్టి యచ్చెరువుఁజూడ
నైతి నోయంబ! నన్నుఁ గృతార్థుఁగాఁగ
నెఱపుమీ నీయుదంతంబు నెఱుఁగఁజెప్పి. 225

క. అని యక్కుమారుఁ డడుగం
బెనుఱొమ్మున నుష్ణబాష్పబిందులొలికి బ
ల్చనుఁగవఁ దడుపగ నీరె
ల్లున నేడువఁదొడగె హారిణలోలేక్షణయున్. 226

సీ. ఏడ్చుచున్న యయ్యింతిఁ జంద్రాపీడుఁ
డీక్షించి యిట్టులూహింపఁ గడఁగెఁ
గ్రూరతాపములు శరీరధారులఁబట్టి
పీడింపకుండునే పెక్కుగతుల
నొకపాటివంత కిట్టి కలుకులేదు రే
వెచ్చనికన్నీరు వెల్లిఁగొనఁగ
నాయింతి వంతకు నచటికే తెంచిన
తన్నపరాధిఁగాఁదలచుకొనుచు

తే. నొలసి సెలయేటి కరిగి యంజలి ఘటించి
తోయముం దెచ్చి కన్నులఁ దుడుచుకొనుము
చెలువ! యనఁ జేసి, యాము చేలచెఱఁగుతోడఁ
దుడిచికొని మోము, నిట్టూర్పు విడిచి పలికె. 227

క. నరనాథపుత్ర! కరుణా
విరహితను నభాగ్యురాల వృజినమతిని నా
చరితము విననేలైనను
వెరవుగ నెఱిఁగింతు వినుము వేడుకయేని. 228

క. దురితవనదావపావక !
స్మరసన్నిభ ! గంధవహకుమారార్చితసుం
దరపద ! సనకాదికముని
వరవినుతపవిత్రనామ ! పావనమూర్తీ !

మాలిని.

భువనహితచరిత్రా ! ఫుల్లరాజీవనేత్రా !
కవిసరసిజమిత్రా ! క్ష్మాత్మజాకళత్రా !
ప్రవిమలగుణధామా ! భక్తలోకాభిరామా !
దివిజవినుతనామా ! దివ్యకారుణ్యధామా !

గద్య.

ఇది శ్రీమద్భారద్వాజసగోత్రపవిత్ర, కామేశ్వరీ శ్రీరామ
దంపతీసుపుత్ర, సుధీజనవినుతచరిత్ర, శ్రీపరమేశ్వర
కరుణాకటాక్ష సంప్రాప్తకవితా విశేష, వినయౌ
దార్యప్రముఖనిఖిలసుగుణవిభూష, శేష
కవిప్రణీతంబైన పద్యకాదంబరి
యను మహాకావ్యంబునం
దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# పద్యకాదంబరి.

## చతుర్థాశ్వాసము.



క. శ్రితవిశాలవక్షా !
విశ్రాణనవిభవ విబుధవృక్షసదృక్షా !
ప్రశ్రయగుణవత్పక్షా !
యాశ్రితమందార ! దశరథాగ్రకుమారా ! 1

వ. అవధరింపు మచ్చంద్రాపీడున కమ్మహిళామణి నిజోదంతం బిట్లు
చెప్ప దొరకొనియె. 2

సీ. సురలోకమందు నప్సరసల కన్యకల్
వెలయు టెల్లరకును దెలియుఁగాదె
వారికులంబులు పదునాలు గందులో
నలువచిత్తమునుండి కలిగె నొకటి
యొకటి శ్రుతులనుండి యొక్కటి శిఖినుండి
యొకఁ డాశుగమునుండి యొకఁడు నీట
నొకఁ డమృతమునుండి యొకఁడర్కకరముల
విధునుండి యొకఁ డొండు పృథివినుండి.

తే. యొకటి మెఱుపులవలన వేఱొకటి మృత్యు
వలన మఱియొండు వెడవిల్తువలన, మునియ
నఁగ నరిష్టయనంగను నెగడు దక్షు
పట్టిగవకు గంధర్వులవలన రెండు. 3

క. లలి నీరులముల నెల్లం
గలపిన పదునాలు గిందు గంధర్వులకుం
గలయది దక్షతనూజల
వలనఁ బొడమియున్నయట్టి వంశద్వయమే. 4

సీ. అందులో మునియను నతివకు షోడశ
సుతులలోఁ బెద్దయై సుగుణయుతుఁడు
చిత్రరథుఁడను పుత్రుండు కలఁ డతం
డతిపరాక్రమశాలియగుచు సకల
సురసేవితుఁడు పురందరునకు మిత్రుఁడై
బాల్యంబునాఁడ దోర్బలము కలిమి
నఖిలగంధర్వరాజ్యము నూని యట సమీ
పమునను భరతవర్షమునుదీచి
తే. భాగమునను గింపూరుష వర్షమందు
హేమకూటంబునాఁగఁ జెన్నెసఁగునట్టి
పర్వతంబున నతఁడు సగర్వవైభ
వంబు దళుకొత్తఁ బ్రీతి నివాస ముండు. 5

సీ. అయ్యెడఁ దద్దోర్బలాభిరక్షితులైన
గంధర్వవరులు పెక్కండ్రు కలరు
లోచనపర్వమౌ నీచైత్రరథమను
విరిదోట నిర్మించె వేడ్కనతఁడె
యచ్ఛోదమనుపేర నమరు నీసరసి న
తండె త్రవ్వించె సంతస మెలర్పఁ
బార్వతీనాథుండుఁ బ్రణతార్తిహరుఁ డనం
దనరు నీదేవు నతండ నిలిపె

తే. నల యరిష్టకుఁ దుంబురుఁడాదియైన
యారుగురు పుత్రులకుఁ బెద్దయైనహంసుఁ
డెలమి రెండవగంధర్వకులమునకును
రాజుగానుండె నచ్చిత్రరథుఁడు నిలుప. 6

సీ. అబ్జాంశుభవమగు నప్సరఃకులమున
శీతాంశుకిరణావదాత యగుచు
జగదేకసౌభాగ్యసదనయై జగదంబ
యగు గౌరిపోలిక నెగడి గౌరి
యనునొక్కకన్యక జనియింప హంసుఁడు
సౌరగంగను దుగ్ధజలధిపోలె
వరియించె నప్పద్మవదనయు ననురూపుఁ
డగువల్లభుండు సంప్రాప్తియగుట
తే. మదను వరియించి రతి యెట్టి ముదమునందె
నంతరంగంబునం దంత సంతసించి
యతనిశుద్ధాంతకాంతల కందఱకును
మేటిగా రాపురాణియై మెలఁగుచుండె. 7

సీ. అతిమహనీయులౌ నవ్వధూవరులను
వ్యసనపాథోరాశి పాలు సేయ
దుర్గుణనిలయనై దుఃఖభాజనమునై
యిట్టియే నొకతనె పట్టిగాఁగఁ
బొడమితి వారలుం గడుముదంబునఁ బెంచి
పదినాళ్ళుగడపినపిదప నాక
భిఖ్యగూర్చిరి మహాశ్వేతయం చేనును
జనకునిమందిరంబునను బాల్య

తే. వేళ మధురప్రలాపముల్ వెలయ వీణ
భంగి, గంధర్వవరుల యుత్సంగపీఠ
ములందుఁ జరియింపుచుండి బాల్యంబుగడపి
యల్లనల్లనఁ గాంచితి యౌవనంబు. 8

సీ. ఘనమత్తకామినీగండూషమదసేక
పులకితవకుల సంకులము లగుచు
నతిమృదుమలయమారుతతరంగిత మద
నధ్వజాంశుక సమున్నతము లగుచు
నానాకుసుమమరందవిలోలమధుపాళి
ఝంకృతిస్వనసముజ్జ్వలము లగుచు
సురభిరకుసుమరజోధూళిసైకత
ధవళితధారుణీస్థలము లగుచుఁ

తే. జారురాజీవవిపిఁ భాస్వరము లగుచు
ఫుల్లకోరకపరిమళపుంజితాళి
జాలశింజితసుభగరసాలసాల
దీప్తములునగు మధుమాసదినము లలర. 9

వ. ఒక్కసమయంబున మజ్జననిం గూడి వికచకమలకైరవకువలయ
భాసురంబైన యీయచ్ఛోదసరసికి నీరాడఁ జేరితి నయ్యెడ. 10

చ. తిరుగుచు నంత నొక్కయెడఁ దెమ్మెరవెంబడినేగుదెంచి ని
ర్భరముగఁ బూచియున్న ప్రసవంబుల తావి నడంచి నాసకుఁ
దిరముగ విందుఁజేయుచును దేఁటులకుం గడునాసగూర్చుచున్
విరుల మనోజ్ఞసౌరభము వే పొడమం గనుగొంటి నవ్వనిన్. 11

కం. పొడగని పరిమళ మిది యె
క్కడనుండి యటంచుఁ బుష్పగంధానుగ యై
వెడలు మదమధుకరముకై
వడి ముకుళితనయననగుచు వడిఁజని యొకటన్. 12

సీ. శివుకంటఁబడి మడిసిన మరుమీఁదికాంఁ
  క్షఁ దపంబొ.ర్పునసంతుఁ దనరఁగఁ
జంద్రార్ధమౌళి మెచ్చఁగఁ జేయుటకు నియ
  మంబువహించిన మదనుఁడనఁగఁ
దనరువానిఁ దటిల్లతాపంజరంబున
  నున్నట్లు గ్రీష్మపయోజమిత్ర
బింబంబునడుమఁ బ్రవేశించియున్నట్లు
  భాసిల్లువాని నుదగ్ర్యుఁడగుట
తే. దీపమట్లు ప్రకాశించు దేహకాంతి
నాయటవికి సువర్ణంపుచాయఁగూర్చు
నతనిఁ బింగళవర్ణజటాళి గలిగి
మిగుల నొకవింతసొగసు మెఱయువాని. 13

తే. శ్మశ్రు లుదయింపకుంటఁ బుష్పాధయములు
పొదలకుండిననాటి యుత్ఫుల్లసరసి
జం.బనఁగ నుల్లసిల్లుముఖంబు గలిగి
కన్నుగవకు ముదం బిడి క్రాలువాని. 14

తే. కుండలితమైన మరువింటిగుణ మనంగ
నిర్మలతపస్తటాకాబ్జినీమృణాళ
మనఁగ నెంతయు రుచిరమౌ యజ్ఞసూత్ర
మంసతలమునఁ జెలువారఁగట్టివాని. 15

తే. ఒకకరంబునను సనాళవకుళఫలము
వంటికరకంబు, రతి నిజపతికి నేశ్వ
బాష్పబిందులఁగూర్చి యేర్పరుమదండ
వోలు జపమాల కరమున గ్రాలువాని. 16

వ. మిత్రయుతుండయి స్నానంబున కేఁగుదెంచిన యాతనిం గనుంగొని
మఱియు. 17

సీ. అల వసంతుని గాంచి యలరిన వనలక్ష్మి
చెలఁగి నవ్విన నవ్వుసిరి యనంగ
మధుమాస మెలమిమై మలయానిలునిరాక
కిడినట్టి లాజవర్షంబలి యనంగ
సురుచిరగతిఁదోచు విరెలచ్చియొడలిపైఁ
జెలువారు యౌవనశ్రీ యనంగ
సురతశ్రమంబున స్రుక్కిన రతిమేని
జలకణజాలకావళి యనంగఁ
తే. గ్రాలి, తుమ్మెదలనియెడి కాముకులకు
మేలి యభిసారికయనంగ మెఱయు చమృత
జలములం జిమ్ముచును సువాసనల నెసఁగు
ప్రసవగుచ్ఛంబు వానికర్ణమునఁ గంటి. 18
వ. కని. 19
క. పరిమళ మిది కేవల మీ
విరిగుత్తిది కాదటంచు వెస నటకుం బో
యి రహిం దన్మోనిసుతుఁగని
తిరముగఁ జింతింపఁ గడఁగితిం జిత్తమునన్. 20
తే. త్రిజగదద్భుతరూప గరిష్ఠుఁడైన
కంతుఁ బుట్టించి మఱి వానికంటె సొగసు
కానిగా నల్వ మునిరూప మూనియున్న
పంచసాయకు నితని సృజించెనేమొ. 21
చ. చెలువగుపీని నెమ్మొగము సృష్టియొనర్పఁ దలంచి నల్వ నే
ర్ప లవమునంచుఁగాదె కమలాలయచారువిహారమందిరం
బులగు సరోరుహంబులను బూర్ణశశాంకుని జేసెఁ గాని చో
వలనుగఁ దన్ముఖప్రతిమవస్తువులం గలిగింపనేటికిన్, 22

చ. వనరుహబాంధవుం డపరపక్షమునందు సుషుమ్ననామమై
దనరెడు రశ్మితోడ హిమధాముకళావళిఁ బ్రోలుచుండు నం
చనుట హుళక్కి యక్కళ లుదాత్తమనోజ్ఞము పీనిమేలియం
దెనసెడుఁ గానినాఁడు గతమేమిటి యింతటిరూపుకల్మికిన్. 23

క. అనిమదిఁ దలఁచెడు నన్నుం
బనిగొని రూపైకపక్షపాతియగు మరుం
డొనరిచెఁ బరవశఁ బలెఁ జె
ల్చునఁ బుష్పాసవమదంబు లలి నళిఁబోలెన్. 24

సీ. దీనత దేనినో తివిరికోరెడునట్లు
చిక్కితి నీకంచుఁ జెప్పునట్లు
నభిముఖంబుగ హృదయంబొసంగెడునట్లు
తన్మయత్వముఁ జెందఁదలఁచునట్లు
ప్రసవాస్త్రుచే గౌరవము తప్పి శరణంటెఁ
గృపఁ బ్రోవుమనుచుఁ బ్రార్థించునట్లు
కులకాంతలకునిట్లు మెలఁగుట తప్పంచుఁ
దెలసియు నింద్రియంబులకులోఁగి

తే. యతని రూపంబునకుఁజిక్కి యైననేమి
ప్రాయముననేమి వెడవిల్తు వలననేమి
యెందుకొఱకైననేమి నే నెలమినచటి
ఋషికుమారునిఁ గంటి నిర్నిమిషదృష్టి. 25

క. మదనుఁడు వెనుకం దరుమఁగ
హృదయంబె కటికిని గొంట నింద్రియములుఁ దొం
పొదవంగ నెత్తుకొని చనఁ
జెదరెడు మదినెట్లో తిరముఁ జేసితి నంతన్. 26

సీ. మరునకుఁ దెరువిచ్చు కరణి నిట్టూరుపుల్
బలితంబులగుచు వెల్వలికిఁ జనియె
మదిఁ గోర్కె నెఱిఁగించుమాడ్కి వక్షోజముల్
స్ఫురితముఖంబులై పొలుపుమీఱె
ఘర్మాంబుబిందుసంగతి మార్జితంబైన
సరణి నల్లల్లన జాఱె లజ్జ
స్మర శితాశుగ పరంపరల కుల్కినయట్లు
గడగడ వడఁకాడె గాత్రయష్టి
తే. కౌతుకంబున వాని రూపాతిశయముఁ
బోలఁ గనురీతిఁ బరిరంభలాలసంబు
లైన యవయవములనుండి యపుడ నాకు
లీలఁ బొడతెంచె రోమాంచజాలకంబు. 27

సీ. రతిసుఖం బెవ రోసి వ్రతి యహాము శాంతుఁడై
వెలయు నీతనియందుఁ దులువనైన
యలరుల వింటివాఁ డనురాగవిషయ వి
మర్శనాదూరుఁడై మతిఁ దగుల్ప
సమకట్టె నుగ్రతేజస్తపంబులకునిక్క
మై వెలిఁగెడునిమ్మహాత్ముఁ డెచటఁ
ప్రాకృతమర్త్యులపాల మెప్పొలయించు
చిగురుల విలుకాని చేతలెచట
తే. యదియునుంగాక నియమస్థుఁడైన యీతఁ
డంగజుని బారికగ్గమైనట్టి నన్ను
నరసి పరిహాసమొనరించు నంగభవుని
చేతల మరల్చుకొన నేరనైతినకట. 28

సీ. అవివేకి యైనయీపురవింటిదొరచేత
 నున్మత్తభావంబునొంది విభుని
చెంతకుఁ బోయిన కాంతనేనొక్కర్తఁ
 గాను కన్యకలుపెక్కండ్రు కలరు
వీనియాకారంబు వీక్షించినంతఁ జి
 త్తంబెల్ల నస్వతంత్రత్వమొందెఁ
గాలమున్ గుణములుంగద చిత్తభవునకు
 నతతంబు దుర్నివారత ఘటించుఁ
తే. జేతనత మదినెందాఁకఁ జెదరకుండుఁ
బొదల దెందాఁక వ్యక్తమై మదనవికృతి
యన్యమహికేగు టుచితమా నంతలోన
నిట్లు చేసినశపియించునేమొ యితఁడు. 29

వ. అని యిట్లు తలంచుచు నటనుండి తొలఁగి పోఁజూచి మఱియు నంత
ర్గతంబున నీజాతి సకలజనసేవితంబగుట యెఱింగి తద్వదనంబున
దృష్టి దగిలించి వాదనంబొనరించితి నంత. 30

సీ. అంగజుం డప్రతిహతశాసనుండౌట
 నాప్రదేశం బాదమైన దగుట
మధుమాస మత్యంతమదకారణంబౌట
 నక్షముల్ దుర్నివార్యంబులగుట
నవినయఖనియైన నవయౌవనం బతి
 చంచలప్రకృతియై సాగుచుంట
లలి విషయాభిలాషలు చంచలములౌట
 నట్లు కానైయుంట స్వాంతమునకు
తే. నేలపెక్కులు నామరదృష్టవశత
నిట్టి ననుఁజూచినంతటనే నిరస్త

ధైర్యుఁడగు నక్కుమారుని దర్పకుండు
ప్రచలితుం జేసె గాలిదీపంబుబోలె. 31

సీ. మనసిజుం డేతేర మునిసుతునకుఁబుట్టె
రోమోద్గమం బెమరోకలనంగ
ననుఁగూడ వచ్చునాతని మదికిం ద్రోవ
నొగిఁజూపు విధమునసూర్పులెసఁగె
వడఁకాడె వ్రతహాని కడలినగతి వాని
హస్తంబునందున్న యక్షమాల
చెక్కిలికవమీఁది స్వేదాంబులవరాజి
పొలుపారెనవకర్ణపూరమనఁగఁ

తే. ప్రకటమయినట్టి యాతని వికృతిఁగాంచి
యంగజావేశ మినుమడి యయ్యెనాకు
నాక్షణంబున వర్ణనానర్హమైన
వింతతెఱఁగు ఘటిల్లెను విను నరేంద్ర. 32

వ. అంత మదంతర్గతంబున. 33

చ. అరయ జగంబునన్ రతిసమాగమనాట్యవిలాసనైపుణీ
పరిణతిఁ గూర్చునొజ్జగద భావభవుం డతఁ డట్లుకాకయు
న్న రతిరసాజ్ఞఁ డీతఁ డతి నవ్యతరాకృతిఁ జెంది దృష్టివెం
ట రతిరసప్రవాహముఁ బడల్పడఁ జేయునె నేర్పుమీఱఁగన్. 34

వ. కానిచో నిజాగ్రతంబైన యభిలాష దృక్సంజ్ఞ వెంబడిందెలుపంగలాఁ
డేయంచుఁ దలంచి. 35

సీ. పొంతకుఁ బోయి యమ్మునిపుత్రు సఖుఁజూచి
కేల్గవనొసలిపైఁ గీలుకొలిపి
దేవ! యీమునివరుం డే వానికొమరుండు
పేరేమి చెవియందుఁ బెట్టికొనిన

వేచెట్టుపూలు నా కెఱిఁగింపు మాలింపఁ
గడు వేడ్క నామదిఁ బొడముచుండెఁ
గర మద్భుతం బిట్టి పరిమళం బిందాఁక
నాఘ్రాణ మొదరింప నైతి ననిన

తే. నతఁడు ననుఁజూచి దరహసితాస్యుఁడగుచు
ననియె నోబాల ! యీరీతి నడిగినంత
నే ప్రయోజనమేమి త్వదీప్సితంబుఁ
గ్రమత నెఱిఁగింతు సావధానముగ వినుము. 36

సీ. త్రిభువనోజ్జ్వలకీర్తి విభవుండు సురసిద్ధ
సేవితచరణ రాజీవయుగళుఁ
డమరలోకనివాసి యతితతపోలసితుండు
శ్వేతకేతుఁ డనంగ వెలయు నొక్కఁ
డాతండు నిఖిలసురాసుర స్త్రీమనో
హర శుభాకారుఁడై యమరతటిని
దేవతార్చనకు రాజీవంబులం గొని
తెచ్చుతలంపున నొచ్చె నంతఁ

తే. గమలవనములఁ దిరుగాడు కమల వికచ
పుండరీకంబునందుఁ గూర్చుండి యతని
సొరుఁ గన్నులవెంట నొప్పారఁ గ్రోలి
దర్పకవికార మొలయ నిట్టూర్పువిడచె. 37

చ. కనుఁగొనినంతనే రతిసుఖంబుదయించెను లచ్చి కంతటం
దను నివసించియున్న వెలిదామర సార్థకమైచెలంగ నిం
పెనయఁ దదబ్జమందు జనియించె సుతుఁ డొకఁ డంత నీసుతుం
గొనుమని శ్వేతకేతునకుఁ గోమలి తా నొసఁగెం బ్రియంబునన్. 38

వ. శ్వేతకేతుండును దత్కుమారునకు నుచితకృత్యంబులనెల్ల నెఱపి పుండరీకంబునం జనియించుటం జేసి కుమారునకుఁ బుండరీకుండను నామంబిడి యతని సకలవిద్యావిశారదుం జేసె నప్పుండరీకుండీతఁడని చెప్పి మఱియు. 39

సీ. తొల్లి సురాసురు లెల్లరు మథియింపఁ
గలగుండుపడిన పాల్కడలి నుండి
ప్రభవించె నొకచెట్టు పారిజాత మనంగ
వీనికర్ణమునందు వెలయుచున్న
పుష్పమంజరి దానఁబొడమినయదియె యే
తత్ప్రాప్తి విను చతుర్దశియటంచు
నేఁ డంబికావిభునింగొల్వ ననుఁగూడి
వచ్చుచో నందనవనమునందు

తే. మేనఁ బారిజాతసూనమాలికలొప్పఁ
జేత నొక్కపారిజాత మంజ
రిం దగం ధరించి నందనవనలక్ష్మి
ప్రణతిఁ జేసి యిట్లు పలికె నతివ. 40

తే. అఖిలలోకమనోహరమైన నీదు
రూపసంపదకిది యనురూప మగుట
దీనిఁగొని కర్ణమునఁదాల్చి తేని యనఘ
ధన్యత వహించుఁ బారిజాతంబు జన్మ. 41

వ. అనినంత. 42

తే. తన్ను నుతియించుటన్ సిగ్గుదవిలి కనుల
మూసికొని యవ్వనేందిర నీసడించి
చనెడుచో మిత్ర! తప్పేమి గొనుమటంచు
నియ్యకొనకున్నఁ దనచెవి నిడితి దీని. 43

వ. అని యివ్విధంబునఁ దన మిత్రుం డవ్వనితకుఁ దనవృత్తాంతంబునుఁ
బుష్పమంజరీవృత్తాంతంబును దదాగమనప్రకారంబును దేటపడం
జెప్పుటయు నప్పుండరీకుం డది విని దరహసితవదనారవిందుండయి
నన్నుంజూచి. 44

క. ఇది యింత పరిమళముగల
యది యగుచో నిందమనుచు నాతఁడు మదష
ట్పదములు మూఁగిన దీనిం 45
గదియించె లలిన్ మదీయ కర్ణమునందున్.

సీ. తత్కర మంటినంతన నాకు రెండవ
పారిజాతప్రసవంబుఁబోలె
మొలచెఁ జెక్కిలిమీఁదఁ బులకలమొత్తము
మ్మౌని సుతుండును మత్కపోల
సంగతిఁ బారవశ్యతఁజెంది నిజహస్త
గళితమౌ జపమాలఁ దెలియఁడయ్యెఁ
బిదప నజ్జపమాలఁ బృథివిపైఁబడకుండఁ
దటుకునఁ బట్టి తద్బాహుపాశ

తే. కలితకంఠగ్రహసుఖంబుఁ గాంచుచున్న
దానినుంబోలె మద్గళాంతరమునందు
లీల నిడుకొంటి నజ్జపమాల నపుడు
పద్మబాంధవతేజ ! భూవరతనూజ ! 46

వ. ఆసమయమ్మున ఛత్రగ్రాహిణి నన్నుంజూచి, రాజపుత్రి, దేవి జల
కంబులాడె. గృహాగమనసమయంబు సమీపించుచుండెఁగాన మజ్జన
మాడు మనుటయు లావణ్యామృతకర్దమంబున మునింగినట్లును గపోల
పులకకంటకజాలంబునఁ దగుల్కొనినట్లును, వెలయు నాదృష్టిఁబ్రథ
మాఁకుశపాతంబుఁగనిన మదగజంబుపోలిక నిచ్చలేకుండియుఁ దన్మ

ఖంబుననుండి తప్పించి నీరామటకు లేచితి నంత నతనిచెంతనున్న మునికుమారుండును నపగతధైర్యుండగు నప్పుండరీకునిచందంబుం దేటపడం జూచి యొకింత ప్రణయకోపంబు గలవాఁడునుంబోలె. 47

సీ. చెలికాఁడఁ మనుభోగములమీఁదఁ బుట్టిన
యరుచి యేమూలఁ దా నడఁగియుండెఁ
దరతరంబులనుండి తగిలివచ్చుచునున్న
బ్రహ్మచర్యంబ దేవంకఁ గ్రుంకెఁ
నాచారమును నింద్రియజయంబు మఱియు స
ద్గురుసూక్తు లేమూలఁగూలియుండె
శమదమతపములున్ శ్రౌతంబు నాదిగాఁ
గల సుగుణంబు లెక్కడనడంగెఁ

తే. బ్రాకృతుండగు మర్త్యుని పగిదిఁదుచ్ఛ
సౌఖ్యములఁగోరి శాశ్వత స్వర్గసుఖము
లోలి వినాడి నరివారు గేలిసేయఁ
బోలునే నీకుఁ జరియింపఁ బుండరీక. 48

చ. అన విని లజ్జలోఁ గదిరి నాతఁడునుం బలెఁ బుండరీకుఁ డి
ట్లనియెఁ జెలీ! కపింజల ! లతాంగిని గన్గొని యక్షమాల ని
మ్మనియెద లెమ్మటంచు నతఁడల్లనఁ బల్కుచు నన్నుఁజూచి యి
ట్లనియె నళీకకోపకలితారుణభాస్వరదాననాబ్జుఁడై. 49

చ. మదవతి ! మాటలేల జపమాలిక నా కిడకుండ నింతయుం
గదలకుమన్న నాయఋతఁగల్గిన యజ్ఞవమాలఁ దీసి కొ
మ్మిదెయని యిచ్చి చెమ్మటలనెంతయుఁ దోఁగియుఁ జెవ్వలోనఁ గ్రుం
కి దరికిఁజేరి వానిఁబరికింపుచు నేగితి నింటి కంబతోన్. 50

సీ. అరిగి పిమ్మటఁ గన్యకాంతఃపురముఁ జొచ్చి
విరహార్తిఁ గుందుచు వెరవుమాలి
యరుదెంచితినొ లేక యచ్ఛోదసరసి చెం
గట నుంటినో చెలికత్తె పిండు
తో నుంటినో లేక యేనొంటి నుంటినో
వ్యసనమో లే కుత్సవంబొ రాత్రి
యో దినంబో సుఖమో దుఃఖమో కూర్కు
గంటినో మేల్కనియుంటినో కొ-
తే. సొగసుఁ గుల్కెడునట్టి వస్తువుల వెవ్వి
యో యరమ్యంబులైన వెవ్వో యటంచు
నొలసి యొక్కింత యేనియుఁ దెలియలేక
యుంటి మనసెల్ల నతనిపై నున్న కతన. 51

చ. చెలులఁ దొలంగి యంతిపురిఁ జేరి గవాక్షమునందు నుండి య
గ్గలి నతఁడున్న చోటికి నిరీక్షణముల్ నిగిడించి తద్దిశా
కలితములైన వాయువులఁ గాననపుష్పపరీమళంబుల
బొలుపుగఁ జూచి వాని విధముం దెలియన్ మది నాసచేయుచున్. 52

వ. తదాశ్రయంబగుట యౌవనంబునకుఁ జారుత్వంబును, దత్కర్ణసాంగత్యంబు కతనఁ బారిజాతప్రసవంబునకు మనోహరత్వంబును దన్నివాసంబు కతన నస్వర్లోకంబునకు సుభగత్వంబును దద్రూపాతిశయంబువలనఁ బ్రసవాస్త్రునకు దుర్జయత్వంబును నారోపించుచుఁ దపనునకుఁ బద్మినియుంబోలెఁ గుముదమిత్రునకు సముద్రవేలయుంబోలె ధారాధరంబునకు మయూరంబునుంబోలె నాతనికి నేనుదూరస్థనయ్యుఁ దదభిముఖినై యయ్యక్షమాలం గళంబునం దాల్చుచుఁ దద్రహస్యాలాపంబునుంబోలెఁ గర్ణావసక్తంబైన పారిజాతప్రసవగుచ్ఛంబు గొడచు దత్కరతలస్పర్శసుఖసంభవంబై కదంబముకుళకర్ణపూరాయమాణంబగు

రోమాంచంబునఁ గంటకితైకకపోలఫలకనై యుంటి నంతఁ దరళిక
యను కాంత తాంబూలకరండవాహినియై నాతోడ నీరాడుట
కేతెంచె నయ్యతివయుఁ బిదపఁ గొంతవడి కరుగుదెంచి యిట్టి నన్నుం
గనుంగొని యిట్లనియె. 53

చ. రమణిరో! తత్సరఃపరిసరంబునఁ దోచిన మౌనిపుత్రయు
గ్మమునను బారిజాతసుమమంజరి నిచ్చె నెవండు వాని కన్యుఁడై
న మౌనిసుతుండు వేగ విపినంబున నల్లవచ్చి నన్ను మా
ర్గము నడుమం గనుంగొని తిరమ్ముగ నిన్నుఁదలంచి యిట్లనెన్. 54

క. అయ్యువతి యెవతెయొకో పే
రెయ్యది యెవ్వానికూఁతు రెచటికరుగు నో
తొయ్యలి! చెప్పుమనుచు నతఁ
డొయ్యన నడుగంగ నిట్టు లొనరఁ బలికితిన్. 55

తే. శశికరోద్భూతమైన యప్సరస గౌరి
యందు గంధర్వవిభుఁడైన హంసువలనఁ
బొడమె నీమె, మహాశ్వేత పొలఁతిపేరు
హేమకూటాచలంబున కేగుచుండె. 56

తే. అనెడు నామాట లాలించి యాతఁడాత్మ
నెదియొ చింతింపుచున్న ట్లొకింతసేపు
తాల్చి మౌనంబు గనుఱెప్ప వ్రాల్చకుండ
నెలమి ననుఁజూచి మఱియును బలికె నిట్లు. 57

సీ. పడఁతి! నీయాకృతి బాలభావంబున
నుండియుఁ జపలత్వ మూనకునికి
నొనరఁగ నిన్నిప్పు డొకచిన్నవిషయంబు
నడుగుటకై వేడ్క పడుచునుంటి

నన విని యేను నొయ్యనఁ దోయిలి ఘటించు
కొని యోమహాత్మ! యి ట్లనఁగనేల
యే నన నీసొమ్మునే గదయ్య త్రిలోక
పూజ్యులరైన మీబోఁటివార
తే. లిడరు పుణ్యంబులేక మావృకులమీఁదఁ
బాపముల బాపనోపు మీ చూపునైన
నాజ్ఞయిత్తురె యిఁకఁ జేయుకట్టి కార్య
ముం దెలిపి న న్ననుగ్రహింపుము మహాత్మ. 58

వ. అనుచు వినయంబు దోఁపనాడిన విని యతండు నన్నుఁ బ్రాణదాయి నింబోలె, నెచ్చెలియుం బోలె సవలోకనంబునం గారవించి సమీపవర్తి యగు తమాలభూజంబునుండి యొక చిగురుటాకుం గోసి తట శిలాతలంబున నరుగఁదీసి నిజవల్కలమునుండి కొంతపీలికం జింపి దానియందు నిభమదసురభిళం బగు తద్రసంబున నాత్మకరసరసిరుహ కనిష్ఠికానఖశిఖరంబున వ్రాసి నీ విప్పత్రికం గొనిపోయియక్కన్నియ కేకాంతంబున నిమ్మని యొసంగెనని చెప్పుచు నత్తరళిక తాంబూల కరంకంబునుండి యప్పత్రికం దీసి నాకుం జూపె నంత నేనును దత్సంబంధంబగు నాలాపంబునఁ గులుకుచుఁ దరళికాకరతలంబునుండి యవ్వల్కలపట్టికం గొని దానియందు వ్రాయఁబడియున్న యిప్పద్యంబుఁ జూచితిని. 59

క. బిససితమగు ముక్తాలత
కసమాశం జెందివచ్చు నంచయుఁబలె సా
రసముఖి! నీవశమున మా
ససజన్మం డింతదవ్వనకు నను దెచ్చెన్. 60

వ. దారి తప్పినవానికి దిఙ్మోహభ్రాంతియుం బోలె, నంధునకుఁ గృష్ణపక్ష రాత్రియుంబోలె, నసంబద్ధసంభాషణునకు జ్వరప్రలాపవ్యాపారంబు

నుంబోలె, విషవిహ్వలునకు దష్టనిద్రయుంబోలె, నున్మత్తునకు మది
రారసంబునుంబోలె, మదనాతురంబగు నాహృదయంబునకు దృగ్గో
చరయగు నీతరళిక యెంతయు దోషవికారంబుం బొదలింపఁజేసె
నను వృత్తాంతంబునుఁ జూచి. 61

చ. శిరమును నిద్దపుందళుకుఁజెక్కుల ముట్టుచుఁ గూర్మితోడ నో
తరళిక ! చెప్పు మెయ్యెడ నతండుఁ గనంబడె నేమిసెప్పె భా
స్వరగతి నెంతసే పతనిసన్నిధి నుంటి వటంచుఁ దక్కఁధల్
నిరతముఁ జెప్పుకొంచు వెడలించితి నయ్యెడఁ దన్నిశీథమున్. 62

వ. అనంతరంబున. 63

తే. రాగయుతుఁడైన రవిఁ జూచి రహిఁ జెలంగి
పద్మవనశయ్యపై లీలఁ బవ్వళించి
దుర్భరమనోజవేదనాతురయుఁబోలెఁ
జేరి పాండుత్వమాతపశ్రీవహింప. 64

క. గైరికసలిలారుణవన
వారణ యూథములువోలె భాస్కరకరముల్
సారసవనోద్గతములై
వారక గుంపులుగ నమరి భాసిలుచుండన్. 65

వ. ఛత్రగ్రాహిణి చనుదెంచి నన్నుఁ జూచి, 66

క. చెలి ! యమ్మునిపుత్రులలో
పల నొక్కరుఁ డరుగుదెంచి ద్వారతలమున
న్నిలచి జపమాల నడిగెడు
తలఁపున వచ్చితి నటం చతం డనుచుండెన్. 67

వ. అంత నేనును, 68

తే. మునిసుతుం డన్న యాపేరు వినిన యంత
నతనిరాకకు సంశయ మందు చేనుఁ

గంచుకిం బంచితిని వాని కడకు నంత
వాని వెనువెంటఁ దగులూని వచ్చునతని. 69

క. విను మాకృతికిం బ్రాయం
బును, బ్రాయంబునకు మరుఁడుఁ, బూవిలుతున కా
మనిబోలె, నతనికిం బో
లిన మిత్త్రుఁ గపింజలుని లలిం గనుఁగొంటిన్. 70

ఉ. దీఁతనున్న వానిఁ గని దిగ్గున లేచి నమస్కరించి యా
పై నొకపీట నిచ్చి సముపస్థితుఁ జేసి తదీయపాదముల్
పూని బలాత్కృతిం గడిగి పొల్పునఁ బయ్యెద నారనొత్తుచున్
వానిసమీపభూతలమునం దగ నేనును విశ్రమించితిన్. 71

తే. ఎలమిఁ గూర్చుండి యేమియో పలుకునట్లు
తరళికం జూడ నతని చిత్తంబెఱింగి
తెలుపుమీ శంక యేల యిక్కలికి నాకుఁ
బ్రాణసమ యంచుఁ దెలిపితి నక్షిసంజ్ఞ. 72

సీ. తెలిపిన విని కపింజలుఁడు రాజకుమారి!
సిగ్గుబొడమెడు నేమి సెప్పుటకును
గందమూలఫలంబులం దిని శాంతులై
కాననంబులనుండు మానులెచట
స్మరవికారముల కాస్పదములై తులువల
బ్రాఁపూను విషయాంకురంబు లెచట
జడలకు నుచితమా చందమో లేక వ
ల్కలముల కనురూపకార్య మొకో!

ఆ. యెఱుఁగనైతిఁగాని, యిప్పుడు వచ్చినపని
చెప్పుకున్న మిగుల చేటు కలుగు
నసులఁ దొఱఁగియైన, నాప్తునిఁ గాపాడ
వలయు ననుట యెఱిఁగి, వచ్చినాఁడ. 73

ఉ. చంచలనేత్ర! నాఁడతని చానముఁ గన్గొని రోసి నీవునుం
గాంచుచునుండ నీకుఁ దగునా! చరియించుట యిట్టటంచు నిం
దించి తటాలునన్ విరులఁ ద్రెంచుట మాని యధీకకోపర
క్తాంచితలోచనద్వయుఁడనై యెటకో యపు డేగితింగదా.

తే. ఈవుఁ జనినంత నొంటిమై నీతఁడేమి
సేయుచున్నాఁడొకో నిరీక్షింత మనుచుఁ
దిరిగివచ్చి మహీరుహాంతరితమూర్తి
నై కనుఁగొంటి నతఁడున్నయట్టి యెడను. 74

వ. అయ్యెడ నతండు లేకుంటఁ జిత్తం బుత్తలంబంద, 75

సీ. ప్రసవబాణాసను బారికి నగ్గమై
యా లేమ వెంబడి నరిగెనొక్కొ!
చెలువ తాఁ జనినంత స్పృహఁదెచ్చుకొని నన్ను
బ్రీడఁ జూడఁగనోడి విడచెనొక్కొ!
యెన నవ్విధంబునఁ గసరుటఁ గోపంబు
బూని న న్వీడనాడి పోయెనొక్కొ!
తన్ను నే వెదకుచు నున్నట్లు నన్నుఁదా
నరయంగ నెటకేని నరిగెనొక్కొ!

తే. యుదయ మందినయది మొదలొక్క నిమిష
మేని యాతని విరహంబు నెఱుఁగకునికి
నతఁడు గనరామికెంతయు నడలు గదుర
మఱియు నూహింపఁగడఁగితి మానసమున. 76

క. ఇతఁ డేమి సేసె నా కవ
కృతి యూరక యితని విడువ నేమిటికనుచున్
వెతుకఁదలంచితి నల్లన
లతావనంబులఁ గొలంకులం బొదరిండ్లన్. 77

తే. అంత నొక్కసరోవరప్రాంతమందు
నళినమయం బనఁ గుసుమమయం బనంగఁ
బొలుపుమీఱుచు మధుజన్మభూమియనఁగ
నొప్పెడులతావనంబున నున్నవాని. 78

తే. అఖిలకార్యంబులన్ విడనాడి యుంట
నరయ యోగసమాధిస్థుఁ డనఁగ స్తంభి
తుం డనంగను సంప్రసుప్తుం డనంగఁ
జిత్రఫలకస్థితుం డనఁ జెలఁగువాని. 79

సీ. అరయంగ నేకాకి యయ్యును మన్మథా
ధిష్ఠితుం డగుచు వర్తించువానిఁ
బూని చర్చింపంగ సానురాగుండయ్యు
మేనఁ బాండుతఁబూని మెఱయువాని
శూన్యాంతరంగుఁడై శోభిల్లుచుండియు
నెదఁ బ్రియ నిడుకొని పొదలువాని
మౌనవ్రతంబూని మసలుచునుండియు
వలరాచవంతలం దెలుపువాని

తే విపులమగుశిలాతలమున విశ్రమించి
యున్నవాఁడయ్యు మృతియందు నున్నయట్టు
లమరునాతని, నిశ్చలుఁడయ్యు నాత్మ
వర్తనంబునఁ జలితుఁడై వఱలువాని. 80

క. మునిపుత్రుఁ డగుట నెదుటం
గనిపించిన శాపమీయఁ గడఁగు ననుచుఁ గొం
కునఁ డాఁగిన మదనుఁడు తెం
పునఁ గాఁచియు వెట్ట మిగులఁ బొగిలెడువానిన్. 81

చ. మనమున నున్న యత్తరుణి మానక చూడఁ దలంచి లోనికిం
జని విరహానలంబున నణంగినభంగి మనఃప్రభూతవే
దనలకు నీసుఁ జెందినవిధమ్మునఁ దోఁచిన యింద్రియంబు లె
ల్లను విడనాడ రిత్తయొడలం గనుపట్టెడువాని దీనునిన్. 82

క. అంతర్భాగోజ్వలదు
ర్దాంతస్మరవహ్నిధూమతతిసంకులితా
భ్యంతరమగు కన్గవ న
శ్రాంతగతిన్ బాష్పజలముఁ గ్రక్కెడువానిన్. 83

చ. హృదయమునేమ కంతుశిఖ నేర్పడఁ బుట్టుచు నూర్ధ్వసీమకుం
గదలెడు జ్వాలవోలె నరుణంబగు మోవివహించి మీఁదికిం
బొదలెడు నూర్పుతెమ్మెరలఁ బొంతఁగలట్టి లతాప్రసూనపుం
బొదు లదరంగఁ జేయుచును బొల్చెడు మోమునఁ గ్రాలువాతనిన్. 84

చ. అరయఁగ నడ్డ కర్ణములయందు ధరించిన పారిజాతపున్
విరుల పరీమళంబునకు వేడుకఁ జేరి మనోజమంత్రముం
బరువడి నుచ్చరించుగతి వారకమ్రోసెడు మత్తబంభరో
త్కరమున నీలకైరవయుత శ్రవణుండనఁ దోఁచునాతనిన్. 85

తే. కౌతుకజ్వరరోమాంచకైతవమున
మేనఁ దవిలిన స్మరశరసూనకేస
రవ్రజంబన నాత్మగాత్రంబునందు
వఱలు రోమాంచముంబూని మెఱయువాని.

సీ. తనువు లంగజవశీకరణ చూర్ణముఁబోలెఁ
గురియు పుప్పొడి తాఁకి పరఁగువానిఁ
దమరాగ మిడునట్లు దనరు నశోకంపుఁ
జిగురాకు లంటి భాసిలెడు వానిఁ
గానసే దిర విరితేనియం దెచ్చి త
న్నభిషిక్తునిం జేయ నలరువాని
షట్పదస్వనములన్ ఝుంకారములఁ బూని
మలయానిలుఁ డదల్ప నలఁగువానిఁ
తే. దత్తములొనర్ప ధూమావృతంబులైన
మరుని నిడువాలుఁ దూఁపులకరణి నళులు
పొదివి తావులఁ గ్రోలుచో నదరి మీఁద
వ్రాలు సంపంగిమొగ్గలం దూలు వాని. 86

సీ. ప్రాభాతకాలకైరవమిత్రుఁడుంబోలెఁ
బాండువర్ణమునఁ జూపట్టువాని
ఘర్మకాలమునాఁటి గాంగపూరముబోలెఁ
గార్శ్యత్వము వహించి క్రాలువాని
ననలగర్భితము చందనభూజముంబోలె
నొడలియాదం బెల్లఁ జెడినవాని
నొరునట్లు, నటమును పెఱుఁగని నరునట్లు,
జననాంతరముగన్న మనుజునట్లు
తే. క్రాలునాతని, రూపాంతరంబునూని
పగలుజనునట్లఁ దోచెడువాని మఱియుఁ
దొంటివిభమునఁ గనరాక తోఁచువాని
నతనిఁ గనుఁగొంటి మదనపీడితమనస్కు. 87

తే. వానిచందంబుఁ గనుతెక్ప వ్రాల్చకుండఁ
గాంచి దుర్భరమగు వంత గడలుకొనఁగ
నంతరంగంబు నాకుల మంద నిట్టు
లాత్మఁ దలపోసినాఁడ నో యబ్జవదన! 88

తే. ఇంతలో వీని నిట్లవస్థాంతరంబు
నందఁజేసిన మన్మథుం డరయ దుస్స
హప్రభావాఢ్యుఁడౌఁగదే యకట! యింత
లో నడంచె నమూల్యమౌ జ్ఞానరాశి. 89

తే. శైశవమునుండి నాకు నీ సకలమునికు
మారులకుఁ బూజ్యుఁడై యుండె నౌర నేఁడు
తపముఁ బోనాడి జ్ఞానమంతయుఁ దొఱంగి
యొరునికైవడి నున్నాఁడు మరునికతన. 90

చ. ఎలమిఁ దదీయసన్నిధికి నేఁ జని యాశిలయందు నొక్కెడన్
వలనుగఁ గూరుచుండి నిజపాణితలంబుఁ దదంససీమపై
నిలిపి నిమీలితాక్షు నతనిం గని నెచ్చెలి! పుండరీక! నీ
కలఁత యిదేమియో తెలుపఁగాఁ దగునం చడుగంగ నాతఁడున్.91

క. వెలివలువపొరల నడుమన్
నిలిపిన కెందమ్మిలనఁగ నెఱ్ఱఁ జెలఁగెడు క
న్నుల నల్లనఁ దెఱచి కపిం
జల! సర్వము నెఱిఁగి యిట్లు జనునే యడుగన్. 92

క. అని చెప్పెడు తద్వచనము
విని యకటా! యింతవంత వేగెడు నితనిన్
గని ప్రాణ మొసఁగినైనన్
మనుపం దగునచుఁ దలఁచి మఱి యిట్లంటిన్. 93

సీ. చెలి! పుండరీక! నీ కల తెఱంగెఱిఁగితి
నైన నను నొకటి ని న్నడుగుచుంటి
నెఱిఁగితో నీయంతఁ, గఱపిరో గురువులు,
చదివితో ధర్మశాస్త్రములయందు
ధర్మమార్జించు నుత్తమమౌ నుపాయమో,
తపముల కిది వేఱె దారియొక్కొ,
యమరలోకముఁ జేర నను వైన మార్గమో
ముక్తిమార్గమునందు యుక్తియొక్కొ,
తే. కాక వేఱగు నియమప్రకారమొక్కొ,
త్వాదృశుల కిది చూడఁ జెప్పఁగఁదగునె
యంగజునిచేత హాస్యంబునందు నిన్ను
నీ వెఱుంగక యుంటివిదేమి తెఱఁగొ. 94

క. అలరువిలుకాని బారికిఁ
దులువ గదా యగ్గమగు, బుధులు మెచ్చని య
చ్చలపుఁజేఁతల నీకుం
గలదే సుఖ మొనయునాస గాఢవిచారా. 95

సీ. ధర్మతత్పరత నిత్యము నీరముంబోసి
విషలతావిపినంబుఁ బెంపఁ జూచుఁ
దొడరి కాలాగురు ధూమరాజి యటంచు
గాలసర్పము ముట్టఁగాఁ దలంచు
గనగన మండు నంగారంబుఁ గాంచి య
మూల్యమౌ మణియంచు ముట్టఁజూచు
నెసఁగి వారణదంతముసలంబుఁ గనుఁగొని
లేఁదూఁడనుచుఁ బెకలింపఁజూచు

తే. నరయఁ దత్కాల సుఖదంబులగుచుఁ బిదప
విరసములుగాఁగఁ దోఁచుచుఁ బెక్కుగతులఁ
బీడ లొనరింప నోపు ని వ్విషయసుఖము
లొంద మదినెంచు నెవ్వఁడ మ్మందబుద్ధి. 96

క. తఱచైన విషయతత్వం
బెఱిఁగియు నీరీతి సారహీనజ్ఞానం
బుఱక వహింప నీకుం
దెఱఁగే ఖద్యోత మల్పదీప్తింబోలెన్. 97

చ. పరమరజోవిలం బగుచు వారక పొలుచున్న యట్టి ని
ర్ఝరతతిఁబోలె మాటికి దురధ్వమునం జరుచున్న యింద్రియో
త్కరము మరల్పనైతి, క్షుభితం బగు చిత్తమునాఁగనైతి పే
మరుఁ డన నెవ్వఁడియ్యధము మానక ధీరత నొంపఁగాఁదగున్ 98

తే. అనుచుఁ జెప్పెడునామాట నడ్డుపెట్టి
యెడతెగక బాష్పపూరంబు విడుచు కన్నుఁ
దుడుచుకొనుచొక్కచేతితోఁ గడఁక నొక్క
పాణితోఁబట్టికొని నన్నుఁబలికె నిట్లు. 99

తే. వేయిమాటలికేటికి వినుము మిత్ర!
సర్పవిషములకంటె దుస్సహములైన
ప్రసవబాణుని శరముల పాలుగాక
యుంటి వటుగాన యిటు లనుచుంటివీవు. 100

తే. ఎవ్వనికిఁగల్గు మనమును నింద్రియంబు,
లెవఁడు వినఁజాలుఁ గనఁ జాలు, నెవ్వఁడిది శు
భంబు నశుభంబిదంచు, నిజంబుఁ దెలియు
నాతఁ డొకఁడర్హుఁ డుపదేశ మందుకొనఁగ. 101

క. మానితధృతియును ఘనవి
జ్ఞానంబు నడంగె నతివిశంకటవృత్తిన్
మేనం బొదలెడు నసువు ల
హా! నాకుపదేశకాల మంతయుఁ గడచెన్. 102

క. పలుమాటలేల నీవుం
బలె నా కిఁకఁ గలఁడె చెలియు బంధుండుఁ గపిం
జల! మలపు మర్కు కిరణా
వళినున్నహామైన మదనపరితాపంబున్. 103

వ. పుండరీకుం డిట్లు చెప్పి మిన్నకుండుటయు నంత దృష్టాంతపూర్వకంబు లును శాస్త్రోపదేశతుల్యంబులునగు నితిహాసంబులతోడను, వచనం బులతోడను, నాతని చిత్తంబున కెక్కునట్లొంత చెప్పినను జెవింబెట్టఁ డయ్యె నయ్యవసరంబున నేమును నీతండస్థిరచిత్తుండయ్యె నీతని నీయవస్థనుండి మరల్పుట దుర్ఘటంబు. మఱియు నుపదేశంబులెల్ల నిష్ఫలంబులునయ్యె, నట్లగుట వీని ప్రాణంబులనైనం గాపాడుటకుం దగిన ప్రయత్నం బొనరించెదంగాక. యని తలపోసి లేచి వెసఁ జల జాకరంబున కరిగి సరసంబులైన మృణాళంబులను, సలిలసిక్తంబు లగు నళినీదళంబులను, గర్భపరాగకషాయసౌరభమనోహరంబు లగు కుముదకువలయ కమలంబులనుం గొనివచ్చి తన్నికుంజశిలా తలంబునందు యొకశయ్య నేర్పరించినంత, 104

క. అం దతఁడు విశ్రమింప వె
సం దగ మృదు శిశిరమలయజకిసలయముల లీ
లం దెచ్చి తద్రసంబునఁ
బొందుగఁ దిలకమిడి మేనఁ బూసితిఁ గలయన్ 105

సీ. స్వేదప్రతిక్రియఁ జేసితిఁ గర్పూర
తరువులనున్న కప్పురముఁ దెచ్చి
చలువకై యురమున నిలిపిన చందన
ద్రవమున నతని వస్త్రాంబు దడియ
నుదకణంబులఁ జిమ్మ్మ కదళీ దళమ్ముల
విసరితిఁ బలుమారు గసరుకొనక
యారీతి విడువక సారసదళముల
శయనముల్ గూర్చుచుఁ జందనద్ర
తే. వంబు నెమ్మేనఁ బూయుచుఁ బ్రతిని మేష
మోఁపి స్వేదప్రతీకార మొనరఁ జేయు
చెనరి కదళీదళంబుల విసరుచుండు
నంత నాచిత్తమున కిట్టి చింత వొడమె. 106

సీ. భగవంతుఁడగు చిత్తభవున కసాధ్యంబు
లేదుగా జగమున లేడివోలె
వనవాసరతుఁడు స్వభావముగ్ధుండునై
యేమియు నెఱుఁగని యీతఁడెచట
వివిధవిభ్రమరాశివిహితయై గంధర్వ
విభుపుత్రియగు మహాశ్వేత యెచట
జగతి నీతనికి దుష్కరము దుర్ఘటమునౌ
కర్జంబొకింతయుఁ గానఁ బడునె
తే. యాచరింపఁగరాని కార్యములనైనఁ
జేయఁగాఁబూను నీతండు సిగ్గుమాలి
హరిహ రాదులనొంచు నియ్యంగభవున
కర్హుఁడెవ్వాఁడు ప్రతికూల మాచరింప. 107

సీ. కుముదినీవల్లియుఁ గమలినీవల్లభు
కిరణసంగతి కాత్మఁ గెఱలుచుండెఁ
బద్మినీలతయు జీవంజీవమిత్రాంశు
కలితవైరముఁ దొట్టి కులుకుచుండె
దివసంబువెంట రాత్రియు నుత్సుకంబున
మిశ్రభావముఁబూని మెలఁగుచుండెఁ
గన్నులపండువౌ కౌముదీవిభవంబు
గాఱుచీఁకటిపొందు గలిగియుండె
తే. చేసితూఁపులదొర కెద వేడ్క యయ్యె
నే నచేతనములకైన నిట్టిపొందు
సేయఁగాఁజాలునని చాటిచెప్పుచుండఁ
జేతనంబుల తెఱఁగింకఁ జెప్పనేల. 108
తే అరయ గాంభీర్యవారాశి యనఁగఁబరఁగు
నీకెఁ డెవ్వానికతమున నింతలోనఁ
దృణముకైవడి నక్కటా! తేలికయ్యె
నాతని కశక్యమగుకార్య మవనిఁగలదె 109
వ. నిరుపమానం బగు నత్తపం బెక్కడ, యీయవస్థయెక్కడ. ఇయ్యాపద ప్రతిక్రియాశూన్యంబుగదా. ఇంకఁ గర్తవ్యమెయ్యది. ఎక్కడికరుగుదును ఏమిచేయుదును సహాయుం డెవ్వం డియ్యవసరముఁ గడపంజాలుప్రోడ యెవ్వండనియు, నితనిప్రాణంబులం గాపాడుట యెవ్విధంబున, నెట్టినిపుణత్వంబున, నెట్టిప్రజ్ఞ, నెట్టియారడింపుల నీతండు జీవింపఁగలవాఁడొకో యనుచు విక్లబచిత్తుండనగు నా కనేకసంకల్పంబు లంకురించె. మఱియును నిట్లనితలంచితిని. అతిదీర్ఘంబును, నిష్ప్రయోజనంబు నగునీచింతతోఁ బనియేమి. సత్కార్యంబుచేనైన నసత్కార్యంబుచేనైనను మఱి యేయితరోపాయంబుచేనైన నీతని

ప్రాణంబుల సంరక్షింపందగు నయ్యసురక్షణంబునకును నవ్వనితా సమాగమం బొకండు తక్కొండుపాయంబు గానంబడదయ్యె. వీని మదనవికారమ్మును గాలాతిపాతంబు నోర్వంజాల దదియునుంగాక, యతినింద్యం బగుకృత్యంబొనర్చియైనను సుహృత్ప్రాణంబులం గాపాడుట యుక్తంబని సత్పురుషులు తలంతురు. నింద్యంబయ్యు నికార్యం బవశ్యకర్తవ్యంబై నాకుండోంచె అన్యోపాయంబు చూపట్ట దయ్యె. ఎట్లయినను నామెసన్నిధికిం బోయి యీతనియవస్థనెల్లం దెలియంజెప్పెదం గాకని యాలోచించి, యకార్యకరణవ్యాసక్తుండ నగుట యెఱింగి సవ్రీడుండై, న న్నీకృత్యంబునుండి మరల్పునేమో యని వానికీరాక నెఱింగింపక యొకమిషపన్ని యతనికడనుండి తటాలునలేచి భవత్సమక్షంబున కరుదెంచితి నని చెప్పి యీమె యేమిప్రత్యుత్తరం బొసంగునోయని యాతండు మద్వదనసంసక్తదృష్టియై యుండునంత నేనును దద్వచనంబుల నాలించి సుఖమయంబగు ప్రాసాదంబునం బ్రవేశించినదాననుంబోలె, రతిరసమయంబగు రత్నాకరంబున మగ్ననై యున్నదాననుంబోలె, మనోరథంబులకెల్ల నుపరిభాగంబు నధిరోహించియున్నదాననుంబోలె నున్న నేను నప్పుడమొలకలెత్తు లజ్జకతంబున వదనంబుం గ్రిందికివంచుకొని యెడతెగకం బ్రవహించు విమలంబులగు నానందబాష్పజలకణంబులవెంట మనంబున నున్న హర్షోత్కర్షంబు వెలికిం దెలియంజేయుచు నిట్లని వితర్కింపం గడంగితిని. 110

శా. కందర్పుం డిట నన్నుంబోలె నతనిం గాసింపుచున్నాం డనం
గం దానించుక నాకుందోడ్పడండె వీంకం బుండరీకుండునుం
గందర్పజ్వరపీడితుండగుట నిక్కంబేనిం బంచాస్త్రుకం
జెం దోడ్పాటగుచుట్టమియ్యెలంగలండే నిక్కమూహింపంగన్. 111

తే. అతని కింతటిదశఁ గూర్చినట్టి మనసు
కింక నొనరింపఁగా రాని దేమికలదు
పూతమగు నీకపింజలు మోమునుండి
బుట్టెనే యొక్కనాఁడైనఁ బొంకుపలుకు. 112

తే. ఏమిసేయుదు, నే నింక నెచటఁజొత్తు,
నతని చెంతకుఁబోయి యేమని వచింతు
ననుచుఁ జింతించుకొనుచుండు నంతలోన
వచ్చి ప్రతిహారి ననుఁగాంచి పలికెనిట్లు. 113

క. నరనాథతనూభవ! నీ
శరీర మస్వస్థతాప్రసంగతి నుంటం
బరిజను లెఱిఁగింపఁగ విని
యరుదెంచె న్నినుఁగనఁగ మహాదేవి యొగిన్. 114

సీ. అనుమఁ జెప్పుచునుండ విని కపింజలుఁ డు త
టాలున లేచి భూపాలపుత్రి!
చాలసేపాయె నేఁ జనుదెంచి యదికాక
త్రిభువనవిభుఁడైన దినకరుఁడు
నస్తమింపుచునుండె నరిగెద నింక సు
హృత్ప్రదత్న మగుపుడసీకుఁ గావ
ననుమఁ జెప్పుచును మజ్జనని వచ్చుచునుంటఁ
బ్రత్యుత్తరంబైనఁ బడయకుండఁ

తే. నరిగె నెంతేఁ బ్రయాస మదంబవెంటఁ
బసిఁడిబెత్తంబులంబూని వరుసవచ్చి
పరిజనులు వామనాదిసేవకులు బలసి
వెలితిలేకుండ గృహమున విడిసియుంట. 115

క. జననియు నాకడ నించుక
దనుక నిలచి పిదపఁ జనియెఁ దనగృహమునకున్
ననుఁగనుఁగొని తా నేమని
యెనో యించుక యెఱుఁగనైతి హృదయములేమిన్. 116

శా. వ్యంచల్లీలఁ గదల్లి పోవుటయుఁ నాపైఁ బద్మినీమిత్రుఁడుం
బ్రాంచల్లీలఁ దటాలునం జరమవారాశిం బ్రవేశింప, ర
మ్యాంచన్నెచ్చెలియైన యత్తరళికాఖ్యంబిల్చి యాతండు నే,
మంచుంజెప్పెనో వింటివే కద వయస్యా! యుం డోగిం బల్కుచున్.

క. తనమిత్రుని తెఱఁగంత యు
వినిపించి కపింజలుండు వెడలెం గద! యే
మొనరింప నర్హమగు నది
వినిపింపుము నామనంబు వికలంబయ్యెన్. 118

ఉ. వ్రీడఁ దెరల్చి, ధైర్యమును వీడి, తొలంగి జనాపవాదముం
బోఁడిమి మూలవైచి నయముం గణుతింపక, తల్లిదండ్రులం,
జూడక, వంశపుంగౌరవుచొప్పుఁ దలంపక, వాని నేన పెన్
బ్రోడతనంబునం గవయఁబోయినచో సరివారునవ్వరే. 119

చ. గురుజను లేగు మార్గమునకున్ వ్యతిరేక మొనర్పఁజూచినన్
బొరలు నధర్మమంచు రది పోకడఁబెట్టి మఱొక్కమార్గముం
బనుపడిఁబూనిప్రాణములఁ బాసెదనన్న హితాగ్రగణ్యుఁడై
బరగెడు నక్కపింజలుఁడు వారని నెవ్వగఁగుందకుండు నే. 120

తే. అదియునుంగాక యాతని కతివ! యేను
వినుతమగునాశఁగూర్చి మోసము నొనర్చి
న, గృశింపుచునతఁడు నశింగెనేని
ఋషివధంబున నగు పాప మెనయుఁగాదె. 121

వ. అని యిట్లు నే నంతరంగమునఁ జింతించుకొనుచుండు నవసరంబున.

క. కుసుమపరాగోత్కరమున
వసంతవనరాజి పోలెఁ బ్రాంచచ్చంద్రాం
శుసమాగతకాంతిం దొలి
దెస పొలిచెం దెల్లఁ బాటి దృక్పర్వముగఁ. 123

తే. ఉదయగిరిగతసిద్ధపయోజముఖుల
చన్గవలనుండి జాఱిన చందనంపు
రాశి చేఁబోలెఁ బాండువర్ణమునఁ దనరి.
నెగడెఁ దొలిదిక్కు జాబిల్లి నిగ్గుసోఁకి. 124

క. శశియను పతిదర్శనమున
నిశయను సతి యల్ల నవ్వ నెఱిఁదోఁచిన త
ద్దశనప్రభయన వెన్నెల
విశదగతిఁ జగమునిండ వెలయంబర్వెఁ. 125

తే. పిదపఁ బాతాళమునునుండి పృథ్వితలము
వీకఁ బెకలించి తనయంతఁ బైకిలేచు
భుజగకులసార్వభౌముచేఁ బుడమిపోలె
నమృతకరుబింబమున రాత్రి యందమయ్యె. 126

క. సకలజనప్రియకరమై
మకరాంకునిచుట్టమై సమంచితరాగ
ప్రకటమునగు నెలపొడుపున
నకలంకతఁ బొలిచె రాత్రి యౌవనవతియై. 127

సీ. చెంగటికడలిలోఁ జెలువొందు విద్రుమ
ప్రభకతంబున నెఱ్ఱఁబాఱినట్లు
నిజమృగం బుదయాద్రి గజవైరి చీల్పఁగా
జెడునల్ల నెఱ్ఱఁబాఱినవడువున

రోహిణీసతి రతిక్రుద్ధయై తన్నుఁ ద
త్పదలాక్షుచే నెత్తఁబడినయట్లు
సడరుచుఁ బొడతెంచునుడురాజుఁ బొడఁగని
యంతర్జ్వలితమదనాగ్ని నయ్యె
తే. నంధకారిత హృదయనై, యజ్ఞాపు గ
తేక్షణాంచితనయ్యును, మత్స్యవుసు గ
నుంగొనుచునున్న యట్లు మెలఁగుదాని
నగుచుఁ దలపోయఁ గడఁగితి నాక్షణమున. 128

క. జలజాంబక మధు మధుకర
మలయానిల కీర పిక సమాజము సేయం
గలవంత యెంత యంతయుఁ
గలఁడీ తులువ యగు శీతకరుఁ డొనరింపన్. 129

సీ. సైరింపఁగా రాని మారవేదన కెవ
నలికెడు నాకుఁ జంద్రోదయంబు
పొడివి దాహజ్వరంబునఁ గుందు నరునకు
వదలని నిప్పులవాన వోలె
విడువని చలిచేత నడఁకెడువానికి
జాలువాఱెడు హిమజలమువోలె
గరళంబు కతన మైకముగన్న యతనికిఁ
గాలభుజంగంబు కాటువోలె
తే. మిగుల నెంతయుదాపంబుఁ దగులఁజేసె
ననుచుఁ దలఁచెడుచో మూర్ఛ యపుడ తవిలి
నాదు కన్నులఁగప్పెఁ జంద్రోదయంబు
కమలవనముల కన్నులఁ గప్పినట్లు. 130

తే. తరళిక ఘటించు తాళవృంతంపుఁబవన
ములకునుఁ జంచిగంధంపుఁబూఁతలకును
నేనుఁ దెలివొంది కన్నీరు సోనఁగాఁగఁ
గార్చుచుం గుందు తరళికం గంటి నధిప. 131

ఆ. కనులఁ దెఱచుకొనిన ననుఁ జూచి యాఁమెయుఁ
జరణములకు మ్రొక్కి చందన ద్ర
వమునఁ దడిసియున్న పాణియుగ్మమున దో
యిలి ఘటించుకొనుచుఁ బలికె నిట్లు. 132

చ. వినుము నృపాలపుత్త్రి! యిటు వ్రీడఁ గృశింపుచుండ నేల నేఁ
బనిచితి వేని నీహృదయవల్లభుఁ దెచ్చెద నీవిధంబు నీ
మనమున కెక్కదేనిఁ బలుమాటలఁ బోనిడి వానిపొంత కొ
య్యనఁ జనఁ బోలు నీకుఁ దగునా మదనాగ్నికి నాత్మఁ గుంపటల్.

వ. పాప మాధూర్తుండగు నమ్మకరకేతనుండు న న్నేమిసేయు. 133

తే. శంకలఁ దొలంగి, పోఁబెట్టి సంశయముల,
విఘ్నముల నెల్ల మరలించి, వ్రీడఁ ద్రోసి,
పూని వచ్చిన యాశశి పుండరీకు
కడకొ, మృత్యువుకడకొ పీఁకఁ గొనిపోవు. 134

క. నడువు మెట్టులైన నాతని
కడ కరుగుట యుక్తమనుచుఁ గ్రక్కునఁ జెలితో
నొడువుచు బయలు వెడలు నెడఁ
గుడికన్నదరినది నృపతికుంజర! నాకుఁ. 135

వ. అంత నొకింత సంశయించి మఱియు దైవం బేమి యొడఁగూర్పఁ దలం
చెనో, యని తలంపుచుఁ విపుల సుధాంభఃపూరములఁ గ్రక్కుచు
న్నట్లును, విమలగంగాప్రవాహసహస్రంబులం జిమ్ముచున్నట్లును,
మలయజరసనిర్ఝరముల వెడలఁ గ్రక్కుచున్నట్లును జెలఁగుచు ననతి

దూరంబునం బొడమిన నిండు వెన్నెలచే జగతీతలంబెల్లఁ దులదూఁగు చుండ, నాదివరాహదంష్ట్రామండలసంకాశుం డగునోషధీశునిచే జనం బెల్ల శ్వేతద్వీపనివాససౌఖ్యం బందినట్లు చెలంగుచుండ, ఘంటాప థంబులెల్లఁ గామినీసంప్రేషితసురతదూతీశతంబులం గ్రాలుచుండఁ, జలివెలుంగు జిగులకుం దలఁకి నీలోత్పలంబుల కాంతులచేఁ గప్పఁబడి పొలుపారు కమలవనలక్ష్ములుంబోలె నభిసారికలు శిరంబుల నీలవస నంబుల ముసుంగు లిడుకొని యటునిటుఁ బరువులువారుచుండ, పవి థంబులగు కుసుమంబులును దాంబూలంబును, మైపూఁతలునుం బటవాసచూర్ణంబులం ధరించిన తరళికతోడం గూడికొని యెండిన మంచిగందంపుఁ దిలకంబున నంటుకొని ధూమ్రవర్ణంబులగు ముంగు రులతోడను, జాదనద్రవలిప్తంబగు శరీరంబుతోడనుఁ దజ్జపమాల తోడను, శ్రవణశిఖరంబు నొరయు తత్పారిజాతమంజరితోడనుం బద్మ రాగమణిప్రభానిర్మితం బనందగిన కెంబుట్టంబున శిరంబునకు ముసుం గుం గావించుకొని మత్పరిజను లెవ్వరు నెఱుంగకుండ నప్రాసాదం బుననుండి క్రిందికిదిగి, 136

చ. మరలని పారిజాతసుమమంజరితావుల కాసఁజెంది క్రి
చ్చఱ విరిదోటలం గుముదషండములన్ విడనాడి చేరి బం
భరములపంక్తి నా కసితవస్త్రపు మేలిముసుంగుఁ గూర్పగం
బురబుర వానిసన్నిధికిఁ బోవుచు న వ్విరిదోఁటవెంబడిన్. 137

వ. తరళికాద్వితీయనై పరిజనవిరహితంబుగఁబోవు నాపోకఁదలంచుకొని.

సీ. ధనువున శర మొండు తగిలించుకొని వెంట
నను సరింపు చునుండు ననగజుండు
గడదూర మాత్మీయకరముల నొగిఁ జాఁచి
చేయూఁత నొసఁగు రాజీవవైరి

యెడ నెడ వెతఁదూలి పడకుండుటకుఁగాఁగఁ
గైదండ నొసఁగు రాగంబుచేఁ
సిగ్గు వెన్కకుఁ ద్రోసి చిత్తంబు గడువడి
నింద్రియంబులఁగూడి యెదుటి కరుగు

తే. వీరలే కద! తమయాతఁ జేరి పనులు
సలిపెదరు నిల్పికొనని బంటులనుబోలెఁ
బ్రియులకడ కేగఁ దలఁచు వారికి ధరిత్రి
బాహ్యపరిచారకులు సేయుఁ బనులు గలవె. 139

వ. అని తలంచుకొని తరళికం బిలచి. 140

తే. తరళికా! నన్నుఁ నతని చెంతకునుబోలెఁ
బరమనిర్భాగ్యుఁడైన యీసరసిజారి
వీఁకఁ జేసాచి యప్పుడరీకు జుట్టు
ముట్టికొని తేఁగలాఁడె నాప్రోల కిపుడు. 141

వ. అని యిట్లు పలుకు నన్నుంజూచి తరళిక యొక్కింత నవ్వి. 142

క. మనుజేంద్రపుత్రి ! యింతయు
మనమున నూహింపవైతి మదనాతురుఁ బో
లె, నితఁడు నీయెడ వెడఁగుం
బనులం గావింపుచుండెఁ బరికింపు మొగిన్. 143

సీ. ప్రతిబింబమిషమున, నితఁడు చెమ్మటఁదోఁగు
నునుచెక్కుగవ ముద్దు గొనుచునుండె
సురుచిరంబగు పయోధరయుగళంబున
నిజకరంబులఁ దమి నిలుపుచుండె
నెఱిమీఱు కటిమీఁద మెఱుఁగారు రశనపైఁ
బొలుపారు మణులొగిన్ ముట్టుచుండె
విమలంబులగు నఖరములనడుమఁ జిక్కి
చరణంబుల వ్రాలి పొరలుచుండె

తే. మనసిజాతురుఁ డగువాని తనువుఁబోలె
నిలని దేహంబు మిగులఁ బాంసుతఁ జెలంగ
స్ఫటికమణికుట్టిమంబుల ప్రాలి పొరలుఁ
గడఁకఁ బలుమాఱుఁ బ్రతిబింబకైతవమున. 144

వ. మఱియు మృణాళవలయధవళంబులగు కరంబులం ధరింపుచుండె, కేతకీధూళిధూసరపాదుండై కలువలకొలంకులం దోఁగుచుండె, జలలవసిక్తంబులగు చంద్రమణులం గరంబులం దాఁకుచుండె ననుచు నివ్విధంబునం దత్కాలోచితంబులగు నాలాపంబు లాడుకొనుచు నత్తరళికతోడం గూడికొని యచ్ఛోదసరోవరంబుకడకుం జని. 145

క. చలివెలుఁగు ఱాలవెంబడి
జలజలఁ బ్రవహించునీటఁ జరణద్వయ మిం
పలరంగఁ గడిగికొనుచుఁ
జలధీశునివంక నార్తనాదము వింటిన్. 146

క. వలక న్నదరుట నెంతయుఁ
గలఁగెడు నాకిది మఱింత కలఁత ఘటించెన్
జెలి! యిఁక నిలువలేనని
పలుకుచు వగఁబొగులు నతనిపజ్జ కరిగితిన్. 147

సీ. పాపాత్మ! మోహ మనోభవపిశాచ! యిదేల
కూడనిపనిఁ జేయఁగూడి తకట!
మోహమహాశ్వేత! యిదేమి నీతిఁదొఱఁగి
గెడపితి వితఁ డేమిచెడుగుఁ జేసె
నకలంకుఁ జంపి నేఁటికిఁగదా! చండాల!
యిడుగణాధీశ! ధన్యుండ వైతి
నీమకోరిక లెల్ల నెఱిఁ బాడినవి నేఁడు
చెలఁగి చరింపుమీ మలయపవన!

తే. తపము! సత్యము! మీకింకఁ దావుగలదె
ధర్మమా! దిక్కుమాలిన దానవైతె
దివిజలోకంబ! శూన్యమైతే యటంచుఁ
దలఁచి విలపించు నక్కపింజలునిఁ గంటిఁ 148

వ. కని యతనిసన్నిధి కరిగి. 149

చ. హిమకిరణోపలంబులపయిం గుముదాంబుజ నీల కైరవ
ప్రముఖసరస్సుమంబుల, నరణ్యమహీరుహమాంజుల ప్రసూ
నముల, నవీనకోమల మృణాళములం బొలుపారి మన్మథా
స్త్రములయ మనంగఁ జెన్నెసఁగు తల్పమునం బవడించినాతనిన్ 150

క. మృగనయన! నీనిమిత్తం
బుగదే నేనీ యవస్థఁబొందితి ననుచున్
మిగుల వడఁకు నధరంబునఁ
దగ వెలికిం దెలుపుభంగిఁ దనరెడువానిన్. 151

చ. వనరుహవైరికిం దలఁకి వక్త్రము వెన్కకుఁ ద్రిప్పికొంట, వీఁ
పును బగిలించుకొంచుఁ గడుఁ బూనికమైఁ జని హృత్పుటమ్మునన్
గనుపడుచున్న చంద్రకిరణంబు లనన్ మరుకాఁకఁ బేరెదన్
బనుపడు నాత్మహస్తనఖభాసురరోచులఁదోఁచునాతనిన్ 152

క. ఉండెఁగద నాకు మిగులు హి
తుం డొక్కఁడు నీ కటంచుఁ దోరఁపుటలుకన్
నిండికొనిన హృదయం బు
ద్దండత విడచి చన రిత్తఁదనరెడువానిన్. 153

ఆ. పెదవిఁ దెఱచియుంట హృదయంబు హరియింపఁ
దలఁచి లోని కరిగి వెలికివచ్చు
శశికరములఁ బోలు దశనప్రభల నిజా
గ్రమహిఁదెలుపుఁజేయు చమరువాని. 154

తే. మదనవేదనఁ బొగిలెడు హృదయసీమ
నమర నిడికొన్న కరమునఁ బ్రాణతుల్య!
ప్రాణములతోడఁ బోకుమా యనుచు హృదయ
కలిత నదుఁ బట్టుకొనునట్లు చెలఁగువాని. 155

తే. అపుడ విడనాడి ప్రాణంబు లరుగుచున్న
త్రోవ మెడనెత్తి కనుచున్నదోయనంగఁ
జెంగట వసించి తపము నెచ్చెలియుఁబోలె
నొప్పెడు కమండలువు నూని యున్నవాని. 156

తే. సలలితమృణాళవలయంబు గళమునందు
నక్షమాలికవలె నుంట నైందవాంశు
రజ్జులఁ దగిల్చి లోకాంతరంబునకును
బలిమిఁ గొనిపోవఁబడునట్లు చెలఁగువాని. 157

చ. నను విడనాడి పోవఁ దగునా యనుచుం గరయుగ్మమెత్తి లో
చనముల వెంట బాష్పజలసంతతిఁ గార్చుచు మాటిమాటికిన్
వనరుచు దీనవృత్తిఁ గనుపట్టు కపింజలుఁ డిచ్చఁ గౌఁగిలం
జెనకఁగ దోమవాని గతజీవునిఁ గాంచితిఁ బుండరీకునిన్. 158

ఆ. ఆతనిఁ గాంచినంత మతిసెడి పాతాళ
తలముఁ జొచ్చియున్నదానఁబోలె
నెఱుఁగనైతి నకట! యేమిసేసితినొక్కొ!
యెచటనుంటి నొక్కొ! యించుకైన. 159

ఉ. అక్కట! పెక్కుదుఃఖముల నంమతంపువనేమి, ప్రాగ్భవిన్
దక్కకచేసికొన్న దురితంబుల సంగతినేమి, బుద్ధికిం
జిక్కిన క్రూరతాగుణవిశేషత నేమి మహాదు వక్రతం
ద్రెక్కొనకుంటనేమి, మెయినిల్చిన పీయసువుల్ నృపాత్మజా! 160

క. మనుజేంద్ర! కొంతవడికిన్
మనమునఁ దెలివొంది నిప్పనం బొరలెడు లాఁ 161
గునఁ దోఁచు నన్నుభాగ్యం
గనుఁగొని మే నంత మిపులఁ గళవళపడుచున్. 162

తే. అతని మృతికిని నాదు జీవితమునకును
సంశయింపుచు లోనివిచార మడఁచు
కొనుచు, నోనాథ! నన్ను నొక్కర్తు నిచట
విడచి యెట కేగుచుంటివో నుడువుమనఘ! 163

క. అడుగుము తరళిక నెంతటి
యిడుమల నీకొఱకుఁ బడుచు నిటుచుంటినొ! యే
ర్పడఁ బదినూరుయుగంబుల
వడువునఁ గడపితి దినంబు బహుకష్టముగన్. 164

ఉ. ఇంచుక నన్నుఁ జేరి వచియింపుము, తీర్పుము నాదుకోరికన్
గాంచుము కన్ను లెత్తి, కరుణం బ్రకటింపుము, నీవె నాకు ది
క్కంచు మదిం దలంచితి దయామతిఁ జూడవిదేల! నేను గా
వించిన దోస మేమి వినిపింపుము నిక్కము దాఁపనేటికిన్. 165

క. కన వేమిటి కిటు దాసీ
జనంబు విడనాడి పోవఁ జను నే నీకుం
జనుఁగాక యిట్టినిన్నుం
గనుఁగొని యసువుల ధరింపఁగా నాకగునే. 166

ఆ. అకట! యెవ్వతెకొఱకునై నీకుఁ దీఱని
హాని సంభవించె నట్టినాకు
బంధువర్గమేల పరలోక మది యేల
వినయ మేల భాగ్యవిభవ మేల. 167

క. ఈరీతిఁ గుందు నిన్నున్
వారక యియ్యెడఁ దొఱంగి భవనంబునకున్
జేరఁ దలఁచునెడ నాకున్
మీఱిన కఠినాత్మురాలు నేలఁ గలుగునే. 168

క. జననీజనకులతోడం
బనియేమిటి, గృహముతోడ బంధులతోడం
బనియేమి, పరిజనముతోఁ
బనియేమిక నకట! యెవరి పజ్జ కరుగుదున్. 169

తే. దైవమా! నన్నుఁ జూడుమీ దయ దలిర్ప
మీకుఁ జేసెద నతుల ననేకగతుల
మీరుఁ గృపఁ జూచి వనలక్ష్ములార! యితని
ప్రాణదానంబు గావింపఁ బోలువడరె. 170

తే. జనని! భూదేవి! ననుఁ గృపం గన విదేమి
బ్రోవవేమి యనాథనై పొగులుచున్న
శరణు నందితిఁ గైలాసశైలరాజ!
చూపుమా! నీకటాక్షవిస్ఫూర్తిమహిమ. 171

తే. అనుచు నేడ్చుచు నే వచ్చుదనుకనైన
నిలువవైతికదే యంచు నిర్గతాసు
వైన యప్పుండరీకుదేహమున వ్రాలి
వానిలో నైక్యమగురీతి వగచి మఱియు. 172

క. వరగుణనిలయ! కపింజల!
స్థిరకీర్తివిశాల! విగతజీవితు నితనిం
గరుణఁ బ్రతికింపుమని పరి
పరివిధముల వేఁడు చతని పదములఁ బడితిన్. 173

క. అనుకొననివి యెఱుఁగనియవి
కనియెఱుఁగని యవియు నొరులకడ నేరనివై
తనరెను నాఁటి మత్కృత్యుల్
మనమున నిట్టి వని యెఱుఁగ మనుజాధీశా.! 174

క. ఆపలుకులు నాతెఱఁగులు
నాపరితాపములు మఱియు నమరిన వెడఁగుం
జూపులుఁ గైపులు దీనా
లాపంబులు నాకు నొంకులాగునఁ దోఁచెన్. 175

తే. వినినయంతన గుండెల గ్రీలఁజేయు
నాత్మవృత్తాంత మెఱిఁగించునంత మూర్ఛ
వొడమి మతితప్పి పుడమిపైఁ బడుచునుండఁ
జేరి చేయూఁత నొసఁగి యా యాక్షితిప సుతుఁడు. 176

ఆ. వెల్లిపొడుచుచున్న వెచ్చనికన్నీట
నొనర మిగులఁ దడిసియున్న నాదు
పయ్యెటచెఱఁగుఁబూని పలుమారు విసరుచు
గలుగఁజేసెఁ దెలివి నెలమి నతఁడు. 177

చ. పడఁతుక! నిన్మఱిక్ వెతలపాలొనరించితిఁ బాపశీలుఁడన్
విడు మిఁకఁ జెప్పుటల్, వినఁగనేర గతించియు నాపద ల్మదిం
దొడరిన యంతట న్మరలఁ దొల్లిటికంటె మహోగ్రభంగి నే
ర్పడ వినువారికిం, దెలుపువారికిఁ, దీఱనివంతఁ గూర్పవే. 178

క. పలుమఱు గడచిన యవి మది
నలవడఁ దలఁచుకొనుచుండి యసువుల శోకా
నలమున కాహుతిఁజేయక
నిలిపికొనం దగు నటంచు నృపసుతుఁ డనినన్. 179

క. ఘోరంబగు నారాత్రిఁ
భూరమణకుమార! మొగసి పోవక మిగులం
గ్రూరత నిలచిన ప్రాణము
లారయ నిపు డెడలు ననుట యది నిజమగునే. 180

క. దురదృష్టసమన్వితనై
మరలని దుర్మార్గనిరతమతి నగు నా కా
పరమాత్ముం డంతకుఁడుం
గరుణం దనమూర్తిఁ జూపఁగాఁదలఁపఁడుగా. 181

క. ఏలా నాకీశోకము !
కూళకు విశ్వాసహీనగుణయుతమతికిన్
బోలఁగ నా కిపు డొదవిన
జాలి తెఱంగెల్ల నిజము సత్యంబె యగున్. 182

ఆ. లజ్జ నుజ్జగించి లజ్జావిహీననై
కాలుసతుల నగ్రగణ్య నగుచు
బ్రదికియుంటి వజ్రహృదయంబు గలదాన
నగుట నీయవస్థ ననుభవింప.

క. తెలుపుటకుం దెలియుటకున్
వలనుపడని విషయమొకటివరలెడు నదియుం
దెలిపెద నేకారణమునఁ
గలఁగియుఁ బ్రాణంబు లచలగతి నిలచినవో. 183

ఉ. ఆరసి నేఁడ్చి యేడ్చి మరణైకవినిశ్చయ నౌచు నెచ్చెలిం
జేరఁగఁ బిల్చి యేనిటుఁ గృశింపుచు నుండఁగ నేల మన్మనో
హారునిఁ గూడఁబోయెద రయంబునఁ గట్టెలఁ గొన్నిఁటిం దగన్
జేరిచి యొక్కచోఁ జితి రచింపు మటంచు వచింపుచుండఁగన్. 184

సీ. అళికులంబులసొంపు నదరఁజేయఁగఁ జాలి
నెఱిమీఱు తిన్నని కురులవాఁడు
సలలితరత్నకుండలముల నెసఁగు కెం
జిగిఁ దొలంకెడు కర్ణయుగళివాఁడు
శరదిందుచంద్రికా స్ఫురణంబు నడఁగించు
వెలివల్వ తలపాగ నలరువాఁడు
పొలుపారు నక్షత్రముల నేర్చి కూర్చిన
ట్లలరుహారంబునఁ జెలఁగువాఁడు
తే. నధికదీర్ఘశరీరుఁడౌ నాతఁడొక్కఁ
డిందుమండలమున నుండి యిలకు నుఱికి
పుండరీకునితమ్ముఁ గొంపోవనెత్తి
జలదగంభీరరవమున బలికెనిట్లు. 185

తే. విడకు మనువుల నో మహాశ్వేత ! నీకు
మరలఁ గలిగెడు నితని సమాగమం బ
టంచు జనకుండు వలెఁగూర్మి నమరఁ బలికి
గగనతలమున కతనితో నెగసిపోయె. 186

క. ఆకరణిఁ బుండరీకున్
వైకొని యతఁడు గగనవీధికిఁ జను టా
లోకించి యోకపింజల!
వీఁకం దగ నా కిదేమొ వినిపింపు మనన్. 187

క. నిలచి ప్రతివచన మిడకయె
కలఁగుచు నెవ్వఁడవు నీవు కలుషహృదయ ! నా
చెలిఁ గొంపోయెద వేటికి
నిలు నిలుమం యనుచు వెంట నింగికిఁ జనియెన్. 18

క. చెలువుని పోకకు నెంతయు
విలపించెడు నా కిటం గపింజలుఁ డితఁడున్
జలదపథంబున కెగయుటఁ
గలఁత మఱింతయ్యె సుగుణగణమణినిలయా. 189

క. అంతట నేమియుఁ దోఁచక
చెంతకుఁ దరళికను బిలచి చెలి! నే నిఁక జీ
వింతునె యన నిజముగ మర
ణింతు ననుచు వడఁకుగదిరి నెచ్చెలి భీతిన్. 190

సీ. కడఁ జిత్ర మీతఁడెవ్వఁడో యెఱుంగ నమాను
షాకృతిఁదోఁచునో రాకుమారి!
తండ్రికై వడిఁజేరి తగనిన్ను నోదార్చఁ
బుండరీకునకునై పొగులుచుండ
నరుగుగ నిట్టి పుణ్యాత్ములమాటలు
కలనైన బొంకులై కానఁబడునె
యదియునుంగాక మహాత్ముఁడో నితనికిఁ
గల్లలాడఁగ నేమికారణంబు
తే. కాన వేగిరపడక నీమానసమున
మంచిచెడ్డలనెల్ల యోచించుకొని య
నంతరము నీకుఁదోఁచిన యట్లుచేయు
మసువులం గోలుపోవుట యర్థమగునె. 191

ఉ. వారల వెంబడించి మనవాఁడు కపింజలుఁ డేగెఁగాదె తా
నారసి వచ్చి నీవిధమునంతయు నాతఁ డెవండొ, యేటికై
యీరమణీయమూర్తిఁ గొనియేగెడునో, యెటకేఁగునో, లస
ద్వారణయాన! యాసఖుఁడు వచ్చెడునంతకు నిల్చియుండుమీ. 192

చ. వనితరొ! యాకపింజలుఁడు వచ్చి యతం డపు డేమిచెప్పునో
విని తగుభంగిఁబూని నడపింపఁగఁబోలు గతించి తేని నీ

కును జెలియఁగా కపింజలుఁడు గొబ్బునఁ బ్రాణములం ద్యజింపఁడే
నినుఁ గనకున్న నాతఁ డవనిన్ క్షణమేనియు నిల్వఁజాలునే. 193

తే. ప్రాణములఁ గోలుపోవుట కాతఁ డరుగు
దెంచుపర్యంత మవధిఁ గల్పించుకొను మ
టంచుఁబల్కుచు నేఁచ్చుచు నపుడనాకు
పాదయుగళంబుపై వ్రాలెఁ బార్థివేంద్ర! 194

వ. జీవితాశకుంగల సకలలోకదుర్లంఘ్యత్వమున నేమి, స్త్రీస్వభావంబు నకుంగల నీచత్వంబున నేమి, యామహాపురుషుం డరుగుచుఁ జెప్పిన మాటలం బొడమిన పేరాస నేమి, కపింజలుండు తిరిగివచ్చి యేమి చెప్పునో యనుతలంపున నేమి, యాసమయంబున కదియు యర్హా మగుటఁ దలంచి ప్రాణంబులఁ దొఱంగక నిలచితిని. ఆశ యెవ్వనిచే నేమి సేయింపఁజాలదు! వర్షసహస్రసంకాశంబై, యాతనామయంబై, నరకమయంబై, అగ్నిమయంబై తోఁచు నారాత్రిం దరళికాద్వితీయనై యెట్లో కడపి మఱునాఁటి నాఁ డుదయంబున లేచి యటనున్న సరసిలో స్నానంబుసేసి యప్పుం డరీకునియందున్న ప్రీతిచే నాతని కమండలంబుం గొని నారచీరల ధరించి తదక్షమాలిక గ్రహించి నెమ్మనమున సంసారంబున కసారత్వంబును, తన కభాగ్యత్వంబును, వ్యసనంబులం బ్రతిక్రియాదారుణత్వంబును, శోకంబునకు దుర్నివారత్వంబును, దైవంబునకు నిష్ఠురత్వంబును, స్నేహంబునకు దుఃఖబహుళత్వంబును, సకలప్రపంచంబున కస్థిరత్వంబును, సుఖంబుల కశాశ్వతత్వంబును, నిరూపించుకొని జననీజనకులం బరిత్యజించి, పరిజనులఁ బోనాడి, బంధువులఁ దొఱంగి, విషయసుఖంబుల నుండి యింద్రియంబుల మరలించి, బ్రహ్మచర్యవ్రతం బవలంబించి, యనాథశరణుండును, త్రిలోకరక్షణుండును నగు నిర్వికారుండుపాక్షుండ నన్ను బ్రోచుటకు దక్షుండని నమ్మి, యీ దేవునిఁ బూజించుకొనుచుఁ బాశుపతవ్రతంబు నవలంబించుకొని యుండునంత. 195

చ. నరవరపుత్రకా! మఱుదినంబున నాజనకుండు నెట్లొ నా
చరితముఁ దా నెఱింగికొని చయ్యనఁ జుట్టలతోడ నాలితో
నిరువుగ వచ్చి మొత్తులిడి యెన్నొవిధంబుల నూఱడించి మం
దిరమున కేగుదె మ్మనుచుఁ దెల్పి ననుం గొనిపోవఁ జూచియున్.

క. దొరకొనిన నామనం బిఁక
మరలదటం చెఱిఁగినపుడు మాద్యఁదు తృష్ణా
విరహితుఁడయ్యుం గరుణా
పరతం గొన్నాళ్లు నిలచి భవనముఁ జేరెన్. 197

చ. అరిగిన దాదిగా నిరత మశ్రులఁగార్చుచు వానికోసమై
గురుతరమౌ వ్రతంబునఁ దగుల్కొని భోజనముం దొఱంగి యో
నరవర! తద్గుణాభిగణనం బొనరింపుచునుం దపోమిషన్
గరళగళున్ భజింపు చిటఁ గాలముఁ బుచ్చుచునుంటి నాళితోన్. 198

సీ. పాపాత్మురాల నిర్భాగ్యరాలఁ గృపావి
హీనురాలను సుఖహీనురాల
దిక్కెఱుంగనిదాన నక్కటా! విప్రునిఁ
గడతేర్చినట్టి పంకమునఁదగిలి
యెంతయుఁ గృశియించు నిట్టి న న్ననవేల
కనియుచు మాటాడఁ గడఁగనేల
వినుతచరిత్రులై తనరెడు మిముఁబోఁటి
వారల కనుచుఁ గన్నీరుకార్చు

తే. కొనుచు శరదభ్రశకలంబు వనజవైరిఁ
గప్పుతెఱఁగునఁ దనదు మొగమ్మునందు
విమలమగు నుత్తరీయవస్త్రముఁ దగిల్చి
కొనుచు విలపించె వెత నాపుకొనఁగలేక. 199

తే. ఆమె నిస్సంగతయు వినయంబు మధుర
భాషణంబును రుచిరరూపమును నిరభి
మానతయుఁ గాంచి భూనాథసూనుఁ డమిత
గౌరవంబున నయ్యింతిఁ గాంచుచుండె. 200

తే. ఆవనిత చూపినట్టి సద్భావమునకు
నమితమగు నాకృతజ్ఞత కాత్మ నలరి
యామెవృత్తాంత మెఱిఁగిన దాదిఁగాఁగ
మిగులఁ గృపఁజూపె నాతఁ డమ్ముగువయందు. 201

వ. మఱియుం గరుణారసార్ద్రీకృత చిత్తుండై చంద్రాపీడుం డప్పల్లవోష్ఠి
కిట్లనియె. 202

క. కృత మెఱుఁగని నరుఁడారక
వెతఁ గుందుఁ బెకాని స్నేహవిభవంబునకుఁ
జతయగుపని నొనరింపరు
కృతమతి వోక్కట్టిచీవ యెల్లజగములన్. 203

సీ. దేవేంద్రవిభవంబు ధిక్కరింపఁగఁ జాలు
నైశ్వర్యసౌఖ్య మనాదరించి
బిసవల్లికం బెనుం బేశలంబగు మేను
నుపవాసములఁ గార్శ్య మొందఁజేసి
కృపఁజూచు చుట్టాలనెల్లరం దృజియించి
విషయసౌఖ్యములెల్ల విడచిపెట్టి
బ్రహ్మచర్యముఁ బూని వనజాక్షులకు దుష్క
రంబైన వననివాసంబుఁ బూని

తే. తగులఁగాఁ జేసి చిత్తంబుఁ దపమువిూఁద
దేవి ! వెతఁగూర్చి యాత్మఁ గుందింపఁదగునె
యుపశమింపఁగఁ జేయుట యొప్పుఁగాక.
వీనితోఁ గూడ మరణింపఁ బూనవలదు. 204

తే. జనని యైనను హితుఁడైన జనకుఁడైన
వల్లభుండైనఁ జచ్చుచో వారివెంటఁ
జచ్చుటరయంగ మూర్ఖులు జ్ఞానశూన్యు
లైనవారల తెఱఁగది యబ్జవదన! 205

క. మరణించినతనికై యను
మరణం బొనరింపఁ దొలుత మరణించిన యా
పురుషుం డొకించుకయుఁ దాఁ
బరికించునె తత్ఫలంబుఁ బడయఁగలాఁడే. 206

చ. గడసినయట్టి వాని బ్రదికించునొ, వేల్పులతేనిపీటి కే
ర్పడఁ గొనిపోవునో, నరకబాధల మాన్పునొ, పుణ్య మిచ్చునో,
తొడరి గతాసుఁగూడి సొదఁ దూఱినయంతట లాభమేమి యో
పడఁతుక! యాత్మకర్మపరిపాకఫలంబును బొందు నాతఁడున్. 207

క. తనయంత దనువుఁ దొఱఁగిన
మనుజుఁడు నత్యంతపాపమగ్నుండగు ని
ల్చినయెడ జలాంజలుల మృతిఁ
గనినతనికిఁ బ్రియము సేయఁగలుగుం బొలఁతీ! 208

సీ. అంగజుం డభవునేత్రాగ్నిఁ గ్రాగుటఁ జూచి
ప్రాణాలతో రతి బ్రదుకలేదె
పాండురాజు గతింపఁ బరికించి కుంతియు
మహిమీఁద నసులతో మసలలేదె
మదనోపముం డభిమన్యుండు మరణింప
నుత్తర జీవించి యుండలేదె
దశరథుండు గతింపఁ దత్కళత్రత్రయం
బుర్వి నూర్పులఁ బూని యుండలేదె

తే. యరయ ధృతరాష్ట్రుకూఁతురై యధికబలులు
నూఱుగుర సోదరులుఁ దన్ను గారవమున
సాఁకుచుండంగఁ బెరుగు దుస్సలయు సైంధ
వుండు విభుఁడు నశింపఁ దా నుండలేదె. 209

వ. దేవి! మఱియును సురాసుర ముని మనుజ సిద్ధగంధర్వకన్యకలను భర్తృవిరహితలై పెక్కండ్రుండిరనుట ప్రసిద్ధంబు, యదియునుంగాక పుండరీకుని సమాగమంబు మఱల నీకు లభించుననుచు నమ్మహానుభావుం డానతిచ్చుటం జేసి కొంతకాలంబు నిరీక్షింపందగు మహాత్ములును యథార్థవాదులును నగువారి మాట లెప్పుడును వ్యర్థంబులగునే, దయార్ద్రహృదయుండగు నప్పురుషుండును మృతుఁడగు పుండరీకుని బ్రదికించుటకనియే సురనగరంబునకుం గొనిపోవ నోపు, దీన నెంతయు సంశయము లేదు. మహాత్ముల ప్రభావంబు లగోచరంబులు, తపస్సిద్ధు లత్యాశ్చర్యసమన్వితంబులు, సంసారప్రవృత్తులనేకప్రకారంబులు కదా! ఎంతటి యూహాపోహలు గల నిపుణమతు లీవిషయంబు నాలోచించినను పుండరీకునకుఁ బ్రాణదానంబు సేయుటకై కొంపోయెననియే తోఁచును కాని యొండుతలంపు బొడసూపదు వినుము. 210

సీ. విశ్వావసుండన వెలయు గంధర్వరా
జునకును మేనక యనఁగఁ బరఁగు
త్రిదశవారాంగనాతిలకంబునకుఁ దగఁ
బ్రభవించె సుత ప్రమద్వర యనంగ
నా బాల స్థూలకేశాశ్రమంబునను ఘో
రాహి సందష్టయై యసులఁ దొఱఁగ
భార్గవుం డను మౌనివరునకుఁ బౌత్రుఁడుఁ
బ్రమతియన్మునికిఁ బుత్రకుఁడునైన

తే. రురు వనం బొల్చు మునికుమారుండుఁ గరుణఁ
దనదు జీవితమున సాము ధారవోసి
లీల బ్రదికింపఁడే వేల్పులేమ నెల్ల
మనములర్థి మెచ్చి యాతని వినుతిసేయ. 211

సీ. తనయుఁడౌ బభ్రువాహనుచేతఁ దెగిన ని
జేశు నర్జునుఁ బ్రోవదే యులూచి
ద్రౌణిబాణజ్వాల తగిలి చచ్చిన పార్థ
మనుమని బ్రోవఁడే దనుజవైరి
మృతుఁడైన గురుపుత్త్రు బ్రతికించి యుపదగా
గురున కర్పింపఁడే మురహరుండు
పంచత్వమొందిన వసుధామరకుమారుఁ
బ్రోవఁడే రఘువంశభూషణుండు

తే. దేవి! యప్పుండరీకుండు నీవిధమున
బ్రదుకు గనవచ్చుఁ దెలియు నెవ్వండు విధిని
మానవున కూర్పు విడచుటకైనఁ గాని
కలదె స్వాతంత్ర్య మింతయుఁ గమలనయన! 212

సీ. అతిదారుణములు గదా నిర్దయాత్ముఁడౌ
దైవంబు కావింపఁ దలఁచుపనులు
జాఱనేరదు కదా చాలకాలమునుండి
మనమునందునఁ దగుల్కొనిన నెనరు
కలికి! సౌఖ్యము లనుక్షణభంగురంబులై
తఱచుగఁ గాన్పించుఁ గఱచ లగుచు
నెన్నాళ్లు గడపిన నింతైనఁ దీఱక
మిగులంగఁ బాడవులై నెగడుఁ బెతలు

తే. వేయిభవముల విరహంబు వెలయ నొక్క-
భవమున సమాగమముఁ గల్గుఁ బ్రాణితతికి
వినుము సంసారమునఁ గూలు జనుల కిట్లు
గలుగు నవ్వాని ధీరులు మఱపుకొంద్రు. 213

తే. అనుచు నిటువంటి మృదులవాక్యములతోడ
వెతలఁ గుందెడు నమ్మహాశ్వేతకలఁతఁ
దీర్చి దోసిలితో నీరు దెచ్చి వలదు
వల దనుచునుండఁ గడిగె నవ్వనితమోము. 214

తే. వినెడువారల నెల్లఁ బెన్వెతల ముంచు
నమ్మహాశ్వేత తెఱఁగెల్ల నాలకించి
దివసకృత్యంబులఁ దొఱంగి దీనవృత్తిఁ
బొలిచె జలజాతసఖుఁ డధోముఖతఁ జెలఁగి. 215

వ. తదనంతరమున దివసంబు నతిక్రమింపుచుండఁ బరిణతప్రియంగు మంజరీపరాగసంకాశంబగు పింజరవర్ణంబున మార్తాండ మండలంబు దివిజపథంబునం బొలుపాఱి వ్రేలాడుచుండఁ, గుసుంభకుసుమరస రక్తములగు మార్దవంబగు నస్తాతపంబు దిఙ్ముఖంబులం బరిత్యజింపుచుండఁ జకోరనేత్రతారకాకాంతితోడను, బింగళవర్ణంబుతోడను నంబరతలంబుఁ జెన్నారుచుండ, జలదపథంబున నెల్ల నంధకారం బల ముకొనుచుండం బొలుపాఱు నిశాముఖంబున నల్లనల్లన మహాశ్వేత లేచి భగవతియగు పశ్చిమసంధ్యం బూజించి కమండలుజలంబునం జరణంబులం గడిగికొని వెచ్చని నిట్టూర్పు విడచి ధరణిపైఁ బయ్యెద చెఱఁగుఁ బఱచుకొని యందు విశ్రమింపం జూచి చంద్రాపీడుండును లేచి కుసుమ సమన్వితంబగు ప్రస్రవణజలాంజలి మీఁదికిం జల్లి సంధ్యాదేవినుపాసించి, కోమలంబులగు లతాపల్లవంబులం గొని తెచ్చి యటనున్న రెండవఱాతిపై నొకతల్పంబుఁ గల్పించుకొని దానియం

దాతండను విశ్రమించి మాటిమాటికి నమ్మహాశ్వేతావృత్తాంతమే తలఁచుకొనుచు నక్కటా! యీమరునిచేఁ బరాభవంబు నొందిన మహాపురుషులుచుం దమయంతిఁ బ్రాణంబుల విడనాడుకొనుచుండిరి. త్రిజగదర్చితశాసనుండును, భగవంతుండును నగు నాకుసుమశరాసనున కిదెనమస్కారం బని మనంబునం దలఁచుకొనుచుం బొంతకుఁ బోయి మహాశ్వేతం గనుఁగొని దేవి! నీకుఁ బరిచారికయు, వనవాసమిత్రంబును, దుఃఖసహాధ్యాయినియు నగు న త్తరళిక యెటకుం బోయెనని యడుగుటయు— 216

ఉ. రామ! మహోగ్రకల్మషవిరామ! పరాక్రమభీమ! నీరద
శ్యామ! పవిత్రనామ! విలసన్ముఖసోమ! మరాళచందనో
ద్దామయశోభిరామ! సముదంచితధామ! సురారిశైలసు
త్రామ! నిరస్తకామ! వసుధావరవంశలలామ! రాఘవా! 217

క. అవ్యయ! యనంత! నిత్యా!
దివ్యాత్మక! దివ్యరూప! దివిజస్తుత్యా!
భవ్యప్రద! త్రిభువన సం
సేవ్య, జగద్భరణనిపుణ! సీతారమణా! 218

గద్య.

ఇది శ్రీమద్భారద్వాజసగోత్రపవిత్ర, కామేశ్వరీ శ్రీరామ
దంపతీసుపుత్ర, సుధీజనవినుతచరిత్ర, శ్రీపరమేశ్వర
కరుణాకటాక్ష సంప్రాప్తకవితా విశేష, వినయా
దార్యప్రముఖనిఖిలసుగుణవిభూష, శేష
కవిప్రణీతంబైన పద్యకాదంబరి
యను మహాకావ్యంబునఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః

# పద్యకాదంబరి.



## పంచమాశ్వాసము.



శ్రీకాంతాకుచకస్తూ
రీకలితసువక్ష ! పుండరీకదళాక్షా !
లోకైకభరణదక్షా !
శ్రీకర కరుణాకటాక్ష ! సీతాధ్యక్షా ! 1

వ. విను మమ్మహాశ్వేత చంద్రాపీడున కిట్లు వినిపింపఁబూనె. 2

సీ. విను మోమహాభాగ ! మునుపు చెప్పితిఁగదా
యప్సరఃకుల మొకం డమృతమందు
నుద యించెనని దాన మదిర యనంబొల్చు
నంభోజవదన కన్యక జనించె
సకలగంధర్వమ స్తకరత్న కోటీర
సురుచిర కాంతివిస్ఫురితచరణ
రాజీవుఁడగు చిత్రరథుఁడను గంధర్వ
విభుఁ డప్పొలంతినిఁ బెండ్లియాడి

తే. తరుణి కామెకు మహిషీపదంబు నొసఁగి
వారలుఁ బరస్పరప్రీతి వరలుచుండఁ
బుట్టెఁ గాదంబరి యనఁగఁ బట్టి యొకతె
యఖిలలోకంబులకు రత్న మనఁగ మించి. 3

క. ఒకతల్పంబునఁ బడకయు
నొకపళ్లెరమంద కుడుపు నొనరఁగనొకపా
త్రిక నీరు ద్రావుటయు రా
జకుమారక! మాకు నివ్వి సహజములెపుడున్. 4

తే. ఆమెయును నేను నొక్కచో నాడుకొనుచు
నృత్యగీతాదికంబుల నేర్చుకొనుచు
శైశవముఁ ద్రోసినార మిలేశ! మాకుఁ
బ్రాణ మొకటియె కాని దేహములు వేఱు. 5

క. తరుణీమణి కాదంబరి
యరయుచు నాచరిత మమ్మహాశ్వేత విని
ర్భరహర్ష మొందునంతకుఁ
బరిణయ మే నొల్ల ననుచుఁ బ్రతినం బూనెన్. 6

తే. పరిణయం బొల్లకున్న నన్ బలిమిఁబట్టి
తండ్రి యెవ్వానికైన నీఁదలఁచునెడల
ననలముననైన విషముననైనఁ గుడుపు
నుడిగియైనను బ్రాణముల్ విడతు ననియె. 7

క. తనకూఁతు శపథమును బరి
జనులవలన మఱియు జగముజనములవలనన్
విని చిత్రరథుఁడు యౌవన
మునఁ దనరిన కూఁతుఁజూచి పొగులుచునుండెన్. 8

ఉ. కూఁతు రొకర్తయౌటఁ గడుఁగూరిమి నయ్యమఁ బెంచుచుంట, న
య్యోగ్య తగదీవిధం బనఁగనోపక తల్లియుఁ దండ్రియున్ గుణో
పేతుని నొక్కకంచుకినిఁ బిల్చి తనూజకుదంతమున్ మహా
శ్వేతకు నాకుఁ జెప్పఁబనిచెం జెలినొంచ సురల్తురన్ మతిన్. 9

సీ. ధరణీశపుత్ర ! చిత్రరథుండు పంచిన
కంచుకి వచ్చి న న్గాంచి, నాదు
సకియ కాదంబరిచంద మంతయుఁ జెప్ప
విని, మనంబున వంత యినుమడింప,
క్షీరోదుఁడనుపేరఁ జెలఁగు నాకంచుకి
వెనువెంటఁ దరళికం బనిచియుంటి
యఱిఁగి కాదంబరి నరసి నాపల్కుగా
నిట్లని వినిపింపు మీవటంచు
తే. నేను జీవించియుంట నీ కిష్టమేని
నీవు జననీజనకులఁ గుందింపకుండ
వారి యనుమతి చొప్పున వరలుమనుచుఁ
జెప్పఁ బంచితి నంత వచ్చితివి నీవు.

వ. అంతలోన నీలలోహితజటామండల చూడామణియగు తారకావల్లభుండు శోకాగ్నిదగ్ధమధ్యంబగు నమ్మహాశ్వేతాహృదయంబు ననుకరింపుచున్నట్లును, మునికుమారకవధజనితమహాపాపంబును వహించుచున్నట్లును, జిరకాలసంగతంబైన దక్షశాపాగ్నిదాహచిహ్నంబును జూపుచున్నట్లును, జెలఁగు నంకంబునూని నిరంతరభస్మాంగరాగధవళంబై కృష్ణమృగాజినాచ్ఛాదితార్ధభాగంబగు కాత్యాయని వామకుచంబుపోలికఁ జెలువారి, కైరవాకరంబులకు వికాసంబు గూర్పుచు, దశదిశలకు శౌక్ల్యంబు గల్పింపుచు, జందంబుచందంబునం దెల్ల నగుచు, శ్వేతాతపత్రంబుపోలిక మెఱయుచు, మానవతీమానవిద్వేషియై యుదయింప, హిమకరకరకలితంబులై తారకాకాంతులు క్షీణింపుచుండఁ, గైలాసచంద్రమణిశిలలు ప్రవహింపుచుండు సమయంబున నిదురింపుచున్న మహాశ్వేతం గనుంగొని, కిసలయతల్పంబున నల్లన విశ్రమించి, నెమ్మనమ్మున నేవంవిధవ్యాపారుండ

నగు నన్నుఁగూర్చి వైశంపాయనుం డేమనునో గదా! పాప మాపత్ర లేఖ యెట్లు భావించుకొనునో! సహచరులగు రాజపుత్రు లెల్లరు నేమనుకొనుచుందురో! యని వితర్కించుకొనుచు నే నిదురించి, యుషఃకాలంబున సంధ్యాదేవి నుపాసించి శిలాతలంబునఁ గూర్చుండి మహాశ్వేత యఘమర్షణమంత్రంబుల జపింపుచుండఁ జంద్రాపీడుం డును బ్రాభాతికకృత్యంబుల నిర్వహించికొనినంత.

సీ. విపులవక్షమువాఁడు పీనోరువులవాఁడు
నాజానుబాహుల నలరువాఁడు
నతిదీర్ఘలోచనాంచితవినిర్మలదీప్తి
నిఖిలదిక్కులయందు నించువాఁడు
పదియు నాఱేఁడులవాఁడు గంధర్వకు
మారకుం డైన కేయూరకాఖ్యుఁ
డెదు వెంటఁ దరళిక చనుదెంచి సంజాత
కౌతుకంబున నృపసూతిఁ బెద్ద

తే. తడవు గాంచి మహాశ్వేతకడకు నరిగి
వినతి గావించి చెంగట విశ్రమించెఁ
బిదపఁ గేయూరకుఁడు మహాశ్వేత కెఱఁగి
యధిపుసాబగున కచ్చెరువందుచుండె. 12

వ. మహాశ్వేతయు. 13

క. ఆదట నుడిగి జపంబుఁ
మోదంబునఁ దరళికం గనుంగొని కంటే!
కాదంబరిఁ గుశలినియే
సాదరగతి నీమపలుకు లాయమ వినెనే. 14

క. అనుటయుఁ గాదంబరి నేఁ
గనుఁగొని భవదుక్తులెల్లఁ గడఁకం జెప్పన్
విని పంపెఁ దనదుచరితము
వినిపింపఁగ నితని నాత్మ వీణావాహున్. 15

వ. అని చెప్పి యామె చందం బితఁ డెఱిఁగించుననని మహాశ్వేతకుఁ గేయూరకుం జూపి మిన్నకుండుటయు, 16

సీ. అంతఁ గేయూరకుం డామెఁ గన్గొని మహా
శ్వేత ! కాదంబరి ప్రీతి నిన్నుఁ
బాలిండ్ల కొత్తుగా నాలింగనముఁ జేసి
యనియె నీతరళిక యరుగుదెంచి
నాకుఁ జెప్పినపల్కు లాకలించితి నిట్లు
సేయుట యరయ నా చిత్తవృత్తి
నెఱుఁగుటకో, లేక, గృహవాసనిందయో
భక్తులఁదొఱఁగు నుపాయమొక్కొ
తే. కోపమొకొ కూర్మినడఁచు నాలాపమొక్కొ
కాక నాచిత్త మెఱుఁగవో కలికి! యిట్లు
చెప్పఁబంచితి వక్కట సిగ్గులేదె
కఱపి రెవ్వారు నీకిట్టి కఱకునుడులు. 17

ఆ. సుఖియు సుఖము లొందఁజూడఁ డిత్తఱి నన్ను
నడుగనేల వెతల నడరు మమ్ముఁ
జెలుల కొదవినట్టి సిలుగుల కెదఁ గుందు
నట్టి జనులకబ్బునా సుఖాశ. 18

తే. ఎవనిచే నాదు ప్రియసఖ యిట్టి విషమ
దశల పాలయ్యెఁ గూళయుఁ దారుణాత్ముఁ
డైన యాచిత్తసంభవు నభిమతముల
నెవ్విధంబున సఫలంబు లే నొనర్తు. 19

ఆ. తమకు మిత్రములగు తామరల్ దిననాథుఁ
డొఱఁగినంత సొంపు తఱిగియుండఁ
జూచి చక్రవాకసుదతియు సుఖమొందఁ
దలఁప దనిన మమ్ముఁ దడవ నేల. 20

తే. మగని విరహంబునకు నెదఁ బొగులుచుఁ బర
పురుషదర్శనవాంఛయుం బఱిహరించి
ప్రాణసఖియుండఁ దెగువమై నడరి యన్య
పురుషుఁ డెవ్వాఁడు నామదిఁ జొరఁగలాఁడు. 21

ఉ. అక్కడ నామనెచ్చెలి నిజాధిపుఁ డీల్గఁగ వానిమీఁది పె
న్మక్కువ పేర్మి ఘోరనియమంబులఁ దాల్చి సుఖాభ్యపేతయై
పొక్కుచునుండ నత్తెఱఁగు బుద్ధిఁదలంపక యెట్టిభంగి నే
నక్కట! పెండ్లియాడి సుఖమందఁ దలంచెద నంతకాళ నే. 22

వ. నీయందు నాకున్నప్రేమకతంబున. 23

ఉ. పెద్దలమాటలన్ వినక పెంపుఁ గణింపక లోకనిందలం
బెద్దఁదలంప కింతులకుఁ బెట్టనిభూషణమైన లజ్జమెం
పుద్దవిడిం దొలంగి బ్రతుకొల్లని నే నిపు డిట్టిచేఁత కో
ముద్దియ! చెప్పు మెప్పగిదిఁ బూనెద నెట్లు సుఖింప నెంచెదన్. 24

క. ఈపగిది నంటి ననుచున్
గోపింపకుమమ్మ! యిదె ప్రణుతిఁ జేసి వెసన్
నీపదముల వ్రాలెదఁ గరు
ణాపూరితలోచనముల ననుఁ గనుఁటొప్పన్. 25

తే. ప్రీతిఁగేయూరకుఁడుమహాశ్వేతకిట్లు
తెలుపఁ గాదంబరిచరిత్ర మెఱమి నెఱిఁగి
యెదియొ చింతించియాతని కిట్టులనియె
నేగు మరుదెంచి వారికి హితమొనర్తు. 26

వ. అని చెప్పి, కేయూరకుం బంచి పిదపఁ జంద్రాపీడునిం జూచి రాజ
పుత్ర! హేమకూటం బత్యంతరమణీయంబు, చిత్రరథరాజధానియుం
గడువిచిత్రంబు, నాచెలియగు కాదంబరియు మహానుభావురాలు. 27

సీ. గమనంబు నీకు ఖేదముఁ గూర్పకున్నని
నెఱయ నామాట మన్నింతువేని
మును పెఱుంగని వింతలను జూడఁదలఁతేని
యెలమిఁ జూచెదవేని యీజనంబు
నుడుగని చెలిమి నాయెడ నీకుఁ గలదేనిఁ
ద్వత్కృపం గొన మాకుఁ దగునయేని
నీకుఁ గల్గినపనుల్ నెఱిచెడకున్నని
నాకోర్కెఁ దీర్ప నంగీకరించి

తే. తివిరి నాతోడఁగూడి యేతెంచి, హేమ
కూటముంగాంచి యటనొక్క పూఁటనిలచి
మగువఁ గాదంబరిం జూచి మఱుదినమునఁ
బయనమై నీకుఁ జనవచ్చుఁ బార్థివేంద్ర! 28

తే. నిన్నుఁ గన్గొనినంతన నిజము నాకుఁ
గల్గిన విచారమెల్లనుం గ్రాఁగిపోయె
సజ్జనులరాక యెట్టి విచారమైనఁ
గెడపి సుఖము నొసంగదే పుడమిఱేఁడ! 29

క. అని చెప్ప మహాశ్వేతం
గనుఁగొని నృపసూతి నీకుఁ గనిపించినయం
తనఁ బరుఁడయ్యె నితం డో
వనితా! నీవలసినట్లు పనిగొను మనుచున్. 30

వ. అమ్మహాశ్వేతతోఁ బయనంబై హేమకూటంబు సొచ్చి గంధర్వరాజ
భవనంబు నతిక్రమించి ఛాయాకరతోరణంబులం జెలంగు కన్యాంత

రంబు లేడింటిం గడచి కన్యాంతఃపురద్వారంబుకడకుం జేరినంతం బ్రతీహారిజనంబు సమ్భ్రమాశ్వేతాదర్శనంబునం గడువడి లేచి వందనం బొనరింపుచు, మార్గంబుఁ జూపించుచుండ నొక్కచో గుమిఁగూర్చిన త్రిలోకవనితాజనసమూహంబునుంబోలెఁ గ్రొత్తగఁ గనుపట్టు నంగనాద్వీపంబుచుంబోలె నొప్పుచు శృంగారమయంబై, సౌందర్యమయంబై, మన్మథమయంబై, కుతూహలమయంబై, ప్రేమమయంబై యాశ్చర్యమయంబై, పొలుచు నబ్బాలికాంతఃపురాభ్యంతరంబు నచ్చంద్రాపీడుం డవలోకించె.

సీ. మరలక వర్షించు శరదిందుబింబవృ
ష్టి యనంగ ముఖముల చెలువుదోఁప
భువినెల్ల నీలకైరవవనావృతఁ జేయు
కరణిఁ దోఁచుచు నపాంగములు మెఱయఁ
గదలుచూపెకు కాముకార్ముకావళు లనఁ
భ్రూలతావిభ్రమంబులు దలిర్ప
నరపతిక్రమదోషాధ్వంబు లనఁ గేశ
పాశాంధకారముల్ ప్రజ్వరిల్ల

తే. ఫుల్లకుసుమప్రభోజ్జ్వలంబులు వసంత
దివసములవోలె దరహాసదీప్తు లమరఁ
గ్రాలె నయ్యంతిపురము పెక్కంద్రు వికచ
జలజదళచారునేత్రలు మెలఁగుచుంట. 32

సీ. లలి సఖీహస్తావలంబనంబులయందు
పాణిగ్రహంబులు వరలుచుండు
దఱచుగాఁగ నశోకతరుతాడనములందు
చరణాభిఘాతముల్ సాఁగుచుండు

నిలయలతాసక్త కలశక క్రములంద
భుజలతాపరిరంభములు దనర్ప
విభ్రమోల్లసితముల్ వేణువాద్యములంద
చుంబనంబులు గడు సొబగుమీఱ

తే. వెలయు నఖరప్రహారముల్ వీణలంద
హస్తఘాతంబు లల బంతులాటలంద
పూని సురతాతిరక్తమై పొలుచు సురత
మెలమి నేర్చుచు నా నొక్క చెలులఁ గనియె 33

సీ. గండస్థలావలోకనము యయ్యెడముఖ
ప్రక్షాళనంబయి పఱలుచుండఁ
జెలువాఱు జిగిమోవి చిఱునవ్వుకాంతియే
మొయిపూఁతయై సొంపు మీఱుచుండ
మరునితూఁపులఁబోలెఁ బరఁగెడు చూడ్కులే
కర్ణోత్పలంబులై క్రాలుచుండఁ
జిగురాకువాతెఱ నెగడెడుదీప్తియే
కుంకుమపూఁతయై కొమరుమిగులఁ

తే. గెరలు నాలాపములె వల్లకీరవములు
కరతలంబులె విభ్రమసరసిజమ్ము
లెనయు నిజదేహకాంతి గాసెనయుఁ గాఁగ
దనరు శుద్ధాంతకాంతలఁ గనియె నతఁడు. 34

చ. చరణములందు లాక్షయును జాల భరంబుగఁదోఁచె మేనులం
గొరలిన మేల్మిసుంగులును గూర్చె శ్రమంబు నితంబసీమలన్
సురుచిరమేఖలాకృతుల శోభిలు నవ్వకుళస్రజంబులున్
విరివిగఁ దోఁచుటన్ గమనవిఘ్నకరంబుగ నయ్యె నయ్యెడన్. 35

తే. ఇట్టి భవనంబుఁ గాంచి యొకింత లోని
కరిగి కాదంబరీసతిపరిజన ముఁ
జేరి యోండొరులతోడఁ జెప్పుకొనుచు
నున్న పల్కుల విని నిట్లు మన్నభేఁను. 36

సీ. ధవళాక్షి ! లవలీలతామండపంబులఁ
గేతకీధూళులచేతఁ గూర్పు
కలికి ! గంధోదకకనకదీర్ఘికలందు
రతనంపుటిసుక నేర్పఱఁగఁ జల్లు
పద్మాక్షి ! కర్పూరపల్లవరసమున
గంధపాత్రములకు గందమలఁదు
మెస మణిదీపంబు లిడు గృహదీర్ఘికా
తాపి ఛవీధికాతమములడఁగఁ

తే. గమలదళనేత్ర పక్షిరక్షణము కొఱకు
ముత్తెములచేత దాడిమంబులను గప్పు
కనకసమ్మార్జనులఁ బూని కలికి ! దుడుము
వెసఁ గదళిగృహమరకత వేదికలను. 37

తే. అతివ ! త్రాగించు గృహకలహంసములను
జలజ మధు రసముం దెచ్చి యెలమితోడ
సుదతి ! పంజరకలితపుంస్కోకిలముల
కిమ్ము చూతాంకురాహార మింపుమిగుల. 38

తే. సకియ ! పిప్పలీతండుల శకలములను
విరియఁజల్లు చకోరపంజరములందుఁ
దరుణి ! రచియింపుమీ సుమాభరణములను
గొమ్మ ! క్రీడాద్రి నిలుపు చకోరకముల, 39

వ. అనుచు నిట్లు చెప్పుకొనుచున్న కాదంబరీపరిజనంబుల వచనంబుల నాలించుచుం గాదంబరీగృహసమీపంబునకుం బోయి యట నొక్క-యెడ. 40

ఆ. కన్యకాజనంబు కనకరత్నవిభూష
ణముల నెసఁగి చుట్టు నమరియుంట
లలితరీతిఁ గల్పలతికావళులచేతఁ
గొలువఁ బడెడునట్లు వెలుఁగుదాని. 41

తే. కప్పుపుట్టంబు పఱచిన ఖట్వమున సి
తోపధానంబు నిడుకొని యొఱఁగి దేహ
కాంతి సలిలంబునఁ గిటీంద్రదంత సమవ
లంబయగు ధాత్రి నాఁగఁ జెలంగుదాని. 42

క. మణిమయభూషణ నినద
ప్రనృత్యదుజ్జ్వలమయూర వరచంద్రక సం
ప్రణుతంబై పొలుచు గృహాం
గణమున వీక్షింపఁ బడుచుఁ గ్రాలెడుదానిన్. 43

తే. జలజభవుముష్టి గళితమై జఘనమను
దగ్రశిలఁ బడి ద్విభాగతంబైనయట్టి
చారుతరమైన లావణ్యపూర మనఁగ
నమరు నూరుద్వయమున నొప్పుదాని 44

క. కనుఁగొనియెడు నట్టితలం
పున గుమియై వచ్చియున్న భువనత్రితయుం
బన నెంతయు నింపగు చి
త్ర నికాయమునడుమ లీలఁ దనరెడుదానిన్. 45

క. బిగిచనుల మఱుగున మనో
జ్ఞగతిం దగు మొగముఁ జూడఁజాలమికిఁ గడుం

బాగులుచు నానాఁటికి స
న్నగిల్లెననఁ దోఁచు నడుమునఁ జెలఁగుదానిన్. 46

ఉ. కోరి నితంబబింబమునకున్ గుడివోలె నెసంగుచు న్మణి
శ్రీరుచి నన్యదృష్టి నెడఁజేయుచు స్పర్శసుఖంబున న్మెయిన్
గూరిన రోమహర్షణమునన్ వెలికిన్ వెడఁగ్రక్కులాగు నొ
ప్పారెడు రత్నమేఖల సమంచితలీలఁ జెలంగు కోమలిన్. 47

వ. అధోముఖంబులై ప్రసరించు శ్రవణాభరణకిరణమ్ములఁబోలి విమల లావణ్య జలమృణాళవల్లికలనం బొలుపారు బాహువులతోడను, మణికంకణభారవశంబున మాటికిం బ్రవహించు స్వేదజలలవజాల కంబునుంబోలు నఖకాంతుల వర్షించుకరయుగంబున మెఱయుచు, నవయౌవనపవన సంక్షుభితంబగు రాగసాగరంబునం బొడమిన పవ డంపు దీవలంబోలె నెఱుపులై మీఁదికెగసినతరగలంబోలు నధ రంబులం జెలంగుచు, రాగంబు పెంపున లోనికి జని చిక్కిన మన్మథ హృదయంబో యన సిందూరరసవిరచితతిలకంబున నెఱిమీఱు లలాటంబునం గ్రాలుచు, గాఁపోలిక ధవళాంశుక రచితోత్తమాంగా భరణయు, సాగరవేలావనరాజివోలె నళికులనీలతమాలకాననయుఁ, జంద్రతనువుంబోలె మన్మథవిలాసగృహీతకురుకళత్రయు, వనలేఖ యుంబోలెఁ బాండ శ్యామలనలీలతాలంకృతమధ్యయు, వాసరముఖ లక్ష్మియుంబోలె భాస్వన్ముక్తాంశు భిన్నపద్మరాగభూషణయు, నా కాశకమలినీ లతయుం బోలె విమలాంబరదృశ్యమానమృణాళ కోమ లోరుమూలయు, గల్పతరులతకైవడిం గామఫలప్రదయునై. 48

తే. బద్ధఁగూర్చుండియున్న కేయూరకుఁగని
యీతఁ డెవఁ డెవ్వని కుమారుఁ డేమిపేరు
చెప్పు మీతనికిని మహాశ్వేత కెల్లు
తనరె జతయంచు నడుగు కాదంబరిఁగనె. 49

వ. కాంచి నిజాంతర్గతంబున. 50

ఆ. కడమయింద్రియములఁ గన్నులఁగాఁజేయ
నలువ తలఁపఁడేమొ నాదుకన్ను
లేమి నోఁచుకొనెనో, యీపద్మముఖిసొరుఁ
గనుఁగొనంగఁ గలిగెఁ గఱవుదీఱ. 51

ఆ. సృష్టినాఁడు ధాత చేతాఁకునకు నింతి
వగచునపుడు బొడము బాష్పజలక
ణములఁ బూని ధరణి నలువ చేయఁగఁబోలు
గమల కుముద కువలయముల గముల.

క. అని యనుకొనుచుండఁ దగుల్
కొనియెం గాదంబరీవిలోలాక్షియుగం
బున నతనిచూడ్కి వనజా
ననచూడ్కియు నతని చూపునం దగులువడెన్. 53

తే. తొలుత లేచినయవి మేనఁ బులక లెలమిఁ
బిదప భూషణనినదంబు లెసఁరుకొనియెఁ
దరుణి కాదంబరియు నంతఁ దత్తరమున
లీల నుత్థితయయ్యె భూపాలుఁజూడ. 54

సీ. కంతుఁడు ఘర్మోదకముఁ గూర్చెనే కాని
సంభ్రమోత్థానంబు సాకుఁగొనియె
గమనంబు నూరుకంపము మాన్చెనే కాని
కెలని యంచల కపకీర్తి గలిగెఁ
బయ్యెద నూర్పు లేర్పడ సడల్చెనె కాని
తలవంపు సురటిగాడ్పులకు నమరె
హర్షమే కన్నీరు నడరించినన్ శ్రమః
ప్రసవరంజ బగౌరవముఁ జెందె

తే. లోని చంద్రాపీడునిఁ బూని ముట్టు
వాసచేఁబోలె నక్కున హస్తముంచు
కొనిన నయ్యది బలితంపుఁ గుచయుగంబుఁ
గప్పుకొనుటకు నిడుకొన్నకరణిఁ బొలిచె. 55

వ. చంద్రాపీడుండును నక్కోమలి హృదయప్రవేశంబునుం బరిగ్రహంబుగను, భూషణక్వణనంబును సంభాషణంబుగను సకలేంద్రియాహరణంబునుఁ బ్రసాదంబుగను, శరీరప్రభాసంపర్కంబును రతిసమాగమసుఖంబుగఁ దలంచె. కాదంబరియు నెట్టకేలకుఁ గొన్నియడుగులమేర నడచి మహాశ్వేతం గౌఁగిటం గదియించుకొనియె. మహాశ్వేతయుఁ గాదంబరిం బిగ్గఁగౌఁగిలించుకొని, సఖి! కాదంబరి! భారతవర్షంబున ననేకవరతురంగమఖురముఖోల్లేఖదత్తచతుస్సముద్రముద్రుండును, రక్షితప్రజాపీడుండును నగు తారాపీడుం డను భూరమణుండు గలఁడు నిజదోర్దండవిక్రాంతసర్వసర్వంసహాపీడుం డగు చంద్రాపీడుం డనం బొల్చు నీతం డానరేంద్రచంద్రుని పుత్రుండు. దిగ్విజయం బొనరింపుచు నల్లనల్లన నియ్యెడ కరుదెంచె. అరుదెంచి నాకంటఁ బడినయంతనుండియు నాకీతం డకారణబంధుఁడయ్యె. సకలసంగంబులం బరిత్యజించి కడు నిష్ఠురత్వంబుననున్న మదీయచిత్తవృత్తి నితండు స్వభావసరళంబులగు గుణంబుల నాకర్షించి నాకడన వసింపుచుండె. అకృత్రిమహృదయుండును, ననిమిత్తమిత్రుండును, దయాసాంద్రుండును నగు నితండు లభించుట కడు దుర్లభంబుగదా. 56

సీ. నలువకుంగల సృష్టినైపుణ్యవిభవంబు
సౌందర్యమునకెందు సాటిలేమిఁ
గంజాతనిలయకుం గల్గు నిల్కడయును
ధరణికి సద్భర్తృతాసుఖంబు

నరలోకమునకు నిర్జరలోకసామ్యంబు
మనుజులకన్నుల కేనయు ఫలముఁ
గళలకు నెల్లనొక్కయెడఁ జేరుటకల్మిఁ
బ్రజలకుంగల్గు నగ్రాన్యతయును
తే. నీతనిం జూచి యే నెట్టు లెఱిఁగికొంటి
నెలమిమై నీవు నట్లంగి నెఱుఁగుదనుచు
నీకు తెఱఁగెల్ల నితనికిం దెలియఁ జెప్పి
కొంచు వచ్చితి నిచటి కోచంచలాక్షి! 57

వ. ఇతండు క్రొత్తవాఁడని యెంచి మనంబున లజ్జ నిడుకొనక, సఖ్యత పొదలలేదని తలంచి వినయంబును విడువక, స్వభావం బెట్టిదియో యెఱుంగమి శంకింపక సర్వవిధంబుల నన్నుంబోలె నీతనిం గనుఁగొను, మీతడు నీకు మిత్రుండును, బాంధవుండును, బరిజనుండు నట్లు తలఁచుకొను మటంచు మహాశ్వేతచే నెఱిఁగింపఁబడి చంద్రాపీడుఁడు నమ్మహాశ్వేతకుం బ్రణామం బొనరించె నంత. 58

సీ. చెలువంపుటోరచూపులఁ జూచు చయ్యెడఁ
దనరుచునున్న కాదంబరికిని
గడకేగు చూపులం బొడము ఘర్మాంబుల
పగిది నానందబాష్పంబు లురలె
హృదయంబు వడిఁజనం బొదలు ధూళియనంగఁ
జిఱునవ్వు వెన్నెల నెఱయఁగ్రమ్మె
మఱిమ్రొక్కియితని సంభావింపుమని శిరం
బున కనునట్లు కన్బొమ్మ యొగసెఁ
తే. జెమ్మటలఁ దోఁగుచున్న యా చిగురుఁబోఁడి
యవయవంబులఁ బ్రతిబింబ మమరియుంటఁ
దనువుగాంచిన దర్పకుండనఁగ రాజ
సుతుఁడు చంద్రాపీడుఁడు సొంపుమీఱె. 59

సీ. అందియల్ మ్రోయంగ నవనిఁ జేర్చినవ్రేలు
వడిఁ బిల్చెనన వ్రాలెఁ బదనఖములఁ
గనిపించినంత నొయ్యనఁ జిత్త మెదురేఁగి
కొనితెచ్చె నన నొప్పెఁ జరులనడుమఁ
గలువదండయుఁ బోలెఁ గడు దీర్ఘమగు దృష్టి
క్రాలిన ట్లెసఁగెఁ గపోలసీమఁ
గర్ణావతంససంకలితాళులన దిగ్గె
నతనిఁ గన్గొనునట్టి నతులకనులఁ
తే. బిదపఁ గాదంబరియు మహాశ్వేత కెఱఁగి
సెజ్జఁ గూర్చుండె నమ్మహాశ్వేతతోడ
నమరఁ గూర్చుండె నృపసూతి యాదరమునఁ
బరిజనానీతమయినట్టి పసిఁడిపీఁట. 60

వ. తదనంతరమున. 61

క. వనితామణి కాదంబరి
తనయంతట లేచి కడు ముదంబునఁ జెలి కొ
య్యన శీతలవారిం బద
వనజంబులఁ గడిగి మరలఁ బానుపు నెక్కెన్. 62

క. తనకుం జెలియగు మదలే
ఖ నరేంద్రకుమారు పాదకమలంబుల నిం
పెనయం గడిగిన యది య
వ్వనజేక్షణ కతఁడు వలదు వలదనుచుండన్. 63

క. శ్రవణాభరణపుఁ గాంతులఁ
దవిలినమూఁపునఁ గరంబుఁ దమిఁ గీలిపి మఱిన్
శ్రవణాభరణము నంటు మఁ
గవ నిమురొని కుశల మడిగెఁ గాదంబరినిన్. 46

వ. కాదంబరియు గృహవాసనివాసంబను నపరాధంబునకు లజ్జాపుచు, నెచ్చెలి మీఁది ప్రేమకతంబున నెట్టకేలకుఁ గుశలం బడిగి, పిమ్మట నొక్కింతతడవునకుఁ దాంబూలంబుఁ గొనివచ్చిన కాదంబరికి మహాశ్వేత యిట్లనియె. 65

క. కాదంబరి మన కీతం
డాదరణీయుఁ డగు నభినవాగతుఁ డగుటం
గాదనక యితని కిట న
త్యాదృతి నిడఁ బోలు మనకుఁ దాంబూల మనఘ. 66

సీ. ఇతనికి నాకు నొక్కింతయేనియుఁ జెల్మి
తనరకుండుట నేర్పుతనముఁ బూని
తాంబూల మొలమి నీతని కిచ్చుటకుఁ జాల
సిగ్గగు నాకు నో చెలువ! నీవ
యితనికిఁ దాంబూల మిమ్మన్నఁ గాదంబ
రికి మహాశ్వేత కూరిమి దలిర్ప
లలిఁ బల్కె నీరీతి లజ్జ యేటికి నీవ
యిడుము తమ్ములమన్న నెట్టకేని

తే. దర్పకుం డస్త్రహతి మూర్ఛఁదగులఁ జేసి
నీరము ల మ్ముంచెనన మెయినిండఁ జెమట
లూర నట మున్నకుండఁ గేలొసఁగుమంచు
నవిద యొగిఁ జాఁచెఁ దాంబూల మున్నకేలు. 67

సీ. ధరణీశపుత్రుఁడుం దాం బూలముం బుచ్చు
కొనుటకునై సాచెఁ దనకరమ్ముఁ
దత్కరాన్వేషణార్థముఁ బోలె నయ్యింతి
నఖరాంశుసంతతుల్ నలువు మీఱు

కరము నల్లన నెత్తి ఘర్మాంబుపాతపూ
ర్వకముగ నీకు నర్పణ మొనర్చె
మనసిజుం డీదాసజనముఁ గైకొనఁ బోలు
ననుచు వచింపు చీ దినమునుండి

తే. పెట్టుచుంటిని నాకుఁ జీవితము నెల్ల
నీకు హస్తంబునం దంచు నెతీఁదలిర్పఁ
జెప్పుచుం దమ్ములము కృపు చేత నంచి
వేఱుతాంబూల మమ్మహాశ్వేతకొసఁగె. 68

క. గొనకొని తన్నొకకీరము
వెనుకొని తఱుము నెడ మిగుల వేగంబొలయన్
జనుదెంచి యొక్క శారిక
కనలుచ నిట్లనుచుఁ బలికెఁ గాదంబరితోన్. 69

క. జగతీశపుత్రి! నన్నున్
దగులుచు నేతెంచు నీయనార్యుని దురిత
స్థగితున్ సుభగంమన్యుని
మాగిడింపక యుంట నీకు మంచితనంబే. 70

క. దురితాత్ముఁ డితఁడు నాకుం
బరిభవముం గూర్చునేనిఁ బాయక కాదం
బరి! యొడలు విడతు నిదె నీ
చరణంబులయాన యింత సత్యముసుమ్మీ. 71

క. అనవిని కాదంబరి న
వ్వె నది మహాశ్వేత చూచి వెనుకటిచందం
బు నెఱుంగకుంట నిది యే
మనుచు న్మదలేఖనడుగ నక్కోమలియున్, 72

క. కాళిందిఁ యిద్దిఁ శశిసఖ
ఫాలా! యీశారికకును బరిహాసాఖ్యం
బ్రాలెడు నీచిలుకకు నీ
లీలావతి చేసెఁ బెండిలి మనం బలరన్. 73

సీ. భూపాలసుతకుఁ దాంబూలకరంకవా
హిని తమాలికయనఁ దనరునొకతె
యామెనొక్కర్తు నెయ్యమునఁ జేరఁగఁ దీసి
ప్రొద్దున నేదియో విద్దెచెప్పు
నితని నీశారిక పీక్షించె నదిమొక
లితనిపై పీసు వహించి పొంత
కరుగదు గన్నెత్తి యరయదు ముట్టదు
నెలమి సన్నిధిఁ జేరి పలుకదయ్యొ
తే. నంత మేమెల్లరము దానిచెంతకరిగి
యెంతచెప్పిన శాంతి వహింపదయ్యొ
ననినఁ జంద్రాపీడుండు విని యొకింత
చిఱునగవు నవ్వి యిట్లని చెలువ కనియె. 74

సీ. ధవళాంశుముఖికిఁ గాదంబరీసతికిఁ దాం
బూలం బొసంగు తమాలికాఖ్యఁ
బరఁగెడు నొకచెల్వఁ బరికించి పరిహాసుఁ
డను చిల్క మోహించి యాత్మకాంత
నెడఁబాసి లజ్జావిహీనుఁడై మెలఁగుచు
నేగినదివసంబు లేని నెఱుఁగ
నేరఁడ న్మాట భూనేతలు వినుచుంద్రు
పరిజనుల్ తమలోనఁ బలికికొంద్రు

తే. పలుకు లిఁక వేయ నేటికిఁ బ్రబలె నీయు
దంత మోయింతి! సకలదిగంతరములఁ
గూళయగు నీతమాలికఁ ద్రోలకుంట
తగునె కాదంబరికి లసత్సుగుణవతికి. 75

క. చెలితనము లేని యీపు
ల్గుల కివ్విధిఁ బెండ్లిఁ జేయఁగూడునె కమలా
క్షుల కింతకంటెఁ జిత్తముఁ
గలఁగించెడు కారణంబు గలదే జగతిన్. 76

క. అనురాగశూన్యుఁడగు నీ
పెనిమిటితో నింతదనుక వేగుచు విష ప
హ్న్యశనములఁ జావక ని
ల్చినయది యీశారికయు సుశీలయగుటచేన్. 77

ఆ. కలికి యీతమాలికయు నీశుఁ డఘుగంగ
సమ్మతించె నేని సంగతికిని
గలదె యింతకంటెఁ జులకన వికచార
విందరుచిరముఖుల కెందు నైన. 78

ఉ. ఎవ్వఁడు పల్కరించు మఱి యెవ్వఁడు దీని మొగంబుఁ జూచు నిం
కెవ్వఁడు దీనిపేరు గ్రహియించుఁ దమాలికఁ ద్రోయకున్న నం
చవ్విభునందనుం డనిన నచ్చటి పద్మదళాక్షు లెల్లరున్
నవ్వినఁ జూచి యమ్మనుజనాథునకుం బరిహాసుఁ డిట్లనున్. 79

ఉ. ఇంతటి వక్రభాషణము లింతటిహాస్యపుఁబల్కులున్ మహీ
కాంతసుతాగ్రగణ్య! యెఱుఁగం గలదీమె యీ రాజమందిరా
భ్యంతరసీమలన్ మెలఁగినట్టిద యింతటఁ గట్టిపెట్టు మీ
కాంత యెఱుంగుఁ గాలమును గారణ మీసునకుం బ్రశాంతికిన్. 80

తే. అంతలో నొక్కకంచుకి యరుగుదెంచి
యమ్మహాశ్వేతఁగాంచి యిట్లనియె దేవి!
తెలివతోఁ జిత్రరథుఁ డేగుదెంచి నిన్నుఁ
బిలచుచున్నాఁడు గనుఁగొను తలఁపుగదిరి. 81

వ. అనుటయు నమ్మహాశ్వేత గమనోన్ముఖియై కాదంబరిఁ జూచి సఖి! కాదంబరి! చంద్రాపీడుఁ డెచ్చోటనుండు నని యడుగఁ గాదంబరి జెలు నవ్వు నవ్వి, మహాశ్వేతా! యట్లనుచుఁ బిలిచి దియేమి. యీతం డగపడి నదిమొదలు నాశరీరంబున కీతం డధినాథుం డనుచుండ భవనంబున కును, విభవంబునకును, బరిజనంబునకునుం బ్రభువని వేఱ చెప్పనేల. ఇతనికిఁగాని నీకుఁగాని, యెయ్యెడనుండ నిచ్చవొడను నయ్యెడ నితండుండఁబోలునని విని భవత్ప్రాసాదసమీపంబునం గల యుపవనంబునంబోలుచు క్రీడాపర్వతకంబునందలి మణిగృహంబున నీతండు వసించునని మహాశ్వేత వచియించి గంధర్వవిభుఁడగు చిత్ర రథుంజూచుటకుంబోయెఁ. చంద్రాపీడుఁడును, నమ్మహాశ్వేతతోడఁ బ్రాసాదంబు వెలువడి, వీణావాదినులును, గీతవిద్యాకుశలలును ద్యూతక్రీడాసక్తలును, సుభాషిత పాఠికలును, గాదంబరిచే నియ మింపఁబడిన ప్రతీహారులు పుత్తెంచిన కన్యకలుం దనతోడంగూడి యే తేరఁ బూర్వపరిచితుఁడగు కేయూరకుండు మార్గంబుఁ జూపు చుండ గ్రీడాపర్వతంబునందలి మణిభవనంబునకుం జనియెఁ. 82

క. నరనాథతనయుఁ డరుగుట
పరికించి సఖీజనంబుఁ బరిజనము లోఁగిన్
దొరఁగి వడినెక్కెఁ గాదం
బరి ప్రాసాదంబు వలయుపరిజనములతోన్. 83

వ. అయ్యెడంగల నిజతల్పంబునం గూర్చుండి సమీపంబునంగల పరిచారి కలంగూడి, వినోదింపుచున్న యవసరంబున, గంధర్వరాజపుత్రి! నీ కిది తగునాయని వినయంబు తన్ను నిందించుచున్నట్లును, స్వైరిణి!

యేకాకినివై యిచ్చవచ్చిన నవినయంబొనరింపకుమని బాల్యంబుచే బోధింపఁబడునట్లును, భయస్వభావా! కులకన్యకల కిది తెఱఁగు కాదని గౌరవంబున గర్హింపఁబడునట్లును, దుర్వినయశాలిని! వినయంబును రక్షించుకొనుమని యాచారంబునఁ దర్జింపబడునట్లును మూఢురాలా! మదనునిచే లఘుత్వముం బొందింపఁబడితివి నిగ్రహించుకొనుమని వంశంబుచే ననుశాసింపఁబడునట్లును, నీకీ చంచలహృదయం బేమిటికని ధైర్యంబుచే ధిక్కరింపఁబడునట్లును, స్వచ్ఛందచారిణి! నీచే నే నప్రమాణీకృతనైతి నని కులమర్యాదచే దూషింపఁబడునట్లును గాదంబరి యత్యధికంబగు లజ్జవహించి మఱియు నిట్లని వితర్కించె. 84

సీ. శంకింపనైతి నీ జనముఁ గ్రొత్తయటంచు
నిరుపమసాహసాన్విత నగుట
నను జనుల్ చుల్కఁదనముగఁ జూతురటంచు
నెఱుఁగంగనైతి నిర్హ్రీకనగుట
నితనిమానసవృత్తి యెట్టిదోయనియైన
నరయనైతిని మూఢురాల నగుట
నితనికిఁ గన్పింప నే నర్హనో కానో
యనుచుఁ జంచలనగుట నెంచనైతిఁ

తే. గూడదిదియంచు మదినెంచి కొంకనైతిఁ
దలఁకుఁగొననైతి గురువులవలననైన
భయము గొననైతి లోకాపవాదమునకుఁ
జెలులు నవ్వెదరని యైనఁ దలఁపనైతి. 85

సీ. చెలికత్తెయగు మహాశ్వేతచందమునైన
నెంచనైతిఁ గృపావిహీన నగుటఁ
జెంగటిచెలులు చూచెదరేమొ యనియైనఁ
దలఁపనైతిని మందకలిత నగుటఁ

నిరుచక్రియల భృత్యు లీక్షింతురని యైన
నెఱుఁగనైతిని శూన్యహృదయ నగుట
నంగజోద్వేగం బెఱింగినయది మహా
శ్వేతయు సకలకళాతి నిపుణ

తే. లీసఖుల్, రాజభవన సంవాసచతురు
లింగితాకారవిదులు నీభృత్యవరులు
నన్నివిధములఁ బాడైతి నకట! నాకు
మృతియమే ల్సిగ్గు లేని యీబ్రతుకుకంటె. 86

సీ. తల్లిదండ్రులును గంధర్వలోకంబు నీ
చందంబు నెఱిఁగి యేమందురొక్కొ
యేమి సేయుదు నింక నీ తెఱంగెబ్భంగి
నన్యు లెఱుఁగక యుండ నడఁచిపుత్తు ?
నెవ్వాని కెఱిఁగింతు నీయింద్రియంబుల
కెనసిన చాపల్య మేర్పడంగ
నమ్మహాశ్వేతకు నై యట్లుశపథంబు
సలిపియుఁటినిగదా, సఖుల యెదుట

తే. నట్లు వచియించితింగదా, యదియుఁ గాక
యట్లు చెప్పి కేయూరకు నంపియుఁటి
నాకు విరహంబుఁ గూర్ప నీరాకుమారు
మృత్యువో కంతుఁడో తెచ్చెఱుఁగనైతి. 87

క. కననైతిఁ దలఁపనైతిన్
విననైతి నెఱుంగనైతి వీఁ డేమను జేం
ద్రుని కూర్మిపుత్రుఁడొక్కొ
చనుదెంచినవాఁడు నాదుశపథముఁ జెఱుపన్. 88

వ. అనుచు నొక్కింతతడవు సంకల్పించుకొని పిదప హృదయాంతర్గతుండగు చంద్రాపీడుండుఁ మిథ్యావినీతా ! నాకుఁ గర్తవ్యము లేకున్నచో నేఁనిదే పోవుచున్నాఁడనని చెప్పి నవ్వించినట్లును, తత్పరిత్యాగసంకల్పసమకాల ప్రస్థితంబై కంఠగతంబగు జీవితంబున నవుగఁబడునట్లును, అల్పజ్ఞురాలా ! యీతం డనాదరణీయుఁ డగునో కాఁడో ప్రక్షాళితంబులగు కన్నులతో మరలఁ బరికింపుమనుచుఁదత్కాలసమాగతంబగు బాష్పజలంబున బోధింపఁబడునట్లును, మరల నదోలుతటిభంగి నెట్టకేనిఁ జంద్రాపీడాభిముఖహృదయ యయ్యె. ప్రేమావేశంబునం బరవశయుంబోలె లేచి గవాక్షంబునఁ గూర్చుండి క్రీడాపర్వతంబుఁ గనుఁగొనుచు హర్షజలోద్విగ్నయుం బోలెఁ జంద్రాపీడునిఁ గన్నులం గాక తలంపునంగనియె, అంగుళీగళిత స్వేదజలబిందువు లంటుననుభీతింబోలెఁ జిత్రతూలికలంగాక చింతతోఁ జిత్రించె, రోమాంచం బడ్డువడుననుశంక చేఁబోలె వక్షంబునఁ గాక హృదయంబున నాలింగనంబొనర్చెఁ గాదంబరీహృదయంబునుంబోలె స్వచ్ఛంబగుమణిభవనంబునఁబ్రవేశించి యొకకంబళంబునఁగూర్చుండిఁ తనచరణంబులు కేయూరకుండొత్తుచుండఁ జంద్రాపీడుండు నర్మాలాపంబులం గూర్చునియున్న కన్యకాజనంబునం బరివృతుండై, డోలాయమానంబగు చిత్తంబున నిట్లని వితర్కించె. 89

క. తలకంగ నీవిలాసం
బులు కాదంబరికి సహజములో, కాదేఁ బూ
జలు గొనకయె మెచ్చిన పూ
విలుతుఁడు నామీఁదఁ బంపువెట్టినవాఁడో. 90

క. పలువగల శంక యే లీ
కలికికి నాయందుఁవలపు గలిగినచో నా
జలజాంబకుండ నాకుం
గలసందేహంబు దీర్పఁగలఁ డనుకొనుచున్.  91

తే. మనమునన్ నిశ్చయము చేసికొని యనంత
రమున, నయ్యెడఁ గలయట్టి కమలముఖులఁ
గలసి వీణావినోదాదికములఁ దవిలి,
సంతసంబున విహరించి కొంతతడవు. 92

క. ధరణీంద్రతనయుఁ డిట్లు వి
హరించి యచ్చోటుదొలఁగి యల్లనఁ గ్రీడా
ధరణీధరశిఖరంబున
కరిగెం బ్రమదావనంబు నరయు తలఁపునన్. 93

ఉ. ఆతనిఁ జూచి చిత్రరథునాత్మజయుం జెలియైన యమ్మహా
శ్వేత యదేమొ రాక తడసెం జనుదెంచుచునున్నదేమొ యం
చాతెరువుం గనుంగొన రయంబున సౌధముమీఁదికెక్కెఁ దా
నాతతలీలఁ గౌరి రజతాచలశృంగము నెక్కుచాడ్పునన్. 94

వ. ఎక్కి చంద్రాపీడుం జూచుచుఁ జంద్రాపీడుచేఁ దాఁ జూడఁబడుచుఁ
గొంతతడవుండినంతఁ బ్రతీహారి యొక్కతె చనుదెంచి తనకుమహా
శ్వేతరాక నెఱింగింపఁ దత్సౌధశిఖరంబునుండి క్రిందికి దిగి స్నానాది
కంబుల నిర్వర్తించుకొనియెను. పిదపఁ జంద్రాపీడుండును హర్మ్యా
గ్రంబునుండి దిగి ప్రథమవిసర్జితులగు కాదంబరీపరిజనులు తనకుస్నా
నాదికంబుల నెఱవేర్చినంత నభిమతదైవంబుఁ బూజించుకొని
క్రీడాపర్వతకశిఖరంబుననే యాహారాదికంబులగు దివసకృత్యంబులం
దీర్చుకొని, క్రీడాపర్వతకప్రాగ్భారంబునఁగల మనోహరంబగు లతా
మంటపంబునం దొక మరకతశిలాతలంబునఁ గూర్చుండి విస్తారంబగు
ధవళప్రభం గనుంగొని యట దృష్టి నిగిడింపఁ 95

క. కరిగమన తమాలికయుం
దరళికయుం దొడవు లొడలఁ దాలిచి తనతో
నరుదేర నేగుదెంచెడు
తరుణి న్మదలేఖఁ గనియెఁ దా నృపసుతుఁడున్. 96

సీ. పురుషోత్తముని నాభిపుండరీకంబున
దంబుమీఁదెడు మృణాళం బనంగఁ
దగఁ బాల్కడలిఁ బ్రచ్యుతటి శ్రమనూడిన
వ సుకి నెమ్మోని కూస మనఁగ
శరదంబుధరఖండపరికల్పితమనంగఁ
బూర్ణేందునకుఁ దోడబుట్టువనఁగ
రుచిరకాదంబరీరూపవశీకృత
ఋషిజనహృదయ నిర్మితమనంగఁ
తే. బ్రోఁగుగా నున్న సత్కీర్తిపుంజ మనఁగఁ
గమలరిపుకాంతికిం జీవగఱ్ఱయనఁగఁ
గాంతులీనుచు మద లేఖకరమునందు
గ్రాలు హారంబుఁ గాంచె నారాజసుతుఁడు. 97

ఉ. కాంచి తదుగ్రదీప్తు లటు గల్గుటకుందగుకారణం బిదే
యంచు మదిం దలంపుచు రయంబున నమ్మద లేఖఁ దోడితే
నంచితలీల నాతఁ డెవరైయెలమిం గొని తేర నామె యొ
క్కించుకసేపు రాసుతుసమీపమునన్ వసియించి పిమ్మటన్. 98

సీ. ఏవానిఁ బరవశుం గావింపకుండుఁ దా
వకమైన రుచిరరూపము కుమార!
భవదీయమగు నడంకువయే కదా తాఁపు
గలిగించు నిటువంటి కార్యములకు
నీరూపసంపద నెనయు నీవెవరికి
జీవితేశ్వరుఁడవై చెలఁగకుందు
పూరకఁ గృపఁజూపుచున్న నీ తెఱఁ గేరి
కిట్టి కన్నార్పకయుండఁ జట్టికము

తే. నరయఁగ నిసర్గమధురమై కరఁగు నీదు
వర్తనముఁ గూర్పకుండు నెవ్వరికిఁ జెలిమి
భద్రము లొనర్పకుండు నెవ్వరికి నీదు
నైజసుకుమారవృత్తి లో రాజపుత్ర! 99

క. ఈ విట్టివాఁడ నగుటన్
భూవర ! నినుఁజేరి యింతపొలుపుగఁ బలుకం
గా వేడ్క పుట్టెఁగాదే
నీవిధి వచియింతునేని యాలువుచెడదే. 100

సీ. నీయున్నతిని లెక్కసేయని యట్లుగఁ
జేరిభాషింపఁ జూచితిన యేని
ప్రభుతాభిమానగర్వముఁ జూపునట్లుగు
నెఱినాదరింపఁ బూనితిన యేని
నెలమి నాత్మోన్నతైక మెఱిఁగించునట్లుగు
స్తవము గావింపఁగఁ దలఁతునేనిఁ
బ్రాభవ మెఱిఁగింపఁ బాల్పడినట్లుగఁ
దగ విన్నపముసేయఁ దలఁతునేనిఁ

తే. బూని యారీతిఁ గాదంబకీనతాంగి
కడఁగి కూరిమిఁ బ్రకటించెఁగాని యధిక
విభవయుతురాల ననుచు గర్వించి తనకు
విభవ మెఱిఁగించు టిదికాదు ప్రభుకుమార. 101

క. వనధి మధియించునెడఁ బు
ట్టిన రత్నములం దిదొక్కటియ తగ శేషిం
చినకతమున నీహారం
బనఘా ! పేరొందె శేషహారంబనుచున్. 102

క. వనధీశుఁడుఁ దన యింటికిఁ
జనుదెంచిన వరుణునకు నొసంగె నతండుం
గొనుమని గంధర్వేంద్రున
కు, నతఁడు సుత, కామె నీకుఁ గొనుమని పంపెన్. 103

చ. నిజగుణపుంజభూషితవినిర్మలవిగ్రహశోభితుల్ కదన్
సుజనులునైన మీరలు తనూలతకున్ బరువైన భూషణ
వ్రజమును దాల్పరైనను నృపాలక! చిత్రరథాధినాథు నా
త్మజయెడఁ గల్గు కూరిమికతంబున నైన ధరింపఁగాఁ దగున్. 104

తే. కమలకుం దోడఁబుట్టువై కౌస్తుభంబు
నాఁగఁ జెన్నారు నుపలఖండమును లక్ష్మి
మీఁదఁగల ప్రీతిచేఁ దాల్పలేదె పేరు
టురమునఁ ద్రిలోకవిభుఁడైన మురవిరోధి. 105

ఆ. శౌరికీవు సాటి హారోత్తమం బిద్ది
కౌస్తుభమునకిద్ది కాకపోను
కమలపత్రనేత్ర కాదంబరియు రమా
దేవిఁ బోలకున్నె భూవరేంద్ర! 106

తే. దీని గ్రహియించి కాదంబరీనతాంగి
ముద్దు చెల్లింపఁగా నీకుఁ బోలుఁ గనుచు
స్వర్ణగిరినెత్తమున నుడుచక్రమనఁగ
నతనియురమునఁ గట్టె నా హార మతివ. 107

సీ. అంతఁ జంద్రాపీడుఁడతి విస్మయాన్వితుం
డై మదలేఖ కిట్లనియె సమద
దంతిరాడ్గమన! నీవెంతయుక్తిగ వచి
యింపుచుంటివె యొకండిచ్చుచుండఁ

బుచ్చుకొంటకుఁ ద్రోసిపుచ్చుటకును నిక్క-
మే మెవ్వరము చెప్పు మిగురుఁబోఁడి
మీయిచ్చచొప్పున నీయన నియమించి
సేవఁ జేయించుకోఁ జెల్లు నదియుఁ
తే. గాక కాదంబరీగుణోత్కర మదెట్టి
ఘనుల దాసులఁగాఁ జేయ దనుచుఁ గొంత
సేపు కాదంబరీకథల్ సెప్పుకొనుచు
నిలచి మదలేఖఁ బంపె నానృపసుతుండు. 108

సీ. మదలేఖ యటనుండి కదలి యించుకమేర
యరుగంగఁ గని యుదయాద్రిసంస్థి
తుం డగు రోహిణీంద్రుఁడనఁ జందన
హార దుకూల విస్ఫారుఁడగుచుఁ
గ్రీడామహీధరశృంగసంగతుఁడైన
యట్టి చంద్రాపీడు నరయఁ దలఁచి
పరిజనంబులనెల్ల మరలించి ఛత్రచా
మరముఖ్యచిహ్నముల్ మలఁగఁద్రోసి
తే. చెలఁగుచుఁ దమాలికంగూడి చిత్రరథుని
తనయ, తా నెక్కె మరలఁ దత్సౌధశిఖర
మెక్కి వివిధవిలాసంబు లేర్పడంగఁ
జూచు చటనుండి నృపసుతుఁ జూడఁగొనియె. 109

సీ. అధిపుపై ర్వేర్కొంటు ననుభీతిఁ బలె ముఖం
బున నూర్పులాపఁ గే ల్జొనుపుకొనుచుఁ
దనుసారభాగతాళినికాయ రుతముల
నెలమి నాతనిఁ జేరఁ బిలుచునట్లు

క్షితినాథుఁ గౌఁగిలించెడు మాడ్కిఁ బయ్యెద
యొఱలుచోఁ గేల్గవ నొత్తుకొనుచుఁ
గచగళత్ప్రసవముల్ కడఁగి దోసిటఁబట్టి
కొని మ్రొక్కునట్లు మూర్కొనుచు లీల

తే. గళితమేఖలయై, యించువిలుతుఁ డవని
పతికి నర్పింపఁ బదము లేర్పడ బిగించె
ననఁగఁ దోఁచుచు నాలలితాంగి ప్రొద్దు
గ్రుంకునందాఁక నతనిఁ గన్గొంచునుండె. 110

వ. అంత సాయంసమయం బగుటయు, దివసపరిలంబనరోషారుణంబులగు కామినీలోచనంబులచేఁ బోలెఁ గెంపు గదిరి వియత్తలంబు వెలుంగుచుండ, ఖరకరవిరహనిమీలిత సరసిరుహవ్రాతంబులగు కమల వనంబులు హారిద్వర్ణంబుల నలరుచుండ, దిఙ్ముఖంబు లరుణవర్ణంబులఁ జెలంగుచుండం గుముదషండంబులు ధవళాయమానంబు లగుచుండ, రజనీముఖంబు నీలరుచిం జెన్నారుచుండఁ బునర్దివసశ్రీసమాగమాశలచేఁబోలె రాగాన్వితంబులగుకరంబుల సహితంబుగ భగవంతుండగు సహస్రాంశుఁ డస్తమింపఁ దత్కాలవిజృంభితంబగు కాదంబరీహృదయరాగరససాగరంబునఁబోలె జీవలోకంబు సంధ్యారాగంబునఁ బూరితం బగుచుండ, మానినీనయనాసారవారిం బొదలింపుమ మద నానలదహ్యమాన చక్రవాక హృదయ సహస్ర ధూమంబువోలెఁ దరుణతమాలకాంతిం బొలుచుతిమిరం బెల్లయెడల నాక్రమింపుచుండ దిక్కుంజరకరాకీర్ణంబగు శీకరాసారంబుకరణి వళక్షంబగు నక్షత్రవ్రాతంబునఁ జదలు వొదలుచుండ, సౌధశిఖరంబుననుండి కాదంబరియుఁ గ్రీడాపర్వతక మేఖలనుండి చంద్రాపీడుండును దిగిరి. యంత—

తే. నృపతి శశికాంతమణి శయనించినంత
నెలమిఁ గేయూరకుం డట కేగుదెంచి
యనియెఁ, నోదేవ! చిత్రరథాత్మజాత
తివిరి నినుఁజూడ నిచటికి కేతెంచె ననిన. 113

సీ. నరనాథపుత్రుఁ డెంతయు సంభ్రమంబున
నతిథికై కను నుత్సేకమున
రాజచిహ్నంబు లేర్పడఁ దొఱంగినదాని
నల్పసఖీయుత యైనదానిఁ
గుముదపత్రంబుఁ గర్ణమునఁ దాల్చినదాని
విమలాంబరముల దీపించుదాని
సిరిగందమున నుల్లసిలు నొడల్ గలదాని
మౌక్తికస్రజమున మలయుదాని

తే. నరయఁ దత్కాలరమణీయమైన వేష
మూని మదలేఖతోఁగూడి మోహనీశ్వ
రోదయశ్రీయనఁ వచ్చుచున్నదానిఁ
జిత్రరథరాజపుత్రి నీక్షించె నతఁడు. 113

క. అరుదెంచి యటకుఁ గాదం
బరియుం దనకూర్మిఁ జేటపఱచుచుఁ జెలితోఁ
బరిచారికకై వడిఁ దా
ధరణిం గూర్చుండె సముచితంబగు భంగిన్. 114

క. మగువ మదలేఖ తన్నున్
మగిడింపుచు నెంతచెప్పినను వినకుండన్
జగతీశపుత్రుఁ డతఁడున్
దగఁ జంద్రశిలందొఱంగి ధరఁగూర్చుండెన్. 115

సీ. అందఱుఁ గూర్చుండి నంతఁ జంద్రాపీడుఁ
డీవిధంబున వచియించె దేవి!
నినుఁజూచి ధన్యతం గనిన మాయెడ నీకుఁ
గరుణ కల్గుట కేమి గాని చూచి
పలుకరించుటకైనఁ దలఁపు పుట్టను కదా
కనికరంబున కేమి కారణంబొ
యీగౌరవము నాకు నేగుణంబునఁ గల్గె
నో యింతయు నెఱుంగ నోపనైతి

తే. నీదుసౌజన్యగరిమ వర్ణింపఁ దరమె?
నిజముగా నీకు భృత్యులై నెగడునట్టి
వారు ధన్యులుగద త్వత్కృపాకటాక్ష
కలితచంద్రప్రభలఁ జూచు చలరుచుంట. 116

ఆ. అనుచుఁ జెప్పుచుండ విని మదలేఖ తా
నవ్వసుంధరావరాధినాథు
నరసి మందహాస శరదిందు చంద్రికా
లలితవదన యగుచుఁ బలికె నిట్లు. 117

క. జననాయక! నీనుడులకు
మనమున శంకించి వగచు మాసఖి, నీవి
ట్లన నేటికి నీమన సెఱిఁ
గినయది భవదుక్తు లాలకింపకమును పే. 118

సీ. అని మదలేఖ తానని యూరకుండఁ గా
దంబరి యొక్కింతతడవు నిలిచి
రాసుతుఁ జూచి తారాపీడుఁ డెట్టివాఁ
డతనిదేవి విలాసవతి యునెట్టి

దార్యుఁడౌ శుకనాసుఁ డనునాతఁ డెట్టివాఁ
డల యవంతియు నెట్టి దాపురంబు
గ్రాలెడు నెంతదూరమున భారతవర్ష
మేవిధంబుననుండు నృపతనూజ !
తే. మర్త్యలోకంబునకు సౌఖ్యమూ యటంచు
నడిగి చంద్రాపీడుని కడఁ బయఁడు
మనుమఁ గేయూరకునకుఁ భృత్యప్రతతికిఁ
జెప్పి హార్మ్యాగ్రమెక్కె నచ్చికుయుఁ బోఁడి. 119
సీ. ధరణీశుఁ డాశిలాస్థలముందె పవడించి
వినువక గంధర్వవిభుతనూజ
కేఁసిన సురుచిరాకృతియును బహుళగ
భీరత్వమును, మహాశ్వేతకున్న
యనిమిత్తవాత్సల్యమును, మనలేఖకుఁ
గలిగినయట్టి సౌఖ్యమును, భృత్య
వసులకున్న మహానుభావత్వమును, మఱి
గంధర్వరాజలోకంబునకును
తే. నెగడు సిరియుఁ, గింపూరుషనగరమునకుఁ
గలుగురమ్యత్వమును మదిఁ దలఁచుకొనుచు
నొడయుఁ డారాత్రిఁ గడపెఁ గేయూరకుండు
పాదముల నొత్తుచుండంగఁ బవ్వడించి. 120
వ. తదనంతరమున. 121
తే. చిత్రరథు పుత్రిఁ జూచుచు రాత్రి మేలు
కొనినచంద్రుండు నిద్రించుకొఱకుఁ బోలె
వెలసెఁ గల్లోలకలితశీతలసమీర
పోతసముపేతమైన వేలాతటంబు. 122

తే. చేరి చంద్రాపీడు నీక్షించి లక్ష్మి
మదనబాణాగ్నిసంతప్త హృదయుఁ డౌచుఁ
గైరవదళాంతరంబులఁ గడపి రాత్రి
పంకజవనాంతరంబుల బ్రాలె నొలసి. 123

వ. అంతఁ గ్రమంబున సూర్యోదయంబగుటయుఁ జంద్రాపీడుండు శయ్యా సముత్థితుండై ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చుకొని గృహీతతాంబూలుండై కేయూరకునిఁ బిలిచి కాదంబరి మేల్కాంచినదో లేదో చూచి రమ్మనుటయు, నతండునుం జని మరలివచ్చి "దేవా! మందరప్రాసాదంబునకు క్రిందనున్న సౌధవేదికయందు మహాశ్వేతతోడం గూడి కొని కాదంబరి యున్న" దని విన్నవించుటయు, నంత నాగంధర్వరాజపుత్రికం గనుంగొనసరిగి, యచ్చటఁ బాశుపతవ్రతధారిణులును, నరుణాంబరధారిణులును నగుపరివ్రాజికలతోడను, జటాజినమౌంజీవల్కలాషాఢధారిణులై సాక్షాన్మాత్రదేవతలంబోలు తాపసకాంతలతోడం గూడి శివశివానీ మహాసేన ధనంజయ భాస్కరాదిదేవతాప్రీతిపాత్రంబులగు స్తోత్రంబులం గావించుచు వృద్ధులగు గంధర్వబాంధవుల నర్హవిధుల సంభావించుచున్న మహాశ్వేతయును, నొకవంక మధురంబులగు వేణుదండంబులం బూని కిన్నరమిథునంబు గానంబొనర్చుచుండ, నొకదెస నారదపుత్రి మనోహరస్వనంబున సకలశుభసంధాయకంబగు మహాభారతంబును బఠింపుచుండ, నెదుటంగల మణిదర్పణంబున దంతచంద్రికార్ద్రీకృతంబగు నధరంబును జూచుకొనుచు కులుకుచున్న కాదంబరిం గనుంగొని సమీపించి యాసుధావేదికయందుగల యాసనంబునం గూర్చుండి. 124

క. ఒకయింతదనుక నటఁ బొం
దికఁ గూర్చుని పిదప హంసునిసుతం గని, రా
జకుమారుఁ డలసవిధ్వనఁ
బ్రకటగతిం దెలిసి యతని భావం బెలమిన్. 125

వ. కాదంబరిం జూచి యిట్లనియె. 126

క. హరిణాంకకరములకా హిమ
కరమణులుంబోలె నితఁడు కమలముఖీ ! నీ
సురుచిరగుణములఁ గరఁగుట
నరిగెదనని చెప్పనోపఁ డయ్యెకా దెలుపకా. 127

తే. అదియునుంగాక యితనిసైన్యములు, హితులు
నితనివృత్తాంత మెఱుఁగక వెతలఁ గుందు
చుండ నిచ్చోట నీతఁ డెట్లుండ నేర్చు
వలపు నీమీఁదఁ గలిగెఁ గలుగుఁగాక. 128

క. అన విని కాదంబరియుం
దనచెలి కిట్లనియె నివ్విధంబున నాతం
డనుమానింపఁగ నేటికిఁ
దనపరిజను నట్లమెలఁగఁ దానంగాదే. 129

క. చనవచ్చు శంక యేమిటి
కనుమం గంధర్వసుతుల నల్లన దరికిం
జనుదేరఁ బిలచి యీతని
నెనరునఁ దనపీటియందు నిలుపుం డనియెకా. 130

క. అన నతఁ డుత్థితుఁడై పెకా
వినయంబున మొదల హంసునితనూభవ కా
య్యనఁ మ్రొక్కి పిదపఁ జిత్రర
థుని కూరిమి సుతకుఁ గేలుఁదోయి మొగిచెకా. 131

తే. మొగిచి యిట్లను నేమిచెప్పుదును దేవి !
డంబములు పల్కువాని లోకంబు మెచ్చు
కొనునె ! నాయందు దయయుంచుమనుచుఁ బలికి
కన్యకాంతఃపురమునుండి కదలె నతఁడు. 132

వ. అంత. 133

క. కాదంబరియొక్కతె వెలి
గాఁ దక్కఁగలట్టిరాచకన్నియ లెల్లన్
మోదమ్మునఁ బనిచిరి పృ
థ్వీదయితు కుమారు నగరు వెలుపలిదాఁకన్. 134

తే. అట్టు లాకన్యకలు సాఁగనంపినంతఁ
జేరి కేయూరకుండు తెచ్చినహయంబు
నెక్కి గంధర్వసుతులతో హేమకూట
పర్వతమునుండి యాతఁడు బయలువెడలె. 135

సీ. ప్రీతి నల్లన మహాశ్వేతాశ్రమంబున
కరిగి యచ్చోట నింద్రాయుధాశ్వ
ఖురపుటంబులజాడ నరసి యేతెంచి య
చ్ఛోదసరస్తటి నున్న యాత్మ
సైన్యంబుఁ గాంచి యాశ్చర్యంబునుం బొంది
తన వెంటనున్న గంధర్వసుతుల
నెల్లర నిండ్లకు నేర్పడ మరలించి
పరిజనుల్ గొలువంగ నరిగి వీటి

తే. కిటుమహాశ్వేత, మదలేఖ, యిట్టిదనుచు
నిట్లుకాదంబరీసతి, యిటుతమాలి
కయు, నటంచొగిఁ బత్రలేఖకును మంత్రి
కొడుకునకుఁ జెప్పుచాప్రొద్దుఁ గడపె విభుఁడు. 136

క. నరదేవసుతుఁడు కాదం
బరివలపులఁ దవిలి తొంటివలె రాజ్యరమన్
మురిపెమునఁ జూడఁ డయ్యెన్
నరనాయకు లెంచ నూతనప్రియులుగదా! 137

క. విడువక కాదంబరి నల
వడ మదిలోఁ దలఁచుకొనుచుఁ బవడింపంగం
గడచెం దారాపీడుని
కొడుకున కారాత్రి మేలుకొనియుండఁగనే. 139

వ. మఱునాఁడు సూర్యోదయంబయినంత నమ్మనుజవల్లభుండు కాదంబరీ లగ్నచిత్తమ్మున సభామండపమధ్యగతుండై యుండి ప్రతీహారుని తోడం గూడికొని దూరంబుననుండియే నమస్కరింపుచు నరుదెంచు చున్న కేయూరకుం గాంచి రమ్ము రమ్మని కౌఁగిటం గదియించు కొని, తనసమీపమ్మునందు కూర్చుండఁబెట్టుకొని చిఱునవ్వునవ్వుచుఁ గేయూరక! మహిమాన్వితయగు మహాశ్వేతయు సఖీజనసహితయగు కాదంబరియుఁ గుశలినులైయుంటిరే చెప్పుమనుటయుం గేయూర కుండును బ్రీత్యుత్పాదనహేతువగు చంద్రాపీడుని మందహాసం బున నభిషిక్తుండయినవిధంబున దూరీకృతగమనశ్రముండై నమ స్కరించి, దేవ! మీర లీరీతి నెవ్వారిసేమంబు నడుగుచుంటిరో వార లెల్లరుం గుశలంబున నుంటిరని వచియించి, యార్ద్రకర్పటావ కుంఠితంబును, బిససూత్రబంధితముఖంబును, నార్ద్రకటీర పంకన్యస్త నవీనమృణాళవలయముద్రితంబును నగు నళినీదళపుటంబుం జూపి దానిఁ భేదించి యందుఁ గాదంబరీసంప్రేషితంబులై, మరకతమణి సమప్రభంబులై యపనీతచర్మంబులై రుచిరమంజరీమనోహరంబులై పాల్గాను క్రముక ఫలంబులను, శుకసతీగండపాండురంబులగు తాం బూలదళంబులను, హరశిరశ్చంద్రఖండ స్థూలశకలంబులంబోని కర్పూ రఖండంబులను, మృగమదసుగంధబంధురంబగు చందనాదికంబులంజూపి, చంద్రాపీడున కిట్లనియె. 140

సీ. కాదంబరి నఖాంశు కలితాంజలిన్ మౌళిఁ
దవిలించుకొని నిన్నుఁదగ భజించుఁ
గుశలంబు నడిగి యక్కునఁ జేర్చుకొని మహా
శ్వేతయుం గృప గౌరవింపుచుండు
నిజశిరోరత్నచంద్రికఁ బొల్చు నొసటఁ గేల్
గీలించుకొని మదలేఖ కొలుచుఁ
ద్వత్పదోద్గతధూళిఁ దలఁ దాల్చునటు మ్రొక్కు
చకలంకమతిఁ దమాలిక భజించు

ఆ. సకల జగదధీశ ! సకలకన్యాలోక
మెలమితోడ మిమ్ము నెల్లవేళఁ
జేరి మ్రొక్కుచుండు సీమంతమకరికా
కోటికోణ మవని దీటుకొనఁగ. 141

సీ. ధరణీశపుత్ర ! చంద్రాపీడ ! విను మహా
శ్వేతయు నీకిట్లు చెప్పుమనియె
ధన్యులు వారుగదా ! యేరికనులకు
విందుగాఁ గాన్పించుచుందువీవు
మానసన్నిధిన్ నీవు మసలుచో హిమశీత
లంబులై చంద్రమయంబులనఁగ
వెలయు నీగుణములు విరహంపుఁదటి విష
స్వప్నమయంబులుగాఁగ వరలు, నృపతి

తే. తనయ ! నీవేగినంత గంధర్వరాజ
నగరమెల్ల నిరుత్సవంబుగఁ జెలంగె
సకలముఁ బరిత్యజించు నా చందమెల్ల
నెఱుఁగుదీవైన నినుఁజూడ నిచ్చగింతు. 142

కం. మనుజాధీశకుమారా!
వినుమదిరాతనయ రోగపీడిత యగుచున్
నిను మదనతుల్య స్మేరా
ననుఁ జూడంగోరు నెమ్మనంబున నెపుడున్. 143

వ. కావున నీవు పునరాగమనంబున మమ్ము ధన్యులఁ జేసెద వనుచు నిన్నుం గోరుచుంటిని, మదభ్యర్థన యనుచితం బయ్యునీదయకుఁ బాత్రమగుఁగాక, నీకుంగల సుజనత్వంబ యీయనుచిత సందేశంబు నకుఁ బ్రధానకారణంబు. దేవ! నీవునిద్రించి తల్పంబునందున మఱచి పోయిన శేషహారంబిదిగో గొనుమని యుత్తరీయ పటాంత సంయు తంబగు నా శేషహారంబును విప్పి చంద్రాపీడుని సమీపంబున నున్న చామరగ్రాహిణి హస్తంబునందుంచి నంతఁ జంద్రాపీడుండును మహా శ్వేతాపద సమారాధన ప్రతఫలంబుగ నెంచుకొనుచుఁ బ్రియుల యందును గాదంబరీకింత యనుగ్రహంబు గదాయని పలికి కేయూ రకుని వచనంబుల శిరసావహింపుచుఁ జామరగ్రాహిణి కరంబున నున్న యా శేషహారంబుం దనయంతఁ దాఁబుచ్చికొని గళంబుననిడి కొని గృహీతతాంబూలుండై లేచి వామకరంబునం గేయూరకుం బట్టికొని యయ్యెడఁ గలరాజలోకంబును విసర్జించి యల్లనల్లన గంధ మాదనంబను గంధగజంబును గనుంగొన నరిగి యటనుండి యశ్వ శాలాభిముఖుండై వెడలుచు నటునిటుఁ జూచినంత నతనిచిత్తం బెఱింగిన ప్రతీహారులు పరిజనంబులరాక నడ్డగింపుచుండఁ గేయూర కద్వితీయుండై వాజిశాలం బ్రవేశించినంత నమ్మందురాపాలకులుం దటాలున లేచి జోహారులొనరింపుచుండ, నింద్రాయుధంబుకడకుం బోయి యవ్వారువంబు పృష్ఠభాగంబునఁ గప్పిన పుట్టంబు నొక్కిం చుక తొలఁగింపుచు నాఘోటకశాలంగలయట్టి యొకకంబంబున నిజ శరీరంబు నానుకొని కుతూహలంబున గేయూరకున కిట్లనియె. 144

సీ. నేఁ జన్మనాటనుండియును గంధర్వరా
ట్పట్టణంబున నెట్టివార్త బెరసెఁ
గంజాతదళనేత్ర గంధర్వవరపుత్రి
ఘస్రంబు లేరీతిఁ గడపుచుండె
శీతాంశుముఖి మహాశ్వేత యేమియొనర్చె
మదలేఖ యేమని మాటలాడెఁ
బాజనులెట్లు సంభాషింప గడఁగిరి
తివిరి నీవెట్లు వర్తించితోకొమా

తే. పూని గంధర్వవిభు రాజధానియందుఁ
గలుగునే నన్నుఁ గూర్చినపలుకు లెలమి
నొగర నెఱిఁగింపుమనినఁ గేయూరకుండు
క్షితిపసుతునకు నఖిలంబుఁ జెప్పెనిట్లు. 145

ఆ. వినుము నీవుఁ జనిన వెనుకఁ గాదంబరి
భృత్యవరులతోడ నెక్కి మేడ
తురగఖురసముద్గతరజోఽవిలము నీదు
మార్గమరసె దృష్టి మగుడనీక. 146

క. జగతీశ! నీవుఁగను మా
టగుడున్ మదలేఖ మూఁపునందున, సఖినె
మ్మొగమిడుకొని యించుకవడి
వగఁబొగులుచు నిలిచి దిగియెఁ బ్రాసాదంబున్. 147

వ. దిగిన పిమ్మట భవదీయ గుణగణంబులంబోలెఁ గుసుమధవళంబులగు భవనలతాపల్లవంబుల నూఁతగొనుచు నల్లన మున్నుమీరలు నిలిచియున్న క్రీడాపర్వతకంబుఁ జేరె. 148

సీ. సెలయేటినీటి చిందులం బోల్చు నీలతా
  మండపంబునఁ గూరుచుండె ననుచుఁ
జందనోదక సువాసనల నీచుచుఁ దేంట్ల
  ననుసు నీశిలఁ దానమాడె ననుచుఁ
గౌసుమధూళి సైకతములం గ్రాలు నీ
  క్షితి శూలపాణి నర్తించె ననుచు
విందు వెన్నెలనిగ్గు నిరసించు నీశ్వేత
  శిలయందు నెమ్మి భుజించె ననుచు
తే. మంచి గంధంపుఁ దావులు నిండు నీశి
లాతలంబున నిద్రించెఁ బ్రీతి ననుచుఁ
భోజనము నీకు చేతఁ దీర్పఁగఁ దెలుపఁ
జూచు చాయింతి దివసంబుఁ ద్రోచె నగగ. 149
వ. అంత నభస్తిమాలి యస్తమించుటయు. 150
ఆ. చిత్రరథుని కూర్మి పుత్రికిఁ గుసువంగ
నిచ్చలేక యున్న నెట్టకేని
నారగించె నమ్మహాశ్వేత నుడి విని
యుచటఁ జెలఁగు మణిగృహంబునందు. 151
ఆ. మిహిరుఁ డస్తమింపఁ దుహినాంశుఁ డుదయింప
నబ్జుఁడమఁ జొచ్చు ననుభయమున
గండముగళనుఁ గరములనిడుకొని
పడకటింటికరిగెఁ బద్మనయన. 152
క. అబలామణి తల్పంబునఁ
బ్రబల శిరోవేదనం జ్వరంబున్ నారా
త్రిం బఱపి ప్రొద్దున నే భూ
మిబిడౌజా ! నన్నుఁ బంపె మీ తెఱఁగెఱుఁగన్. 153

సీ. అన విని భూనాథుఁడరుగంగ నశ్వ మ
శ్వంబంచుఁ బిలువ సేవకులుఁ గడు జ
వంబున నింద్రాయుధంబును గొని తేర
ధరణీశ్వరుండు నత్తురగ మెక్కి
తగఁ బత్రలేఖను దనవెన్కనిడుకొని
ధీరు మంత్రిసుతుం గుడారమందు
నిలుమంచుఁ జెప్పి, భృత్యులఁద్రిప్పి యన్యహ
యారూఢుఁడగుచుఁ గేయూరకుండుఁ
తే. గూర్మిఁదనతోడ రా హేమకూటమునకుఁ
జేరి కాదంబరీగృహ ద్వారమందు
నశ్వముం బత్రలేఖతో నచట దిగిన
యంత నొకవర్షవరుఁ డెకురైనఁ జూచి. 154
వ. కాదంబరి యెయ్యెడంగలదని యడుగఁ గేయూరకుండును 155
క. నరవర ! క్రీడాభూధర
పరిసరమున నున్న కమలవనతీరమునం
బరగెడు హిమగృహమున నా
తరుణి మహాశ్వేతఁగూడి తానిపుడుండెన్. 156
క. ఈరీతిం దెలుపఁగఁ గే
యూరకుఁడుంద్రోవఁ జూపుచుండం గదళీ
భూరుహవనకాంతులఁ బొ
ల్పారెడు దివసంబుఁ గనియె నల్లనఁ జనుచున్. 157
వ. కాంచి యక్కదళీదళకాంతుల నడుమ నళినీదళాచ్ఛాదితంబగు హిమ
గృహంబును, దన్మధ్యభాగంబున జలదేవతల సమూహముంబోలె,
శరద్రాత్రుల సమాజముంబోలె, వరుణలక్ష్ముల సమాగముంబుం
బోలె నొప్పుచు శిశిరోపచార నిపుణంబై కాదంబరికి శరీరప్రాయం

బగు పరిజనంబుఁగాంచి, వారు గావించువందనంబులందుకొనుచుఁ బటీరపంకవిరచితవేదికాలంకృతంబులును, బుడికికకోరకకల్పితఘుంటికామనోహరంబులును, వికసితసింధువారకుసుమమంజరీచామరవిరాజితంబులును, లంబమానస్థూలమల్లికాకుట్మలహారోజ్జ్వలంబులును, మనోజ్ఞంబులును నగు పుష్పాభరణంబులం ధరించికొని మృణాళవేత్రహస్తలై సాక్షాన్మాత్రదేవతలో యనంబొలుపారు ద్వారపాలికలతోఁ జెలువారు నక్కడద్వితోరణంబులవెంబడిం జనుచుఁ జంద్రాపీడుండు నడుమ నటునిటుఁ జూచుచు నొక్కొక్కయెడ. 158

గంధోదకంబులం గ్రాలుచు సుమరజ
స్సికతాతతుల నొప్పి చిన్నవగల
సిందూరరసములం జెలఁగు వేదికలపైఁ
బఱచిన కెందమ్మి పానుపులను,
సహకార జంబూకిసాల సమాచ్ఛాది
తాభ్యంతరంబులౌ నాకుటిండ్ల
ఘనసార పల్లవోద్గత రసార్ద్రంబులై
బిస తంతు మయములౌ వసనములను,
నతుల శీతౌషధీరసాన్వితములైన
జాతిపత్త్యంబులన్ మఱి శీతలోప
చారకరణాతినిపుణులౌ వారి నాతఁ
డల్లనల్లనఁ జూచుచు నరిగియరిగి. 159

హిమవంతుని హృదయంబునుంబోలెఁ, బాశపాణికి జలక్రీడాగృహంబునుంబోలె, సకలేందు కళలకుఁ జన్మభూమియుంబోలె, సర్వమాఘమాసయామవతులకుం గులగృహంబునుంబోలె, నశేషశశాంకమణులకుఁ నివాసంబునుంబోలె, నొప్పారుచున్న యాహిమగృహంబునకుం జని తన్మధ్యభాగంబున నొక్కయెడ. 160

తే. నిఖిలకల్లోలినీపంక్తి నేర్పుమీఱఁ
గడఁగి సేవింపఁ గొలువున్న గంగవోలెఁ
జెలిమికత్తియ లిరు చక్కియల భజింపు
చుండ వారల నడుమఁ గూర్చున్నదాని. 161

తే. బోదెకాలువకరణిఁ గర్పూరరసము
చుట్టుఁబాఱుచు గుడివోలె సొంపుమీఱు
నమల బిసదండ మండపాభ్యంతరమున
నొప్పు విరిసెజ్జఁ బవడించి యున్నదాని. 162

తే. లలితహార సంపర్కంబువలనఁ దగులు
వడిన ముక్తాఫలప్రభావళియనంగ
శుష్కచందనధవళమై సొబగు మీఱు
మేనఁబులకోత్కరముఁబాల్చి మెఱయుదాని. 163

తే. చెమ్మటలఁదోఁగు నిద్దంపుఁ జెక్కుదోయి
విమలగరుదంచలంబున విసరు చెలిమి
సలలిత వతంస కుసుమసంకలితసమద
భృంగములుఁజేరి తనుఁగొల్వఁ వెలయుదాని. 164

క. అవతంస సుమ మధుప రవ
దవ పావక దగ్ధకర్ణతలము నపాంగ
స్రవ దమల బాష్పసలిల
ప్రవాహమునఁ దడుపుచును విరాజిలుదానిన్. 165

తే. కలితసంతాపభరమునఁ దొలఁగిపోవు
నాత్మదేహప్రభారాజి యనఁగనొప్పు
వసన మాయతనిశ్వాసపవనములకుఁ
దొలఁగఁ బొలుపాఱు చనుదోయి సలుపుదాని. 166

తే. సతతనిపతిత చామరచ్ఛాయతవిలి
కాంతుకడకేఁగ తెక్కలు గట్టికొనిన
చందమునఁదోఁచు బలితంపుఁ జన్నుదోయిఁ
జిగురుఁగొంగేల నదుముచుఁ జెలఁగుదాని. 167

వ. కరిణియుంబోలె, సమ్ముఖాగతప్రమదవనగంధవారణప్రసారితకరశోభితయు, నాకాశకమలినియుంబోలె, స్వచ్ఛాంబర దృశ్యమానమృణాళకోమలోరుమూలయుఁ, గుసుమచాపలేఖయుంబోలె మదనారోపితగుణకోటికాంతతరయు, మధుమాసదేవతవోలె శిశిరహారిణియు, మధుకరియుంబోలెఁ గుసుమమార్గణానులయు నగు కాదంబరిం గనుంగొనియెఁ బిదపఁ జంద్రాపీడాగమనంబుం దనకెఱింగింప నరుదెంచిన పరిజనుం గనుంగొని. "నిజముగ నతఁడేగుదెంచెనా" యొంత దవ్వుననుండెననుచు నడిగి, తనకు సమ్ముఖంబుగ నేతెంచుచంద్రాపీడుం గనుంగొని, హారమణికిరణంబులం జంద్రాపీడు నురంబుమీఁదికిం బఱపు తలంపునంబోలె సంభ్రమస్రస్తోత్తరీయాంశుకయై, నిజప్రతిబింబమును గేలూఁత నడుగుచందంబున మణికుట్టిమ నిహితంబగు వామకరంబునఁ బొలుపారుచు, విగళితకేశకలాపసంయమనశ్రమితంబై చెమ్మటలం దోఁగుచున్న దక్షిణకరంబునఁ దన్నునర్పించుకొనుచున్నదియుఁ బోలెఁ దోఁచుచు, వళితత్రికతామ్యత్రివళీతరంగితరోమరాజిం బొలుపాఱుటంజేసి మరునిచే సర్వరసంబులం బిండఁబడినట్లు పొదలుచుఁ, బ్రియప్రతిబింబప్రవేశలోభంబునంబోలెనవతంసప్రసవధూళిధూసరంబగు కపోలఫలకంబు నానందజలబిందుధారలం గడిగికొనుచుఁ జంద్రాపీడవదనసంసక్తంబగు దృష్టిచే నాకర్షింపఁబడుచున్న చందంబున, మొగంబు నొక్కించుక వంచుకొని విరిసెజ్జనుండి కాదంబరి లేచినయంతఁ జంద్రాపీడుండునుం బ్రకటితవినయుండై సమీపించి తొల్లివోలె మహాశ్వేతకు నమస్కరించిన నా

మెయు సభ్యుత్థితయై ప్రతివందనంబొనర్చి యక్కుసుమశయనంబునం గూర్చుండినంత నొకప్రతీహారి రత్నమయపీఠంబుఁ గొనివచ్చినఁ జంద్రాపీడుండును దత్పీఠంబును బాదంబునం దొలంగించి పుడమియంద కూర్చుండె, పిదపఁ గేయూరకుండు "నీమె చంద్రాపీడునకు ననుగ్రహపాత్రంబై తాంబూలకరంకవాహినియై పత్రలేఖయను పేరం జెలంగెడు నంచుం బత్రలేఖఁ గాదంబరికిం జూపింపఁ బత్రలేఖయుఁ గాదంబరికి మ్రొక్కినయంత సాదరంబుగఁ దనపజ్జఁ గూర్చుండఁ బెట్టుకొనిమాటిమాటికిఁగరతలంబున స్పృశింపుచు గౌరవింపుచుండిన చిత్రరథపుత్రికంగాంచి చంద్రాపీడుండు నిజాంతర్గతంబున నాదు హృదయంబు పరేంగితంబు నెఱుంగనోపదుకదా? ఈమెకుంగల యథార్థాభిప్రాయ మెఱుంగఁ జాలదయ్యెనని వితర్కించుకొని యట్లయిననగుఁగాక. నిపుణోక్తినీమె నడిగెదంగాకయుని కాదంబరిఁ గనుంగొని" దేవి, 168

సీ. ఏకారణమున నీకింత దుర్భరమైన
పరితాప మాత్మలోఁ బాదుకొనియె
మమ్ముల నేచుచందమ్మున నీతాప
మింతి ! నిన్ బీడింప దిది నిజంబు
నీకు స్వస్థతఁ గూర్ప నిరతంబు మదినెంతుఁ
బ్రీతి నీదేహమర్పించియైన
నతివ ! నీభుజలత లంగద శూన్యంబు
లై కృశీభూతంబులై తనర్చె
తే. నరుణకమలంబులం బోలుపాటి మెఱయు
నేలతామరతీవియంబోలె, నధిక
మైన సంతాపమున నెట్టినై సలోచ
నముల వహియించి క్రాలెదోకమలవదన. 169

క. ధరణీవరపుత్రుం డ
 త్తరుణిం గని పల్కు మఱియు దరహాసమునన్
విరితో డుమ్మెదతో డం
బర గెడు తీవియ కదా ! సొబగుమీఱు ననన్. 170

క. విని బాలయయ్యు గంధ
ర్వనరేంద్రతనూజ యతనిభావము మరుడో
య్యన దన కేర్పడ జెప్పిన
యనువున గ్రహియించి సిగ్గువంది మనమునన్. 171

తే. తరుణి సవ్యాజముగ మఱి దత్క్షణమున
వదనపంకజ సౌరభాస్వాదసంగ
తాళిపటలాంధకారితు నతని జూచు
తలపునం బోలె నగవు వెన్నెల లలబఱిచె. 172

వ. పఱపిన బ్రకించి మదలేఖ చంద్రాపీడునకి ట్లనియె. 173

సీ. నరనాథ ! యతిదారుణం బగు నీ సంజ్వ
 రం బేర్పడగ జెప్పరానిదికద !
చిన్నిప్రాయమున దోచెను నీలతాంగికి
 సంతాపమొకరింప జాలదెద్ది ?
బిసరుహంబుల తూండ్ల నెసగు లేజిగురాకు
 గమియు నిష్ఫలకుప్పకరణి దోచు
బందు వెన్నెలయు బీరెండ కైవడి నొప్పు
 నేమి సెప్పుదు ధరణీంద్ర ! శిశిర

తే. లాలిత కిసాల కల్పిత తాళవృంత
పవనసంభూతమై మది దవులుకొనిన
వెతను గన్నార నీవ చూచితివి కాదె !
యింక నీచేతనున్న దీ యింతి బ్రతుకు. 174

తే. అదియు తనశంక కుత్తరం బగునటంచుఁ
దా నెఱింగి మహాశ్వేతతో నతండు
గడఁగి గోష్ఠులతోఁ బెద్దతడవు నిలిచి
యాశ్రమశిబిరంబునకుఁ బోవ నపుడ కదలి. 175

ఉ. ఆరహిఁ వేగఁబోయి తనయశ్వము నెక్కుచుండు నంతఁ గే
యూరకుఁ డొయ్యనం గని నృపోత్తమ! యిద్యోడఁ బత్రలేఖ నిం
పారఁగ డించిపొమ్మనుచు నల్లన మీ కెఱిఁగింపఁబంచె నన్
గూరిమితోడఁ జిత్రరథుకూఁతురటంచు నతండు పల్కినన్. 176

ఆ. కమలపత్రనేత్ర కాదంబరికిఁ బత్ర
లేఖమీఁదఁ గరుణ లేక యిట్లు
కడఁకఁ బుక్కెట్లు కడుధన్య గద! యీమె
యనుచు నట్లసేసి యతఁడు సనియె. 177

ఆ. వెడలినంతఁ దండ్రికడనుండివచ్చిన
పత్రహరుఁ జూచి పలికెనిట్లు
భృత్యవరులతోడి పితయు నంతఃపుర
సతులతోడి జనని సౌఖ్యమున్నె. 178

క. అనలేచి యతఁడు మ్రొక్కుచు
ననఘాత్మ! మీరలడిగినందఱు కుశలం
బుననుండి రనుచు నొగిఁ దె
చ్చినలేఖద్వితయ మతనిచేతికి నొసఁగన్. 179

వ. ఇచ్చిన నయ్యువరాజు గడునంతసంబున నప్పత్రయుగంబు శిరసా వహించి పుచ్చుకొని తాన యక్షమ్ముదోయి విప్పి క్రమంబుగనిట్లు చదివించె. 180

సీ. శుభమస్తు సకలభూవిభు శిఖండావతం
సీకృత పదసరసీరుహుండు
సారమాహేశ్వరాచారవ్రతుఁడు మహా
రాజాధిరాజు మరాళ కుంద
రమ్యయశుండు తారాపీడుఁ డాదల
ముద్దాడి వ్రాయునదెద్దియనిన
నిమ్మేడఁగల ప్రజ లెల్లరు సుఖులు నీ
వరిగి పెక్కుదినంబులగుట నీకు
తే. తల్లిదండ్రులు నవబోధ తరుణు లూరి
వారు నినుజూడ కోర్కెనున్నారు గాన
తప్పకీలేఖఁ జూచిన తత్క్షణంబ
వచ్చిమాకోర్కె దీర్పంగ వలయుఁ బుత్ర !. 181

వ. అనుచు నొక పత్రిక జదువుకొని, పిదప శుకనాసుం డంపిన రెండవ
కమ్మఁ జూచి యందున నీయర్థంబ చదువుచున్నంత వైశంపాయ
నుండే తెంచి తానుఁ దెచ్చిన పత్రికాద్వితయంబున నయ్యర్థంబు నె
తేటపడం జూపినయంతఁ బయనంబున కంగీకరించి తురగాధిరూఢుం
డై ప్రయాణభేరి వేయించి యశ్వసైన్యంబుతోఁ దనపొంతనిలిచి
యున్న వలాహకపుత్రుండగు మేఘనాదుండను వానిం బిలిచి నీవు
కావంబరి సన్నిధికినరిగి, యీయుత్తరంబుల తెఱంగెఱింగించి నా
పల్కుగా నిట్లనుము. 182

సీ. తల్లి దండ్రులమాటఁ దలఁదాల్చి కావింప
వలయుఁ గదా యెంతవారికైన
గంధర్వవరపుత్రికకు దాస్యమొనరింపఁ
బట్టంబు హృదయంబు వ్రాసియిచ్చెఁ

గంటకకుంజంబు కరణి దేవీకృప
యవకాశము నొసంగ దరుగుటకును
నెల్లభంగులఁ దండ్రికేఁ బ్రియంబొనరింపఁ
బోయెద నుజ్జయినిపురమునకును
తే. పరమనిర్భాగ్యుఁడును బాపచరితుఁడు నయి
పరఁగు చంద్రాపీడు సత్పురుషగోష్ఠు
లాదవినవ్వాడు దలఁచుకొంచుండు మనుచు
నామె కెఱిఁగింపుమా ! వలాహకతనూజ ! 183

క. తనమేనం బ్రాణంబులు
తనకెటు నందాఁక నిన్ను ధరణీంద్రుఁడు గ
న్గొనకుండనుండఁ గలఁడని
మనమునఁ దలఁపకు మటంచు మదవతికనుమా. 184

సీ. చరణాబ్జములకు నిశ్చలభక్తి వినతిఁ గా
వించెనంచును మహాశ్వేత కనుము
కేల్గవ మొగిచి కౌఁగిటఁ జేర్చుకొనె నని
లీలావతికి మదలేఖ కనుము
కడుఁ గూర్మి నక్కునఁ గదియించుకొనెనంచు
నల తమాలికతోడ నెలమిననుము
నడిగె మీాసేమంబు ననుచు గంధర్వరా
ట్తనయకుంగల పరిజనులననుము
తే. హీనమహిమాన్వితంబగు హేమకూట
మునకు నంజలిఘటియించి మ్రొక్కినాఁడ
ననుచు నెఱిఁగింప మేఘనాదునకుఁ జెప్పి
వేడ్కమీాఱంగ నాతని వీడుకొలిపి 185

వ. వైశంపాయనుని శిబిరంబునందుండ నియమించి యాతఁడింద్రాయు
ధంబునెక్కి యవ్వార్తాహరుఁ జూచి యుజ్జయినీనగరవార్తలనడుగుచు
నశ్వసైన్యానుగమ్యమానుఁడై యుజ్జయినీపురాభిముఖుండై బయ
లువెడలి. 186

క. ఎలమిం జను చోకయటవిన్
లలిఁ దోఁచెను రక్తచందనమహీజాతో
జ్జ్వలశాఖాశిఖరంబులఁ
జెలువునఁ గనుపట్టు నెఱ్ఱజండాగనియెన్. 187

వ: కాంచి తదభిముఖుండై కొంత దవ్వరిగి కేతకీసూచిమండలపాండురం
బగు వనగజదంతంబున నిర్మింపఁబడిన కవాటంబుతోడను లోహ
తోరణంబుతోడనుం బొలుపారుచున్న యొకద్వారంబుం గనుంగొని
తదభిముఖసన్నిహితంబై, యటఁగల రుధిరబిందువుల కాసజెంది
వచ్చిన నక్కలచే నాకఁబడుచున్న యరుణాలోచనంబునఁ జెలంగు
లోహమహిషంబున డంబైన శిలావేదికం బొడంగని యచ్చో వృద్ధ
ద్రవిడధార్మికాధిష్ఠితంబగు కాత్యాయనీ సదనంబుంగనుంగొని
యయ్యెడ నద్దివసంబుగడప నిశ్చయించి యింద్రాయుధమ్ము దిగి,
భక్తియుక్తంబగు చిత్తంబున నమ్మహాశక్తికిం బ్రణమిల్లి, ప్రదక్షిణం
బొనరించి, మఱియు నమస్కృతుల నొనరించి విశ్రమించుటకై
ప్రశాంతప్రదేశంబు నన్వేషింపుచు నొక్కయెడ నెలుంగెత్తి యేడ్చు
చుఁ గోపపరీత చేతస్కుండగు ద్రవిడధార్మికుం గాంచి తదాకార
దర్శన సముద్భూతవిస్మయ విస్మృతకాదంబరీవిరహవేదనుండై కొం
డొకనవ్వు నవ్వి, మఱియు నాద్రవిడకులీనుతోఁ బరిహాసకలహం
బునఁ దగులువడిన నిజసైనికుల మరలించి యాతని నూఱడించి,
యతని జన్మభూమియు, జాతియు, విద్యయు, వయఃప్రమాణంబును
సన్యసించుటకుంగల కారణంబును, నడిగి తెలిసికొని తనకుమించిన

శౌర్యంబును, ప్రతాపంబును, విభవంబును గలవాఁడనని మెచ్చికొనుచు నతని పలుకులకుఁ జంద్రాపీడుండు చాల సంతసించి, సముపజాత పరిచయుండై యాతనికిఁ దాంబూలంబు నొసంగె, నంత సాయం సమయం బగుటయుఁ గ్రమంబున వారలందఱు నర్హాసనంబుల శయనించుటయు, నాచంద్రాపీడుండు పెక్కుగతుల హేమకూటంబు నకుం గల రమ్యత్వంబును, మహాశ్వేతకుంగల యకారణప్రీతియు నాలోచింపుచుఁగాదంబరీదర్శనంబును జన్మఫలంబుగ నెంచుకొనుచు, మదలేఖతోడి మైత్రిస్మరించుకొనుచుఁ దమాలికఁ జూడం గోరుచుఁ గేయూరకాగమనంబుఁ దలంచుకొనుచు, వేడినిట్టూర్పులఁబుచ్చుచు, శేషహారంబుఁ గడుఁబ్రీతిఁ బరికింపుచుఁ, బత్రలేఖను ధన్యురాలిఁగా నెంచుకొనుచు ననుప్రాప్త స్వప్నుండై, యారాత్రి వేగించి మఱునాఁ డుదయంబున నజ్జరద్ద్రవిడధార్మికుని యభిమతములఁ జెల్లించి యతనిచే ననిపించుకొని యటనుండి కదలి యత్యంతమనో హరంబులగు ప్రదేశంబులఁ జూచుచుఁ నల్పసంఖ్యాకదివసంబుల కుజ్జయినీపురంబుం బ్రవేశించినంత. 183

చ. తనయునిరాక రాజున కుదగ్రగతిం జని భృత్యకోటి సె
ప్పిన విని పొంతనున్న పృథివీపతులున్ బ్రెగడల్ హితుల్ భటుల్
గొనగొనితోడ రా నృపతికుంజరుఁడల్లనఁ బాదచారియై
కన నెదురైనఁ జూచి తురగంబుఁ గుమారుఁడు డిగ్గిమ్రొక్కినన్.

చ. కొడుకరుదేరఁ జూచి నృపకుంజరుఁడెంతయుఁ గౌతుకం బెసఁగ
గడలుకొనంగ రమ్మనుచుఁగ్రక్కున నాతనిఁ గౌఁగిలించి యే
ర్పడ నటనున్న పెద్దలకు వందనముల్ పొనరింపఁజేసి పొ
ల్పడరఁగ నవ్విలాసవతి యంతిపురంబున కొయ్యఁజేర్చినన్. 190

వ. అవ్విలాసవతియుం గుమారుని సముచితసంభాషణంబుల బుజ్జగింపు చుఁ గొంతతడవుండి వీడ్కొల్పిన నతండును మంత్రిగృహంబున కరిగి